శంకరకవి

# హరిశ్చంద్రోపాఖ్యానము

మద్రాసు, 1901

Record no. 182

## SUNDARAYYA VIGNANA KENDRAM

1-8-1/B/25/A, Bagh Lingampalli
Hyderabad – 500 044, Andhra Pradesh, India

## Bibliographic Record Target

శంకరకవి.

హరిశ్చంద్రోపాఖ్యానము : పద్యకావ్యము / శంకరకవి.- మద్రాసు : శ్రీరంగవిలాసముద్రాక్షరశాల, 1901.

104 p. (1) leaf of plate :ill. ;21 cm.

Record no. 182

Śaṅkarakavi.

Hariścandrōpākhyānamu : Padyakāvyamu / Śaṅkarakavi.- Madrāsu : Śrīraṅgavilāsamudrākṣaraśāla, 1901.

104 p. (1) leaf of plate :ill. ;21 cm.

Record no. 182

35 mm microfilm

Image placement: IA IIA IB IIB          Date filming began:

శ్రీరస్తు.

ఓంనమోనీలకంఠాయ.

శ్రీమదాపస్తంబసూత్రపవిత్రకౌండిన్యమునిచక్రవర్తిగోత్ర
సకలసుకవిజననానీకమిత్ర దేచమాత్యకుమార
వినయవివేకవిద్యాలంకారుండగుశంకరకవిచే
రచియింపంబడిన

# హరిశ్చంద్రోపాఖ్యానము.

## పద్యకావ్యము.

ఈగ్రంథము.
పండితులచే
లేఖకప్రమాదాదిజనితదోషంబులు
లేకుండునట్లుపరిశోధింపంబడి
వంకాయల కృష్ణస్వామిశెట్టివారి
స్వకీయ,
శ్రీరంగవిలాసముద్రాక్షరశాలయందు
ముద్రింపించిప్రచురింపంబడియె.

[redacted]
MADRAS.
1901.



శ్రీరస్తు.

శారదాంబాయై నమః

# హరిశ్చంద్రోపాఖ్యానము - ప్రథమాశ్వాసము.

శ్రీవాణీవరవాసవాదివిబుధశ్రేణీశిరోరత్నశో । భావిభ్రాజితపాదపంక
జుఁడుమాభామామనోభర్త కా। శీవిశ్వేశ్వరుఁడిందుశేఖరుఁడు రక్షించున్మహా
సారవి । ద్యావర్ధిష్ణుని బాచయప్రభుని యెల్లామాత్యచూడామణిన్॥......※

చ॥ జలనిధికన్యకొమ్మెఱుఁగుసంతతకౌస్తుభవైజయంతికా।విలసితకాంతి
వాసవునివిల్లుకృపారసధారవృష్టిగా । నెలమి నవహించుచుం బొదలు కృష్ణప
యోదము బ్రోదిసేయుస। త్ఫలితవిభూతులింపెసఁగ బాచయయెల్లనికీర్తిసస్య
ముల్॥ శా॥ నీరేజప్రభువుండు వాక్సతి జగన్నిర్మాణదక్షుండు జం।భారాతిప్రముఖ
ఖామరార్చితుఁడు వేదార్థప్రబోధక్రియా । పారీణుండు విరించి దాపజిత దేవ
త్కోరుహాసంద్రైనయా। డూరెల్లక్షితిపాలమంత్రిని జిరాయుష్మంతునిం జేయు
తన్॥ ఉ॥ అల్లదె మాతులుంగఫలమంచు నవోదయభానుమండలం।బల్లనఁజూపు
చుంబృథులహస్తముసంగబళింపఁగోరువా। గ్వల్లభముఖ్యదేవగణవంద్యపదా
బ్జుఁడు కుంజరాననుం। డెల్లనమంత్రిశేఖరునకిష్టసిద్ధికరుండు గావుతన్॥ మ॥
కరపద్మంబులఁ బుస్తకంబు శుకముం గంజాతముస్వీణెయుం । గరమొప్పం బ్రమ
దంబుతో నుపనిషద్ఘంటాపథశ్రేణిహం । సరథం బెక్కి చరించు చంద్రముఖి భా
షాదేవి సర్వజ్ఞుఁజే । యురతీశప్రతిమానరూపనిధి నీ డూరెల్ల చామాత్యునిన్॥
ఉ ॥ నల్లనివేల్పు జోటి రతినాథు కూరిమితల్లి యామినీ । వల్లభుతోడఁబుట్టువుశౌ
వాచతురాస్యవధూవయస్యయు । త్ఫుల్లసరోజహర్మ్యములఁబాల్పెసఁగన్వి
హరించు లక్ష్మి మా । యెల్లనమంత్రిశేఖరుని యింట వసించున్మనోహరాకృతిన్॥
ఉ॥ చేటికలేపధూర్జటికిశచిముఖసర్వసుపర్వభామినీ। కోటులు సద్మమే కుటిలకుం
తలకీశ్వరు మేను పుష్పమే । పాటలగంధి కంజికరభారము మైనుడు రాట్కిశోర
మా।జోటి భవాని చాలఁగృపఁజూచుచు బాచయయెల్లధీమణిన్॥ తే॥ అర్కహి
మధామభౌమసౌమ్యగురుశుక్ర। తోయజాప్తజరాహుకేతుగ్రహంబు। లెలమి
నేకాదశస్థానఫలములిత్తు। రెపుడు మనీదూరి యెల్లమంత్రీశ్వరునకు॥ వ॥ అనియి
ట్లు దేవతాప్రార్థనపూర్వకంబుగాఁ గృతిశ్వసున కాశీర్వచనంబులొసంగి

తే॥ సరవిదీపింప నామ్నాయసరణిఁ దఱిసి । పాలునీరును బోలె నేర్పఱిచినట్టి
యనఘతరమూర్తి గీర్వాణవనచరిష్ణు । బాదరాయణహంసంబుఁ బ్రస్తుతింతు॥
శా॥ తారానాథమరీచికాచయకృతోద్యన్మూర్ఛత్తరంగత్పయః । పారావా
రవినిర్మలోర్మిపటలీ పర్యాయవాఙ్నిర్మిత । శ్రీరామాయణ కావ్యసృష్టికవి
తాసిద్ధాంతశుద్ధాంతవి । ద్యారాశిన్ ఘను వామలూరుభవుఁ జేతఃప్రీతిఁ గీర్తిం
చెదన్॥ క॥ ధీరులబాణమయూరుల । భారవులై వెలయుమాఘ భారవు
లసుధా । ధారాపాణంధమకవి । తారచనావాసుఁ గాళిదాసుఁ దలంతున్॥
క॥ విమలకవిత్రయనిర్మిత । సమధికరసవత్ప్రబంధసాహిత్యకళా । సుమ
నస్తటినీకల్లో । లములఁ గ్రీడింతు నిష్కళంకప్రతిభన్॥ ఉ॥ పైకొనుకాంతఁ జే
దగిలి పల్మరు ఖీకరలోభిగేహవ । ల్మీకములందుఁ బాయనియమేయముదోద్ధతదు
ష్కవీంద్రద । ర్వీకరరాజికి న్వివిధవిశ్రుతకావ్యకళావిశేషదీ । క్షాకుశలార్య
తంత్రములు గారుడమంత్రములెందు నారయన్॥ చ॥ వడియును బ్రాసమున్నె
డకువాఁడు ప్రబంధము పూని యేమిచె । ప్పెడినఁ గుఁబాటగున్ సుకవిబృందము
ముందట మాటలాడు వెం । బడిన వితమ్ము దామె సులభస్థితితో నుచితస్థలంబు
లన్ । బడిబడి వచ్చి నిల్చి బహుభంగులఁ ద్రోవలఁ జూపకుండినన్॥ వ॥ అవిసకల
సుకవిజననమస్కారంబును నగుకవినికరతిరస్కారంబును గావించి యేనొక్క
నవీనప్రబంధంబను సంధింపం బూనుసమయంబున॥ సీ॥ తనయశోమహిమ
గంధర్వభామాహస్తవల్లకీసంగీతవర్ణనంబు । తనవదాన్యతయర్థిజనమనో
రథదానపారీణగీర్వాణపాదపంబు । తనవిలాసంబు దంతావళగామినీదృక్చ
కోరకనిశాధిపమరీచి । తనభుజావిక్రమంబనతారిదుర్మంత్రిదండశూకాచ్యుత
స్యందనంబు॥ తే॥ గాఁగ వెలసినచంద్రశేఖరసదార । విందసేవాకళాలబ్ధవిభవ
శాలి । మాన్యుఁడీటూరి యెల్లయామాత్యమౌళి । యుల్లమానందమునఁ బొంది
నొక్కనాఁడు॥ సీ॥ అలయుగంధరుసాటియగునీతికార్యక్రియాధురంధరులైన
యాప్తసచివు । లలపరాశరసూతిఁ దలపించు వేదశాస్త్రార్థవిద్యాధురీణార్య
వితతు । లలబాణునోరయు కావ్యక్రియావైఖరిసారస్యనిధులైన సత్కవీంద్రు
లలపురందరసూతి గెలువంగ నూహించు విక్రమక్రమధుర్యవీరభటులు॥ తే॥ అ
ప్సరస్త్రీలఁ బోలెడు నబ్జముఖులు । కలితసంగీతధౌరేయగాయకులను । మ
హిమఁ గొలువంగ నిజసభామందిరాంత । రమున బేరోలగంబుండి ప్రమదలీల॥
మ॥ ననుఁ గౌండిన్యమునీంద్రగోత్రజు సుధాంధస్సింధుకల్లోలతు । ల్యనిరాఘా
టవచోధురంధరుని దేచామాత్యసత్పుత్రుఁ బా । వనచారిత్రు శశాంకమౌళిపద
సేవాలబ్ధసాహిత్యస । ద్ఘను నిప్పంధు విధేయు శంకరకవిన్ దాక్షిణ్యపుణ్యాధి



కున్॥ తే॥ మమతఁ రావించి యాస్థానమున నునిచి । తత్పరత ఘీరగంధాక్షతంబు
లాది గాఁగఁ గర్పూరతాంబూలకనకభూష । ణాంబరంబులు దనియ నందంద
యొసఁగి॥ తే॥ సప్తసంతానములలో యశస్కరంబు । కృతియె కావున నీవొనరిం
చునట్టి । నిరుపమానహరిశ్చంద్రనృపచరిత్ర । మంకితము సేయు నాపేర ననఘచరి
త॥ వ॥ అనుటయు నట్ల కాక యని యంగీకరించి సరససంగీతసాహిత్యవిద్యావి
నోదగోష్ఠీవిహారుండును వసుంధరాభారభరణదక్షదక్షిణభుజాచక్షుఃశ్రవో
ధ్యాత్ముండును నవార్యతరచతురశౌర్యహార్యాత్ముండును మత్తమరాళగామినీవి
లాలనయనచకోరసంపూర్ణపూర్ణిమాచంద్రుండును భోగదేవేంద్రుండును
గపటరిపుదుర్మంత్రిజనాఖర్వగర్వపర్వతకులిశాయమానకౌక్షేయకుండును వ
నీపకమనోరథార్థదాయకుండును శంభుసేవావిశేషలబ్ధవిజృంభమాణశాశ్వ
తైశ్వర్యుండును శాండిల్యమునిచక్రవర్తిగోత్రప్రవర్ధనక్రియాధుర్యుండును న
గు నీటూరెల్లయామాత్యు వంశావతారం బభివర్ణించెద॥ శా॥ కల్యాణాత్మక
మూర్తిజృంభితతపోగాంభీర్యధుర్యాత్ముసా । కల్యామ్నాయరహస్యవేదిబుధ
లోకస్తుత్యు నంభోకభూ । తుల్యప్రాభవశాలిఁ బంకరుహబంధుస్వచ్ఛతేజస్వి
శాండిల్యున్ సంయమిచక్రవర్తిఁ దగ వర్ణింపంగ నిశ్రాంతమున్॥ తే॥ ఆమునీశ్వ
రువంశదుగ్ధాంబునిధికిఁ । బూర్ణనిహారకిరణుఁ డై వర్ణనీయ । మహిమ విలసిల్లె
సింగనామాత్యవర్యుఁ । డనఘమతి బల్లికురువపురాంకుఁ డగుచు॥ క॥ ధరలింగ
మంత్రితనయులు । సరసులు పెగ్గడనయు గౌరసచివుఁడును గుణా । భరణుండ
మరయ్యయును । స్థిరకీర్తుల వెలసి రర్థిచింతామణులై॥ చ॥ పెగ్గడమంత్రిబం
ధుజనబృందము పేర్కొననుండి శాసనుం । డగు మతిశాలి వీరసచివాగ్రణిపుత్త్రి
కందిప్పమాంబికం । దగుమహిమన్వివాహమయి ధన్యచరిత్రులఁ గాంచెఁ బుత్త్రు
లన్ । జగదభివర్ణనీయులవిశాలయశోవిభవాభిరాములన్॥ సీ॥ స్వర్ణదీఘహా
రికాసందోహవిమలయశస్కరశ్రీశాలి భాస్కరయ్య । ధారాధరామరక్ష్మా
రుహాబ్జారాతివితరణగుణహారి వీరశౌరి । చేతోభవారాతిసేవాధురీణుండు
భూతలాధిపమంత్రి పోతవిభుఁడు । సంగీతసాహిత్యచతురవిద్యాకళాలీలా
ప్రగల్భుండు లింగరాజు॥ తే॥ పెద్దలౌననఁ దనరిన పెద్దవిభుఁడు । మహిమ వెలసిరి
రాజన్యమాన్యులగుచుఁ । గల్పతరుపంచకము రీతిఁ గవిజనార్థి । యాధములకి
ష్టఫలములనొసఁగఁ జాలి॥ వ॥ వారిలోన॥ సీ॥ యాచకదారిద్ర్యహరణకారణగు
ణశ్రేణి యెవ్వాని విశ్రాణనంబు । శాతోదరీజనచేతోముదాపాదివర్ణితస్ఫూ
ర్తి యెవ్వాని మూర్తి । కపటశాత్రవమంత్రిగర్వపాథోరాశిబాడబం బెవ్వాని
బాహుబలము । దిగ్దంతిదంతకాంతిప్రహాసిప్రభావిలసనం బెవ్వాని విమలయశ

ము॥ తేఁదండశూకాదినాథమండాతుడాయు। రూఢిసేవ్యానిచాటువాక్ప్రౌఢ
శయ్యా। యతఁడుపెంపొందులోకవిఖ్యాతిఁబల్లి। కురువపెద్దనయనుమంత్రితిలకుఁజ
రుండు॥ ఉ॥ అర్థివిజాధినాయకునియంతటివాఁడురువైభవంబునన్। గద్దరివైరు
లతిద్రుణముగాఁగగనుంగొనుశౌర్యరేఖనే। ప్రాద్భునుబాంధవార్థిజనపోషణ
మేమరఁ డెట్టిధన్యుఁడో। పెద్దన దద్దయుం బ్రబలె విద్వదనీకవనీపకస్తుతిన్॥
తే॥ ప్రాజ్ఞుఁడై కీర్తిఁగనినట్టిపట్టమెట్ట। పోతనార్యునిపుత్రినంభోజనేత్రఁ। బరిణ
యంబయ్యె జక్కమాంభావదూటి। నింపుసొంపొందబెద్దమంత్రీశ్వరుండు॥ చ॥
వినుతచరిత్రచిక్కమకు బెద్దనమంత్రికిఁబ్రాభవాధికు। ల్తనయులుసంభవించిరి
ముదంబునబాచయదండనాథుఁడు। న్మనసిజవాసవాత్మజసమానవిలాసుఁడుప్రె
గ్గసయ్యయు। న్వినుతవివేకభూషణుఁడు వీరనయుంజరితార్థులెంతయున్॥ వ॥
అంతఁగ్రజుండు॥ సీ॥ కాంతాజనస్వాంతసంతోషకరరూపహసితలతాంతబా
ణాసనుండు। సుకవిసందోహసంస్తూయమానాశ్రాంతవిశ్రాణనక్రియావిబు
ధశాఖి। నిఖిలవిద్యాకళానిరవద్యవైఖరీలీలావివేకనాళీకసూతి। భర్గకోటీర
త్రిమార్గగానర్గళోర్మిచ్ఛటాసన్నిభస్వచ్ఛకీర్తి॥ తే॥ బంధుజాతపయోజా
తభాస్కరుండు। భూరిగాంభీర్యవినయవిభూషణుండు। ప్రబలెవాణీశవంశ
వారాశితుహిన। ధాముఁడీడూరిబాచప్రధానమౌళి॥ ఉ॥ యాచకలోకరక్షణస
మంచిత భూరిదయాగుణక్రియా। ఖేచరువంశ పావనుమృగీనయనా జన
పంచబాణుని। ద్యాచతురాస్యునీశ్వర పదాంబురుహద్వయ చంచరీక
ముం। బాచయమంత్రిపుంగవుని బ్రస్తుతిజేయుదు రార్యులెప్పుడున్॥ క॥
పెగడనమంత్రియశోరుచి। నగుదుహిమాచలముబక్షినాయకకులము। న్నగ
భిద్దంతావలమును। గగనధునీజలముజంద్రకాంతోపలమున్॥ చ॥ మకరపతాకు
నాకృతిహిమద్యుతినిర్మలకాంతివిష్ణుసా। యకునివిభూతిబాంధుతనయాగ్రణి
ధర్మగుణప్రశస్తిహా। టకగిరిధైర్యవృత్తిగపటప్రతిపక్షతమోధిసేంద్రుబ। ల్లి
కురువపెద్దమంత్రిసుతు లీలనుతించెద వీరనార్యునిన్॥ వీరిలోన॥ చ॥ అన
ఘుడుమల్లెప్రెగడికోమరాధిపుకూరిమిపుత్రినద్రినం। దనకెనయయ్యినపద్మనయ
నం బెదలింగమాంబ నెకట్లశా। సనుఁడగుపర్వతయ్యసుతజంద్రముఖింబినలింగ
మాంబనిం। పెనయువివాహమయ్యె విభవేంద్రుఁడు బాచయమంత్రియున్నతిన్॥
సీ॥ అవనీసురశ్రేణికిమృష్టాన్నమొసఁగదు మెలఁతలకీయింతిమేలుబంతి। ధవుని
యానతిమోహలవములంఘింపనిసఖియలకీభామజన్మసీమ। పరమపాతివ్రత్య
గర్విమఁబునొందెడు తాలుంకవతులకీమేటిజోటి। ధన్యులబుత్రరత్నములఁగాంచి
నమదూతతులకీ కాంతమతల్లితల్లి॥ తే॥ పుణ్యములప్రోగు గాంభీర్యసుసకు



నెలవు। మహితసౌభాగ్యగుణములమందిరంబు। వినుతలావణ్యలక్ష్మికినునికియైన
గ్రీలవిలసిల్లె బాచయలింగమాంబ॥ చ॥ పరితనపాలిశైవమునిభావనసేయఁగఁవు
రంధ్రిబంధుసం। తతులకుసంతతంబునుసుధామధురాన్నములన్నపూర్ణయా।
కృతిబరితుష్టిగానొసగునింపెసగంబినలింగమాంబకీ। క్షితిఁబ్రతిసేయలేరుసర
సీరుహలోచనలెన్నిచూచినన్॥ సీ॥ అనఘవర్తనుఁడు బాచయమంత్రివర్యుం
డుహరిణాక్షి పెదలింగమాంబవలన। సిద్ధతేజోనిధినెల్లయామాత్యునిహిమా
ద్రిసమధీరుసోమఘనుని। బినలింగమాంబికావనరుహాననయందురసికశేఖరుఁబె
దరామవిభుని। బినరామధీమణిప్రియవచోవైఖరిఁబ్రతిభాసమగ్రునిబర్వతయ్య॥
తే॥ గనియెవారలువంశమాకందవాటి। కావసంతులుహరిదంతకరటిదంత।
కాంతినిభహాసుకారినితాంతకీర్తి। రుచివిభూషణులర్థార్థిఖచరపతులు॥
ఉ॥ రామభుజాబలాఢ్యునిబురందరవైభవధుర్యుబాంధవా। రామవసంతమూ
ర్తినమరద్రుమపుష్పగళన్మరందధా। రామధురోక్తివైభవ ధురంధరుఁనెన్నె
డవీరమంత్రిశ్రీ। రామనదండనాయకునిరాజసభాభవనాంతరంబునన్॥ శా॥
ఈదూరీకృతసాధురీతికలనాహృద్యానవద్యంబులీ। యూడూరెల్లనమంత్రిశేఖ
రువచోహేవాకముల్తాండవ। క్రీడాకౌతుకజృంభమాణఫణిరాట్కేయూర
కోటీరగం। గాడోలాయితనిర్మలోర్మిపటలీగాఢధ్వనిప్రౌఢికిన్॥ సీ॥ గాంగే
యవిస్ఫూర్తిగాంగేయవిస్ఫూర్తినమరజేహప్రభావిమలమతుల। బంచాన
నాకృతిబంచాననాకృతిబాలుపొందుశౌర్యవిభూతులందు। నాగేంద్రవైఖరి
నాగేంద్రవైఖరివిలసిల్లెబలవచోవిభవములను। హరిజృంభణంబునహరిజృంభ
ణంబునబొదలెలక్ష్మీయోగభోగమహిమ॥ తే॥ నతముకరహాటలాటకర్ణాట
యవన। కుంతలావంతినృపసభాభ్యంతరాళ। సుకవిగాయకలోకసంస్తుత్యకీ
ర్తి। నిత్యుఁడీడూరిసోమనామాత్యమౌళి॥ మ॥ పెదరామయ్యనుబాచమంత్రి
సుతు గాంభీర్యాంబుధింగామినీ। మదనుంబేర్కొనవచ్చురాజసభలన్మందాకినీ
చందన। త్రిదశక్ష్మారుహతారహారనిభకీర్తిస్ఫూర్తిసంపూర్ణన। ర్వది
శాభాగుసిమేరుశైలధృతిగీర్వాణాదిపపాభవున్॥ క॥ వనరాశిఘనగభీరుని। బి
నరామనమంత్రివర్యుబేర్కొనగదగుం। దనరారువేడుకయాచక। జనరాధాత
నయుబాచ సచివాత్మజునిన్॥ క॥ పర్వతమంత్రినిహిమవ। త్పర్వతఘన
ధైర్యధుర్యుఁదామాజనదృ। క్పర్వతనూసౌందర్యుసు। పర్వతరుత్యాగశీలుఁబ్ర
ణుతియొనర్తున్॥ క॥ అందఱిజుండులోకా। నందకరుండాప్పనెంద్రనందస
ధనరా। న్నందనలక్ష్మీనందన। సౌందర్యస్ఫూర్తియెల్లసచివుఁడుధాత్రిన్॥ సీ॥
ఆర్యానుకూల కృత్యంబు శంభునియందు దనయందుగలుగంగ దనరినాఁడు।

ఘోరిసుదర్శనస్ఫూర్తిఁ గృష్ణనియందుఁ దనయందుఁ గలుగంగ దనరినాఁడు। చతు
రాననపౌత్రి జలజాసనుని యందుఁ దనయందుఁ గలుగంగ దనరినాఁడు। ప్రజలభో
గోన్నతి ఫణివల్లభుని యందుఁ దనయందుఁ గలుగంగ దనరినాఁడు॥ తే॥ మతివిశేషరం
పగేవలమంత్రిమాత్రు। దేధనంజయబాహుశౌర్యాధికుండు। సత్యవర్తనుఁడీ
డూరిశాసనుండు। హితవచోహరిబాచయవెల్లశౌరి॥ వ॥ అమ్మంత్రినిధానం
బునకు నిజస్థానంబు॥ వ॥ అరవిందాసనవాసవాద్యమరలోకారాధ్యకరోఁట
కే। శ్వరకారుణ్యాసవాభిరక్షితముఖాస్వద్దీప్తిమద్భూసురో। త్కరనిత్యశ్రు
తిపాఠనిస్వనముదాత్తశ్రీనజస్రంబుని। ద్ధరణింజేరోఁననొప్పుగారోఁలను
గోదావర్యుపప్రాంతంబునన్॥ సీ॥ ప్రాలేయశైలేంద్రబహుశృంగసంగతస్ఫటి
కోపలప్రభాపటలములకు। జంద్రోదయారంభసంతోషితామృతాంభోని
ధానతరంగఫేనములకు। వాసంతసమయగీర్వాణసర్వంసహాజాతశాఖాసుమ
వ్రాతములకు। వారిజాసనవధూవక్షోజపాటీరజంబాలచర్చామచర్చి
కలకు॥ తే॥ విందులీడూరివెల్లపృథ్వీకళత్ర। దండనాథయశఃకాంతిమండ
లములు। దిక్సరోజాతలోచనాదీర్ఘకర్ణ। కోణముక్తాఫలభ్రాజికుండలములు॥
శా॥ వేదార్థప్రతిపాదనప్రకటచిద్విద్యాధురీణుండు సా। క్షాదర్థేందుకళావ
తంసుడు సమగ్రప్రాభవాఢ్యుండునై। కేదారేశగురుండు సత్కృపగటాక్షిం
పంగ వర్ధిల్లుని। త్యోదారప్రతిభాగుణాభరణుఁడీడూరెల్లనార్యుండిలన్॥
శా॥ చూడం డన్యసుధాంశుబింబవదనాస్తోమంబు దానెట్టిచో। నాడం జాలఁ
డసత్యవాక్యములు గర్వాయత్తులన్మత్తులం। గూడం డెన్నఁడుఁ బూర్ణచంద్ర
సుమనఃకోదండరూపాధికుం। డీడూరెల్లనమంత్రిఁ బోలఁగలరే యెవ్వారు నిద్ధా
రుణిన్॥ చ॥ సరసజనాగ్రగణ్యుఁడును సత్యవచోరచనాధురీణతా। భరణుఁడు
నయినయట్టి ఘను బాచయయల్లని కీర్తికామినీ। కరతలపల్లికాప్రసవకందుక
మంబురుహాభియాత్రిత। త్పరిమళలోలషట్చరణపఙ్క్తి యెలాంఛనమెన్నిచూచి
నన్॥ గీ॥ సరససారసదినరాజుసత్తిరాజు। లింగయామాత్యపుత్రి నాళీక
నేత్ర। రూపగుణశీలనుతభవానీపురంధ్రి। నెలమివరియించె నీడూరివెల్లమం
త్రి॥ సీ॥ పరమపాతివ్రత్యగరిమ నరుంధతీసంపూర్ణపూర్ణిమాచంద్రవదన।
సదమలసత్యభాషావిశేషంబుల రాజీవగర్భమరాళయాన। యపరిమితంబైన
యట్టి తాలిమి కల్మి ధాత్రిసరోజాతపత్రనేత్ర। శాశ్వతైశ్వర్యవిస్తారవిస్ఫూ
ర్తులనవ్యతపాఖోరాశియాఁడుబిడ్డ॥ తే॥ బాంధవాశ్రితభూసురప్రకరసంత।
తాన్నవిశ్రాణనంబున నన్నపూర్ణ। యనఁగనీడూరివెల్లనార్యునిపురంధ్రి। వి
నుతిఁ గాంచె భవానిపావనచరిత్ర॥ ఉ॥ భావజరూపవిభ్రమవిభాసితు డెల్లన



మంత్రికి కభవా। నీవరవణిఁ నీమణికి నిర్మలకీర్తులుగల్గి రాత్మజుల్। కోవిదవర్ణ
నీయులతికోమలమూర్తులు బంధులోకసం। భావనదక్షులెంతయును బాచన
యుంగ లకబరమంత్రియున్॥ క॥ ఈదృగ్విధమహిమాయతి। కాదిత్యాపత్య
శేషపాదిత్యగవీ। సాదృశ్యవితరణశ్రీ। మోదితవిబుధేంద్రతతికి ముఖ్యస్థితికిన్॥

## షష్ఠ్యంతములు.

క॥ ఆరాధితశంభునకును। సారబలాన్వితఘనభుజాస్తంభునకున్। మారీకృ
తదంభునకుద। యారచవాబంధురత్నణారంభునకున్॥ క॥ సతతాన్నదానసం
రక్షితనానాధరణీలోకగీర్వాణునకున్। జతురవచోరచనాతి। ప్రతిభాసుకవి
త్వతత్త్వపారీణునకున్॥ క॥ గురుచరణయుగళసేవా। గురుతాత్పర్యునకు మం
త్రికులవర్యునకున్। గురుతరమతికిన్ గౌరీ। గురుసన్నిభధృతికి విసుతకోవిదతతి
కిన్॥ క॥ మానిజనవంద్యగౌరీ। జానిపదాంభోజయుగళసదమలసతత। ధ్యానవి
లీనస్వచ్ఛమ। నోనాళీకునకు సతతనుతలోకునకున్॥ క॥ పాటీరహారహిమకర।
కోటీరతుషారహారగోక్షీరమరు। ద్ఘోటకసాటకగర్భవ। ధూటీసమవిమలకీర్తి
ధుర్యోన్నతికిన్॥ క॥ నిరుపమనృపకార్యధురం। ధరునకు శాండిల్యగోత్రునకు బా
చమహీ। వరమంత్రితనూభవునకు। హరిహయవిభవునకు నెల్లనామాత్యునకున్॥
వ॥ అభ్యుదయపరంపరాభివృద్ధిగా యొనర్పఁగడంగిన హరిశ్చంద్రచరిత్రంబను మ
హాప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన॥ ఉ॥ శ్రీతరుణీమనోహరవిరించిసమా
నమహాతపోధన। ప్రాతనివాసయోగ్యమమరద్రుమతుల్యసమస్తపుణ్యభూ। జా
తలతాని కేతనవసత్త్వికముఖ్యశకుంతమెంతయున్। జైవ్రతవనంబు పొల్చు వసు
ధారమణీహరినీలభూషనై॥ చ॥ మదనవిరోధిఁ దాపససమాజముఖ్యాజయొన
దాకష। ట్పదములు పుష్పగుచ్ఛములసైభ్రమరింపవు చంద్రశేఖరున్। ముద
మునమజ్జనంబు మునిముఖ్యులు సేయక మున్న హంసము। లొదియఁగఁ బోవు తామ
రకొలంకులకవ్విపినాంతరంబులన్॥ సీ॥ వికసితకుముదారవిందసౌగంధికవిస్ఫు
రద్వాసనావిలసితంబు। చంచరీకమరాళచక్రవాకక్రౌంచబకసంచయారావ
భాసురంబు। తీరద్రుమసుమగుచ్ఛవార్యనిర్యన్మకరందసమేతాంబురాజితంబు। మ
త్స్యకచ్ఛపమహామకరాదిజలజంతుసంతానసంచారసలలితంబు॥ తే॥ సతతకే
ళీవనాసక్తసంయమీంద్ర। బాలికాకుచకాశ్మీరపంకసురభి। రంగదుల్లోలకల్లోల
సంగతంబు। రుచిరమై పొల్చునొక్క సరోవరంబు॥ తే॥ ఆసరోవరతటమునసమ
రవిటపి। కరణి నుడివోని పల్లవోత్కరలతాంత। చయశలాటుఫలాళిజాలవిట్టి।
వీగునొక్కరసాలపృథ్వీరుహంబు॥ శా॥ ఆమాకందముక్రిందధర్మజుఁడరణ్యా
వాససంశీలుడై। భీమాదుల్నిజసోదరుల్నలువురుం బ్రేమంబుతోఁ గొల్వఁగా। భా

హారత్నము చేరి ద్రౌపదిమహాభక్తి ప్రశంసింపంగనా। నామౌనీంద్రకథాప్రసం
గముల నానందంబుతో నుండఁగన్॥ వ॥ ఆ సమయంబున॥ శా॥ గండూషీకృతవేద
శాస్త్రనిఖిలగ్రంథార్థసారుండు మార్తాండానూనతనుప్రభాంచితుఁడు సుత్రా
మాదిగీర్వాణసేవ్యుండంహఃకరిసింహపోతము బుధవ్యాహారగరిష్ఠుండు మా
ర్కండేయుండు ద్వితీయబాలశశిరేఖాశేఖరుం డిమ్ములన్॥ సీ॥ భసితత్రిపుండ్రాం
కఫాలభాగముతోడ రుద్రాక్షమాలికారుచులతోడఁ। బల్లవారుణజటాపటల
భారముతోడ నవ్యపలాశదండంబుతోడ। నుత్తమవ్యాఘ్రాజినోత్తరీయముతో
డ రమణీయదర్భాంకురంబుతోడ। నతినిర్మలస్ఫటికాక్షసూత్రముతోడ ధవళయ
జ్ఞోపవీతములతోడఁ॥ తే॥ బుణ్యకల్లోలవత్యంబుపూర్ణ ఘనక। మండలముతోడ వి
నయసంపదలు పొదల। గదిసి భజియించువరశిష్యగణముతోడ। గరిమ నేతెంచె
బాండవాగ్రజునికడకు॥ సీ॥ అరుగుదెంచుటయుఁ దానల్లంతదవ్వులఁ బొడగాంచి
యెదురుగాఁ బోయి భక్తి ననుజసమేతుఁడై యందంద పెక్కువందనములొనర్చి
తోడ్కొనుచు వచ్చి। పావనసలిలార్ఘ్యపాద్యాదివిధులఁ బూజించి విశాసనా
సీనుఁ జేసి। హస్తాబ్జములు మోడ్చి యంతరంగంబున ప్రేమ ముప్పిరిగొన సేమమడి
గి॥ తే॥ సమయసముచితమృదువాక్యసరణి వెలయఁ। గోరి సుఖగోష్ఠి నడపుచుఁ
గాంతప్రోద్ధు। జరిపి కుంతీసుతాగ్రణి సంయమీంద్రు। బలికె నిట్లని వినయసంపదలు
పొదల॥ శా॥ అర్కాభ్రాజితతేజ కల్మషసమూహాంభోజహేమంతుఁడు। స్తర్కా
తీతమతిప్రభావ సుమనస్సందోహకోటీరసం। పర్కానేకమణిప్రభాళివిలస
త్పాదాంబుజద్వంద్వయో॥ మార్కండేయమునీంద్ర శక్యమె భవన్మాహాత్మ్యము
ల్వర్ణింపన్॥ క॥ విమలతపఃపరిపోషిత। కమలాసనకమలనాభకమలారికిరీ। టి
మహానుభావ నినుబో। లమహాత్ములు మజ్జగంబులను లేర రయన్॥ మత్తకోకిల॥ ఆల
పోతును జింకయున్ గరళాంక మున్న జచర్మముం। శూలముం జడలేటి దామర
చూలి బూరికపాలముం। ఫాలనేత్రము బూపచందురు బాపపేరును దాల్చుచున్।
హేలమై జరియించు దేవుఁడవీవు కేవలమౌని వే॥ క॥ ఇత్తాపసపుంగవులకు। ముత్తా
తవు నీవుగావె మజ్జగములమీ। చిత్తముల కెఱుకపడనిన్న। పోత్తమవృత్తములుంగల
వెయ్యూహింపంగన్॥ ఉ॥ కావున దొల్లి మీరరసి కాంచిన యట్టి నృపాలకోటిలో। నీ
వసుధాస్థలిం దొలుత నేమతిరాజ్యము గోలుపోయి మో। దావహలీలఁ గ్రమ్మఱఁ బ్ర
జాభినుతిం ధర నేలినట్టి ధా। త్రీవరు నానతీవలయు దేటపడం గృపతో మునీశ్వరా॥
క॥ అనియిప్పొధమున నడిగిన। వినిమార్కండేయమౌని నృపఘుదు కుంతీ। తనయా
గ్రజునకు నిట్లను। ఘనకరుణాపాంగదృగ్వికాసములడరన్॥ క॥ మనుజేశ నీవు నను
వేఁడిన మాటలు దేటపడగ డెందంబు ముదం। బును బొందసదుత్తరమగు। నిను మో



కపృథ్వీశుకథ వివేకస్ఫురణన్॥ సీ॥ ఆకాశవాహినీనీకాశపర్యంతభాసుర సరయూ
నదీభాసురంబు। పవనభుగ్స్వామినీపాథోవిహారయోగ్యానేకపరిఘాజితార్ణ
వంబు। సౌధశృంగన్యస్తజలజరాగప్రభాపాటలీకృతదిఙ్నభస్స్థలంబు। నికటలీ
లారామవికచనానావిధప్రసవసౌరభ్యవిభ్రాజితంబు॥ తే॥ కరముకొనియాడ
దగు నహంకారవైరి। ధారుణీధరజలదసమీరణంబు। ప్రబలవిభవాకరము వీరభ
టనికాయ। కేసరిక్షోణిధరము సాకేతపురము॥ తే॥ ముక్తిదము లైనపురములు
మూడునాల్గు। వానిలోనగ్రగణ్యమై వసుధమీఁద। బరగు ధనదునిపురికను పాసమ
గుచు నఖిలసిద్ధజనారాధ్యయగు నయోధ్య॥ క॥ ఆ పంకజసంభవునకు। నాపవన
భుగీశ్వరునకు నాగుహునకు నో। భూపాల పొగడ దరమే। యాపట్టణమహిమ
షోడశాంశంబైనన్॥ శా॥ ఆకాశస్పృగనేకభూరిశిఖరవ్యాసక్తవైమానికా। నీ
కంబప్పురివప్రమొప్పె సగువర్ణింపంగ నిర్మాణలీ। లాకేళీరతిఁ జక్రవాళగిరి బోల
న్నేర్పు సందిల్లఁ బ్రా। పాకాంతుండు సృజించి నిల్పిన మహాశైలంబు చందంబునన్॥
శా॥ సాలస్థూలమనోజ్ఞశృంగఘటితస్వర్ణాభనీలప్రభా। జాలంబుల్గలయంగ నం
బరమునన్ సాంద్రంబుగా బర్వినం। గాళిందీనద హేళిగన్గొని డివేడుకన్ వచ్చె నో
కాకయుం। బాలోకింపుచు సంశయింతురు సుధాహారేందుబింబాననల్॥ తే॥ నల్ల
గలువలు దొంగలు కెందామరలును। నీలమణిశుక్తివిద్రుమలీలఁదనర। శీకరంబులు
మౌక్తికశ్రీవహింప। బరగు రత్నాకరము బోలెఁ బురము పరిఘ॥ ఉ॥ శ్రీ విలసిల్లున
ప్పురి విచిత్రపుహర్మ్యతలంబులందుఁ బుం। భావరతిప్రసంగముల బల్మియు శోకకే
క్రేమంబుఁ జెందు రా। జీవదళాయతేక్షణల చెక్కుల ఘర్మపయఃకణావళుల్। ప్రోవ
గ జేయునభ్రనదిలోపలి మెల్లని చల్లదెమ్మెరల్॥ క॥ సురశిఖరిశిఖరిసమవిస్ఫురమ
న్నతశృంగఘటితశుంభన్మణికుం। భరుచిపరిపూరితాఖిల। హరిదంతరములు పు
రంబు హరిహరగృహముల్॥ తే॥ గగనగంగాంతరంగిణీకనకకమల। హా[illegible]గమ
నార్థజనకల్పితాతిహృద్య। విమలశశికాంతసోపానవితతులనగ। బొలుచుగల
ఖాతసోపురములు పురమున॥ తే॥ దానవారిప్రశస్తి నెంతయును వెలసి। భూరిప
ద్మాభిరమ్యవిస్ఫురణఁ గలిగి। శేషుకాహితమతి వసుదేవసుతుని। బోల్పుణప్పురిభద్ర
శుండాలతతులు॥ క॥ నాకస్వామితురంగము। కోకనదప్రియునిరథము గుఱ్ఱంబులు
నే। మోకాని యితరతురంగము। లాకటకములోన గలుగు హరులకు సెనయే॥ తే॥
తత్పురస్యందనములు యందనములు హృదయ। వీధి నిడుకొని మతి సుధీవిశ్వకర్మ।
కములవనబాంధవుని శతాంగములు గుబేరు। పుష్పకంబును సృజియించె బోలుపు
దోలక॥ క॥ గుణులు శ్రుతిశాస్త్రపారా। యణులు లతసూక్తివైభవాధరితసభో।
మ్యాణులు బవచస్కపసుహ। ఘణులప్పురవరములోని బ్రాహ్మణులెల్లన్॥ క॥ చాపాద్యా

త్యాచేఁ॥ క॥ పతిహితమతిగలసచివ। ప్రతతులలో మనుపుధరణిఁ బ్రఖ్యాతింబఁగను
న్నతిఁగన్నమంత్రిరత్నము। కృపపుణ్యుఁడుగలఁడుసత్యకీర్తియనంగన్॥ క॥ దేవేం
ద్రునకుబృహస్పతి। కైవడిదగుమంత్రియయ్యెఁగమనీయయశః। శ్రీ వెలయహరి
శ్చంద్ర। త్మావరునకుసత్యకీర్తిచాలఁగహితుఁడై॥ క॥ జననియుజనకుండునునై। మ
నుజేంద్రుఁడుభూప్రజాసమాజంబులనా। త్యనుకంపనుప్రోచుచునిం। పెనయమ
హీచక్రమెల్లనేలుచునుండెన్॥ తత్కాలంబున॥ ఉ॥ శ్రీకరవైభవాఢ్యుఁడుపురా
త్పతిముఖ్యుఁడుసర్వదేవతా। నీకశిరఃకిరీటమణినిర్మలపాదసరోజుఁడర్జునా। నేక
షవాహనుండుపవినిర్దళితాద్రిశచీకళత్రుఁడా। నాకమునందువేడ్కనొకనాఁడు
మహామహిమాభిరాముఁడై॥ సీ॥ ప్రవిమలచంద్రికాధవళదుకూలాంబరముఁ బొం
దుగాఁగటిరమణఁగట్టి। నవరత్నమయభూషణవ్రాతములుగళశ్రవణహస్తాదు
లసరవిదాల్చి। మంజులవాసనాపుంజరంజితమైనచందనంబును దేహమందలం
చి। తుమ్మెదగమికివిందులుసేయుమందారకుసుమదామముమౌళిఁగుదురుకొల్పి॥
తే॥ పృథులచింతామణీభద్రపీఠికాగ్రి। మునహుతాశనసమవర్తిదనుజవరుణ।
గంధవాహకుబేరశంకరులుగొలువ। గరిమవిలసిల్లెఁజేరోలగమునందు॥ వ॥ ని
తాంతసంతోషంబుఁజెంది శతానందనందనుండుకరారవిందాంగుళీనఖశిఖాం
కురంబులఁగరంబుసంగీతప్రపంచపారంగతుండై విపంచివాయించుచుంగర్ణపు
టంబులకునుదీర్ణసౌఖ్యంబుసంపాదింపనత్యంతసంరంభంబునరంభాదినిలింప
వధూవరలువరలునానావిధమృదంగడిండిమాదిధ్వానానుకారితాళకాహళ
వేణుప్రముఖనిస్వనంబులంగలసిచరణసరోజనూపురారవంబులుచెలంగననేక
విధనృత్యవిశేషంబులుచూపుచునయనోత్సవక్రియాకలాపంబులొనర్పబృందా
రకసందోహంబులుసేవాంజలిపుటంబులఁ ఫాలభాగంబులంగీలించి కైవారం
బులుసంఘటింపఁబ్రియంబునంగవిని సుపర్వనితంబినీజనంబులు కరపంకజసం
కలితకంకణఝణఝణత్కారంబులతోరంబులై విజృంభింపంబూనిచామరం
బులిడఁదదీయకోమలపవమానపరికంపితరోలంబవినీలకుంతలుండై యామఘవం
తుండు వసిష్ఠవామదేవ వ్యాసవాల్మీకి పులస్త్యాగస్త్య జైమిని జాబాలిజమ
దగ్నికణ్వకౌశికకపిలకశ్యప కౌండిన్యశాండిల్య గౌతమాదితపోధనవ్రాతంబు
లతోఁగూడివినోదగోష్ఠిఁదగిలియున్నయెడ నమ్మహామునులంజూచి యింద్రుండి
ట్లనియె॥ ఆ॥ మానులారస్వర్గమర్త్యపాతాళలో। కములయందుమీరుగన్గొ
ననినృ। పాలురెందులేరుపరికింపఁగావున। వలయునడుగవొకటిపలుకుఁడిమ్ము॥
క॥ త్రిభువనములయందునుభూ। తభవిష్యద్వర్తమానధరణీశులలో। నభినుత
సూనృతవాక్ప్రా। విభవసమగ్రుండుగలఁడె వివరింపంగన్॥ తే॥ అట్టిరాజన్యుఁస



కులలోనైకమాన్యు। దియ్యపలుకులనాకానతియ్యవలయు। మీరలొండొరుల
త్యంతసారమతుల। నరసితలపోసికృతనిశ్చయాత్ములగుచు॥ వ॥ అనియిత్తెఱంగు
నబులోమజాభర్తపలికినవాక్యంబులాకర్ణించియునాకర్ణింపనియట్లయా
శ్చర్యమనస్కులై నిశ్చయింపలేక॥ ఉ॥ ఊరకమూఁగలోయనఁగనుండిరగస్త్యపు
లస్త్యగౌతముల్। ధారుణిఁబ్రాయుచుండెజమదగ్నిపరాశరమౌనియేమియు। నో
రుమెదల్పఁడవ్వ్యాసుండువిచారమునిగ్గుబర్వఁగా। నేరకయుండెమౌనివాఁడిక
నింగిగనుంగొనుచుండెనత్రియున్॥ సీ॥ కశ్యపువదనంబుగన్గొనెజాబాలియత
డునారదునిదేహంబుగోకె। నతఁడుశాండిల్యునినమరేంద్రుమాటకునుత్తరంబి
మ్మనియొత్తిపలికె। నతఁడుభరద్వాజునల్లనయంగుళీసంజ్ఞనుబిలుమాఱుసన్నజే
సె। నతఁడుమాండవ్యమహామునిప్రవరునిగనుఁగిటెనీవెలుంగవేయుటంచు॥ తే॥ ని
ర్విఘ్నంబునసకలఋషీశ్వరులును। నీవునీవనిప్రతివాక్యనిర్ణయంబు। గానకన్యో
న్యవదనపంకజసమీక్షణములుసేయుచునుండిరిభ్రమసినట్లు॥ వ॥ అప్పుడనుప
మానవిపులతపోగరిష్ఠుండునుసకలమునిజనశ్రేష్ఠుండును భూతభవిష్యద్వర్త
మానవిదుండునునగువసిష్ఠుండుసభాసదులకలకలంబువారించిసునాసీరుం
గనుంగొనిమహాద్భుతంబుగానిట్లనియె॥ ఉ॥ ఆకర్ణింపుముపాకశాసనసుపర్వా
నీకసంసేవ్యభూ। లోకాధీశుఁడగణ్యపుణ్యుఁడుకృపాలోలాత్మకుండర్థిర। త్సా
కల్పద్రుమమద్రిధీరుఁడుహరిశ్చంద్రాభిధానుండుధా। త్రీకాంతుండొకఁడొప్పు
సూనృతవచశ్శ్రీవైభవోపేతుఁడై॥ క॥ మధ్యమలోకాధీశుఁడ। యోధ్యాపురభర్త
గర్వితోగ్రారినృపా। సాధ్యుఁడుసకలసుజనా। రాధ్యుండహిమాంశువంశర
త్నంబరయన్॥ క॥ శరణాగతరక్షామణి। కరుణాగుణధన్యుఁడగ్రగణ్యుండిరువ
ద్వరుసార్వభౌములకున। ధ్వరకృత్యసమగ్రవిమలతరపుణ్యుండిలన్॥ క॥ గంభీర
నోప్రతాపవి। జృంభితుఁడైదీవులందునేఁడింటజయ। స్తంభంబులుబహుయూప
స్తంభంబులునిల్పెనతఁడుజంభవిరోధీ॥ తే॥ ఆనృపాలాగ్రగణ్యుజిహ్వాగ్రరంగ।
సీమనటియించువాణికిశేశయాక్షి। యతఁడయీరేడుజగములనరసిజూడ। నా
డితప్పునిత్యసత్యవ్రతుండు॥ తే॥ అనినగాధిసుతుండుక్రోధాత్ముఁడగుచు। ఘోర
జీమూతపటలనిర్ఘోషమునకు। గనలిప్రతిరవమిచ్చుసింగంబుపగిది। నిష్ఠురోక్తుల
బలికెవసిష్ఠుజూచి॥ క॥ దేవసభామధ్యంబున। నీవిధమునసీకుగల్లలేటికినాఁడన్।
భూవల్లభులకునెవ్వుడుమ్మృ। షావాక్యములాడుటయెనిజంబరయంగన్॥ ఉ॥ ఒత్తు
గమాంసమున్మఘగుటోగిరముల్ఘృతశర్కరాదులుం। గుత్తుకబంటిగామెస
గిక్రొవ్వివధూరతితంత్రలీలలన్। మత్తిలిదేహముల్మఱచిమాటికిబొంకునృపా
లకోటికిన్। సత్తుదలంపనెక్కడిదిసంయమినీకిటువల్కఁబాడియే॥ క॥ భూపతులె

కోఁడసెత్తొగ్గి | తాపము లెక్కఁడవ సిష్ఠ లజ్జింపకయా | తాపసులు వినఁగను లకళ | చీ పోతో మించియుండ జెల్లు నెనీకున్ || తే|| జగతిపై గల్గు నోను వంశజుల కెల్ల | దఱుచు గాగ బురోహితత్వంబు సేయు | కారణంబున జెకుఁ మార్గములను బక | యొసగను త్తియుం చేదవు నీవు నిచటనతని || ఉ|| అందరునిట్టివాఁడు గలఁడాయన నూరక కల్ల ప్రజ్ఞలన్ | ముందఱియత్తైరుం గకసమున్నతభోగినహాంకరించిసం | కరిందునితోడ నాడితివి రస్మనియింద్రుఁడు నిస్సుబిట్టినీ | విందులకు త్తరంబుదగనిస్సునిపత్తై నెనీకు నేటికిన్ || క|| నీసుడి వెడువాక్యంబులు | నీనులకు బురందరునకు వినని౦పైనం | గానిమ్ము మాతు బూడమ | హానింద్యానులను చితంబులాకర్ణింపన్ || క|| నాపుడు వసిష్ఠసంయమి | యావిశ్వామిత్ర మహాసికలుక జనింపం | గావీక్షించు మునిల్లను | దేవేంద్రప్రముఖులైన త్రిదశులు వినఁగన్ || సీ|| ఓయి విశ్వామిత్ర యోహింపకీరీతి బ్రల్లదంబులుసల్పు చాడియగునె | యబ్ధిలంఘించినహనుమంతు ముందఱ గణన నెక్కు నెకుప్పి గంతులెల్ల | నాడు సన్నిధి సాగిరాదు వేన్నైన ననుసీద ప్రౌఢతనంబు వాదులేల | యలవైనతేయుతో నిలబిచ్చుకల నెల్లసరిచేసి మెచ్చి నకరణి నీవు || తే|| సాంద్రకీర్తి హరిశ్చంద్రచక్రవర్తి | సమముగా నెన్నదవున్న పాధముల నెల్ల | నతని సత్యంబులో సహస్రాంశమైన | గలదె తక్కిన ధారుణీకాంతులకును || ఉ|| ధన్యుని భానువంశ్యులను రాజలరాశిశశాంకుని న్నగ | న్మాన్యుని సూనృతోక్తిపణిషండసమున్నుణభాను రాజసా | మాన్యుని గాదలంచి మొసమ స్తసుపర్వతతుల్వి నంగబుర్జన్య సభాంతరంబున ను సారెకు నిందయొనర్చెదెంతయున్ || ఉ|| క్రొంచక నీవు గర్వమునగాత్రిశతయుంబోదలంగమించినిం | దించినయంతమాత్రమున నేతదనూనయశోగుణప్ర | వాంచితనిత్యసత్యమహిమాధిక ధైర్యగభీరశౌర్యముల్ | క్రొంచములవ్వెనేయకటకోపమె కాని మెఱుంగ వేమియున్ || తే|| ఆహరిశ్చంద్రసార్వభౌమాగ్రగణ్యు దొడరిదూషించెదవు వినదోషమనుచుఁ | గర్ణపుటములఁ బాణిపంకరుహయుగము | జేర్చి శివశివయని మొవసిష్ఠ మౌని || క|| అప్పుడు విశ్వామిత్రుఁడు | ముప్పిరిగొనునట్టికోపమునఁ గన్గొనలన్ | నిప్పులు రాలఁగ సమ్మునిదప్పక వీక్షించి పలికె దారుణభంగిన్ || ఉ|| ఏటికి నో వసిష్ఠ తగదీక్రియ సారెకువట్టి వాదము | ల్మాటికి మాటికిం బెనఁచి మచ్చరికంబున నాడ నీకునా | హాటకగర్భ పిష్ణుకుసుమాయుధవైరులతోడ నైనఁ దా | నోటమిబొందు నేకలహమొందినఁ గౌశికుఁ డెట్టి వేళలన్ || సీ|| ఒకన్ని పాధమునిమదోన్మత్తుఁ జంచలున నృతభాషాశీలు నధికజడునిఁ | బూని మెుతో పోచిఁబోలె బేరొంకొని యొడు మాటికి నాతోడ మత్సరమున | లవమాత్రమైన నాయవని పాలునియందుఁ బాడమనిసూనృతస్ఫురణ మిగులఁ | బ్రకటించి పుచ్చకాయకుఁ జేవఁ దెచ్చుచుఁ గీర్తింతు వేదవు వంది క్రియఁ జెలంగి || తే|| నీవ కాని హరి



శ్చంద్రుఁ డేనెఱుఁగనె | యాతఁడే యూరు సత్యవాక్యప్రశస్త | గరిమ మేయూరు నీమాట గట్టి నెట్టు | వాక్ప్రగల్భింతి బొందంగ వలదు నీకు || సీ|| నెవ్వాఁడు వింధ్యాచలేంద్రంబు గర్వంబు సర్వంబు నడచె నిర్జరులు మెచ్చ | నెవ్వాఁడు సక్రోధ హేతువీక్షణ నింద్రు నొడలెల్ల గన్నులై యుండ జేసె | నెవ్వాఁడు వేదంబు లేర్పాటుగా వించి యొన్నియుఁ గరిమ మొప్పన చ్చుకట్టె | నెవ్వాఁడు హైమవతీశుతో నెదిరించి గర్వించియరకాల గన్నుజూపె || తే|| నట్టి కుంభజ జగాతమ వ్యాసభృగువు | లుండ బ్రహ్మ భవించియు ఖండగరిమ | దనరు నేనుండ వెండియు దక్కినట్టి | యమ్మునీశ్వరులుండ నీ కేల పెనఁగ || క|| ఈమానులకంటె నునీ | వేమిటనధికుండవరయ నెఱిగింపుము నా | త్రామునితో డసు మునుకొని | యేమిటికాడితివి గర్వమిటులుండగునే || తే|| వేయు నేటికి బార్వతీవిభుని యాన | గరుడగంధర్వయక్షరాక్షససుపర్వదండ | శేషకావళులలోన మందునకును | సూనృతాలాపనియతు లెచ్చోట లేరు || వ|| అనఁటయు నవంద్యకోపాటోపంబున నరుంధతీమనోహరుం డిట్లనియె || క|| మతిబరికింపగ నాత్మ | స్తుతియును బరనిందయును విశుద్ధాత్ములు దా | మతికలుషమంద్రుతగదు | ఖ్యాత మొదవగ నన్నునే నెపొగడుకొనంగన్ || తే|| శంకరుహబాంధవుండు నుబాపతేడు | కలశజాతుండు నెఱుగంగ గమలసూతి | మనతపశ్శక్తితారతమ్యంబులెల్ల | నిశ్చయింపఁ డెయంతయు నేర్పు మెఱసి || తే|| ఆర్యుడడిగిన పలుకులకాక్షణంబ | యుచితభంగులనొసగుఁ బ్రత్యుత్తరంబు | నెట్టుకొని నీవు నాతోడ నట్టిజగడ | మునకు నేటికి బూనెదు మూఢవృత్తి || ఉ|| చంద్రకళావతంసుఁడు భుజంగమభర్తయు నైన నాహరిశ్చంద్రధరేంద్రు ప్రాభవము సన్నుతి సేయఁగ శక్తులే శరచ్చంద్రపురందరద్విరదచందనకుందమరాళమల్లికా | చంద్రమన్నృగేంద్రములన్ గెలువ జాలు తదీయయశోవిలాసముల్ || శా|| సత్యశ్రీనిధి రాజమాత్రుఁడె హరిశ్చంద్రుండహంకారవ | త్పృత్యర్థి క్షితిపాలసైన్యతిమిరప్రాభాతమిత్రాయమా | నాత్యంతోగ్రభుజాకృపాణజనితోద్యత్కీర్తిగంగానదీ | నిత్యక్షాళితసర్వలోకదురితానీకుండు వీక్షింపగన్ || క|| పరిహాసమునకునైనను | మఱికలలోనైన గాకమఱపునైనన్ | ధరణిపయి హరిశ్చంద్రుడు | హరహర పరికింప సనృతమాడెడువాఁడే || మ|| మదిరాపానసమంబు గాదలచు నస్మార్తాండవంశోత్తముం | డుదయాంభోనిధి పల్కఁబోంకుటలు దుష్టంగా డివర్తించుటల్ | తుదిజండాలునితోడి సంగతిగ జేతోవీధి భావించు స | ర్వదిగంతస్ఫుటకీర్తి మాలధనమై వర్తించు నత్యున్నతిన్ || క|| పరశాతోదరులు సహోదరులుం దల్లులును భ్రాతదయ మెల్లపుడుం | గరమల్లసిల్లు మిత్రుడు | వరధర్మము దలచి చూడ వర్మ మతనికిన్ || తే|| అంతకంతకు రోషంబులలమ్మి పియము | దకిలి నీమాకకటనగనేనోక్కట

నగేవట్టి మాటలనిట్టు జాలిబెట్ట నేల। వినుము కౌశిక యొకపల్కు విశదముగను॥ సీ॥ అపరదిక్తటమున దపనుండు వొడిచిన గాంగేయశైలంబు గ్రుంగబడిన। సౌరిదినంభోనిధుల్పుష్పీభవించిన దమ్మిచూలివరంబు దప్పిచనిన। జలభారితంభోళిసరణి దాటించిన ధరణిమండలము దిర్దిరవిరిగిన। హవ్యవాహనుడు శైత్యంబువహించిన బ్రహ్మాండఖాండంబు పగిలియలయిన॥ తే॥ నాహరిశ్చంద్రమనుజేంద్రుడనృతమాడడనినన మ్మునివరు నిశ్చయార్థమునకు। గనలి వెండియు నిట్లను గౌశికుండు। ఘనతరాంగారములు కన్నుగవను వెడల॥ తే॥ బావు రేనీదు పలుకులకీపురంద। రాది బృందారకులును సంయములు మెచ్చి। రింక జాలింపు పలసితి వెంత సేపు। వాక్పరిశ్రాంతి బొందగవచ్చునీకు॥ క॥ పలుమరు నీరీతి వృథా। కలహంబుల కేమిఫలము గలిగెడు నీమా। టలు మేము విశ్వసింపము। తెలియంగావలయు వానిదృఢసూనృతముల్॥ ఉ॥ ఏవిధినైన జుట్టికొని యేజలపట్టి త్రిశంకు పట్టినా। నావిధలీలలం గపటనాటకముల్ప్రచరించి దైన్యల। క్ష్మీవిభవంబుమాపి చలచిత్తుని జేసి యసత్యవాక్యముల్। కేవలదుర్మనీష బలికించిన బన్నిద మేమి చెప్పుమా॥ ఉ॥ ఎంతకు జాలి నిల్చెదప్పుహీనత నాకెదిరించి నీవు నీ। పంతము చూపుమా ధరణిపాలుని పాలికి బోయి యీతెఱంగెంతయు జెప్పి దైన్యము హిమాన్వితు జేయుము నానరుంధతీ। కాంతుడ నవ్వియుట్లనియె గాధితనూజునితోడ గ్రోధియై॥ ఆ॥ ఇపుడు నాకు జేయనేటికి నామహీ। కాంతు నధికధైర్యవంతు గానో। నచ్చినాడు మున్ను నాళీకగర్భుండు। మాటుతేని ధృతి హిమాద్రియతడు॥ క॥ కప్పురము పుట్టుతోడనె। యొప్పుల పరిమళము గూడ నుదయించిన యా। చొప్పున నతడు జనింపగ। నప్పుడె సత్యవ్రతంబు నంకురమయ్యెన్॥ తే॥ ఆనరేంద్రుని సత్యమే నరసిచూడ। కనిమిషాధిపుతోడ నేనాడ నెంత। వెడగ నేనీకు నిట్లు గర్వించి నన్ను। జను నెయ్యెకసక్కెములు సల్లసములు వలుక॥ ఉ॥ నీవును నిన్నుబోలెడు మునిప్రవరుల్పది వేలుగూడి మా। యావనరాశి ముంచి హృదయంబు గలంచి మసెబాగ్రిదుఃఖసం। భావితు గాగ జేసినను భావములో నణుమాత్రమైన నా। భూవరవంశవర్ధనుడు బొంకమి కెంతటికైన జాలెడన్॥ మ॥ తన సామ్రాజ్యము వాసి నంగులవధూత్తంసంబు వర్జించి నం। దనసంయుండై డీల్గినహీనకృత్యముల చేతం దుర్దశం బొందినన్। వనటం గుందిన నానరేంద్రుడు మనోవాక్కాయకర్మంబులం। దనృతం బాడిన నా ప్రతిజ్ఞ వినువిశ్వామిత్ర చిత్రంబుగన్॥ సీ॥ పలుమాఱు నను నీవు పరిహాసమునరింప మేటివిప్రత్వంబు విటచ్చి। తపమును జపమంత్రతంత్రముల్డిగనాడి వేదశాస్త్రాభ్యాసవిధులు విడిచి। సంధ్యాద్యనుష్ఠానసత్క్రియల్ పోకార్చి కటినారచీరలు కట్టుటుడిగి। బోడివై జన్నిదంబులు డించి పొలైదివి మపవిత్రముగ బూదినలందిపేడ॥ తే॥ వారుణీపూర్ణ మనుజకపాలపాణి।



నగుచు ఖరవాహనుండ వైయామ్యదిశకు। నభిముఖంబుగ గమనింతు నఖిలజనులు। రోసి తొలంగ నంగబీభత్సరూపమునను॥ వ॥ అనియివ్విధంబున నవ్వసిష్ఠమునిశ్రేష్ఠుండు పలుకు నిష్ఠురప్రతిజ్ఞావచనంబులు విని రెండవ కుసుమకోదండ వైరియగు నకౌశికుండు నాసికాపుటంబు లదర మహోత్కటక్రోధమానసుండై యథర్మారంభవర్జితంబగు సుధర్మామధ్యంబున లేచి నిలుచుండి పురందరాది బృందారకబృందంబులు తాపసజనసందోహంబులు మదీయప్రతిజ్ఞ వినుండని ప్రచండరవంబున నిట్లనియె॥ తే॥ చలము దలముగ నాహరిశ్చంద్రుజేరి। భూరికోపాగ్నికింధనంబుగ నొనర్చి। పెక్కుమాయలు వన్ని గాంభీర్యధైర్య। హీనుగావించి బొంకింతు భూమి యేను॥ సీ॥ బొంకింపలేకున్న భుజగకంకణుగూర్చి యనిలజలాహారినగుచు దోర్బలి హిమవన్నగంబున నమితహాయనములు తపము చేసిన సుకృతంబులోన నర్థాంశము సంగిలోకైకవిఖ్యాతిగాంచగ జతుర్దశమహాయుగములవని। బూజ్యసామ్రాజ్యవిస్ఫూర్తుల బొందించి తదనంతరంబ యీత్రిదివమునను॥ తే॥ శమనుడు పదునాల్గుమన్వంతరముల దాక। నముచిసూదనునర్ధాసనంబునందు। నీరజారాతికోటీర నీరజాతు। నీరజాసను లెఱుగంగ నిలుపువాడ॥ వ॥ అని యివ్విధంబున నమ్మునికుంజరంబు లన్యోన్యాభీకరక్రోధాతిరేకంబులం బ్రతిజ్ఞలు పలుకుటయు॥ ఉ॥ కుంభిని దిర్దిరం దిరిగె గుమ్మరిసారెవిధంబున ద్దిశా। కుంభులు ప్రమొగ్గ మేరుగిరి క్రుంగగ పతించి మతింజలించె చెవి। శ్వంభరుడంతయు న్బెదరె సాగరముల్గలంగంగ చాలె సం। స్తంభిత తేజుడయ్యె రవి తారలు రాలె మహాద్భుతంబుగన్॥ తే॥ తలలు వేయును ముడిచె బృదాకువిభుడు। మానక దళంగ గ్రొచ్చె నంబరతలంబు। దిక్కులన్నియు నాకటక్కవక్కలయ్యె। జెల్లు బలిమందిరంబు ఘూర్ణిల్లెనపుడు॥ వ॥ అప్పుడు శునాశీరుండు ప్రకంపితశరీరుండును విన్యస్తభయచేతనుండును విస్రస్తహస్తశతకోటియునై పేరోలగంబు చాలించె బృందారకబృందంబులు డెందంబుల నమందంబులగు భయంబులం బొదివి కలతం బెగడుచు నొక్కరుండుచనిన తెరువునం గదిసి వేఱొక్కరుండు చనక నలుదిక్కులకుం బఱవం దొడంగిరి మునిజనంబులన్యోన్యముఖావలోకనంబులు సేయుచు నాహాకారంబులు చెలంగ జటాభారంబులు వీడి నేలం దాకం దూలియోడ నొండొరుల గడవ నాలస్యంబు పక్కపడి వసిష్ఠకౌశికుల భీషణరోషపావకవిస్ఫులింగంబుల భంగంబులై చతుర్దశభువనంబులకు దుర్దాంతతాపంబు నాపాదించునని యుగ్గడింపుచు దిగ్గన నిజాశ్రమంబులకు జనిరి వసిష్ఠకౌశికులు నంతరంగంబుల గోపంబులు గాఢంబుండ దమతమ నివాసంబులకుం బోయి రంత॥ మ॥ ప్రసవితకింశుకప్రముఖపాదపజాలము పాంథలోకభయా। నసహితా

పకారణమునందితకోకిలకీరశారికా। భాసురమై వెలుఁదనాచలనభస్వదుదారమున
వచ్చెఁజైత్రము॥ య్యాసమశరప్రతాపముమహాభ్యుదయంబున బొందుచుండఁ
గన్॥ ఆట్టిచైత్రారంభంబున॥ తే॥ మహితబహుయజ్ఞదీక్షాసమర్థుఁడైన। యా
హరిశ్చంద్రనరపతిసాంగనియతి। వెలయనొకయజ్ఞమొనరించివిపులకీర్తికి। భూ
రిదానంబు వెట్టెనవారితముగ॥ వ॥ ఇట్టుటయుద్ధతస్వాంతుశేలంబులనియానరద్ధిం
చికపటకృత్యనిత్యతాత్పర్యనిపుణుండగునగ్గాధినందనుండు॥ క॥ నాతలఁపునకనుకూ
లం। బైతనరఁగవిఘ్నముగనైనాసూనృతమా। కృచ్చెతరహరిశ్చంద్రక్ష్మాతలపతి
కడకునిపుడచనియెదవేగన్॥ తే॥ చనిప్రియంబుననాశీర్వచనములొసఁగిక్షితి
పుట్టించియజ్ఞంబుపేరుచెప్పి। యగణితంబైనస్వాపతేయంబువేఁడి। తివిరిబాం
కింతుమడిలోనిధృతిగలంచి॥ అనికృతనిశ్చయుండయి॥ ఉ॥ బుధ్యరవిందసూతి
మునిపుంగవుఁడప్పుడయేగదేవతా। రాధ్యకుగర్వవత్సకలరాక్షసవల్లభకైతవ
క్రియా। సాధ్యకునిర్జరీజనలసత్తనుమధ్యకుసర్వవస్తుసా। న్నిధ్యకరయోధ్యకున్నివ
లసీరమహాసరయూప్రభోధ్యకున్॥ వ॥ చనియప్పురంబుగనుంగొని ప్రవేశించి
రాజమందిరద్వారంబుచేరిమహావైభవంబునఁ బేరోలగంబున్నహరిశ్చంద్రన
రేంద్రుంగనుంగొనుటయునతండత్యంతసంభ్రమంబున నెదుర్కొనివినయపూ
ర్వకంబుగా నమస్కారంబులొనర్చి॥ తే॥ విమలమతినర్ఘ్యపాద్యాదివిధుల
బూజలొసఁగియర్హాసనంబుపైనునిచి కేలు। దామరలుమాళిఁజేర్చిమోదంబు
పొదల। మునిశిఖామణియిచ్చుదీవనలుగాంచి॥ క॥ దురితాంధకారనవభా। స్కర
బింబకృపావిధేయగాధేయమహా। పరమతపోధననీసరి। పరికింపఁగలేరుమును
లుప్రాభవచరితా॥ తే॥ బ్రహ్మతోడనునహమించిప్రాభవమున। మించిప్రతిసృ
ష్టిచేసిబ్రహ్మాభవించి। విమలతరకీర్తిఁగాంచినవేదమూర్తి। వసుధుంబొగడొం
దితపితాపసాగ్రగణ్య॥ ఉ॥ కౌశికమౌనివర్యకడఁకన్నసుధన్యునిజేయఁగోరివేం।
చేసితిరేఁగృతార్థమతిఁజెలదితిసాంగమహాధ్వరక్రియా। కౌశలపుణ్యసంపద
లుగాంచితిమించితిరాజకోటిలో। వాసికినెక్కితిందగినవాంఛితమెయ్యదివేఁ
డుండిచ్చెదన్॥ వ॥ అనినవిశ్వంభరాశక్రునకువిశ్వామిత్రుండిట్లనియె॥ క॥ నరవ
రరూపముఁదాల్చిన। పురుహూతమహీరుహమవుపురుడెంపఁగనీ। సరితేరువన
ధిపరివృత। ధరణీచక్రంబులోనదాన్యులుధన్యుల్॥ క॥ వేలుపులోనునుగుమ్మడు।
పాలడిగడురీతిధరణిపాలయశశ్శ్రీ॥ లోకయొకయల్పదానము। వాలాయము
గాఁగనష్టగవచ్చితనిన్నున్॥ క॥ సితకరమౌళికిఁబ్రియముగ। గ్రతువొక్కటియా
చరింపఁగఁజేగితినీకాక్రతుతంత్రమునాంగంబుగ। హితమతినీదేర్పవలయునిన
కులతిలకా॥ క॥ జనుఁడుమకరినెక్కిదేహారం। బనయమునిక్కించిరత్నతుంబరమున



కైచనవిడిచినంతప్రోవిడు। ధనమిచ్చినయధ్వరముయథావిధినడపున్॥ వ॥ అను
టయునారాజన్యుండతిధన్యుండనై నన్నుమీరడిగినవిత్తంబుచిత్తంబురంజిల్లఁ
ద్వరితంబయిచ్చెదగొనుండనిన నగ్గాధినందనుండుశిరఃకంపంబుచేసి మహాశ్చ
ర్యంబునుంబొంది యామహాయమ్మహానుభావునియనూనదానప్రభావంబింతయొ
ప్పనేయనివక్కాణించుచునమ్మహీవల్లభునకిట్లనియె॥ తే॥ క్షోణినాయకనీమన
శ్శుద్ధిఁదెలియ। వలసియడిగితిఁగాకనీవంటిదాత। నిందువేడ్కఁబ్రసన్నుఁడై
యుండమాకు। నిట్టిసమయంబులనుధనంబేమిప్రాఁతి॥ తే॥ చాలనక్కఱయొదవి
నవేళవచ్చి। పుచ్చుకొనియెదనిప్పుడునీవిచ్చువిత్త। మింకమాయుత్తరంబునీవేమిప
లికి। తనుసదాశిష్యనానభూనాథతిలక॥ వ॥ నీకుఁజిరాయురారోగ్యంబులు
నభిరామక్షేమంబులగుఁబోయివచ్చెదనని యుచ్చాటముహూర్తమాత్రంబు
నుండఁడయ్యెకనిజాశ్రమంబునకుంజనియె నంతనమ్మహీవల్లభుండున్నల్లంబునఁజె
ల్లువితరణస్ఫురణ॥ తే॥ విత్తమిప్పుడుగొనిచన్నఁజిత్తమునవి। చారమూరుఁడనైకడు
నస్స్రుదముననుండఁగాఁగల్గినప్పపైనునిచెనతఁడు। క్రోధమతినెట్టితత్తీవేంధ
నోధనంబు॥ క॥ వనరుహగర్భునకైనను। వనరుహలోచనునకైనవనరుహశిప్ర
బా। టునకైనదరముగావ। మ్మునివరుకోపాగ్నికెదిరిమొనకట్టంగన్॥ వ॥ అనిమ
నంబునందలంకుచునిరంతరపరిపాలితమహీమండలుండైయుండె నంతనక్కడ
నితాంతకపటక్రియాధౌరేయుండగు నగ్గాథేయుండు వెండియునొక్కకపట
మతంబువిచారించియతిత్వరితంబున॥ క॥ నూతనజవసత్వంబులు। నూతనతనుప
ణోమములనునూతనగతులన్। నూతనభంగులనొప్పెడి। కైతవమృగఖగచయ
బుగల్పించెన్నృపా॥ వ॥ ఇట్లునల్పకుహనాచాతుర్యంబునంగల్పించిపంచినసమ్మృ
గఖగవ్రాతంబులుగణనాతీతంబులై యొక్కఁడజూచినరదామనై యుక్కివి
గిలియొక్కమొగింబికట్టిల్లిపెక్కుదెఱంగులనత్యంతభయంకరకృత్యంబుల
జెలంగిఫలితంబులగు కలమాదిసస్యంబులు మేసిపడద్రొసిమట్టిమల్లాడియు నా
రామంబులునిక్షుదండంబులుఖండంబులుగావించియు గదళీతరుషండంబులువి
దళించియు మల్లికామాధవీద్రాక్షాదిలతావితానంబులుత్రెంచియు గోమ్ముల
గోరాడితటాకంబులుపటాపంచలుగావించియుగ్రమ్మియుదండదండమ్మకో
లంకులగలంచికాతియుపెట్టియు గోష్ఠంబులగోవత్సనికాయంబుల నపాయం
బునొందించుచుజనపదంబులమనుష్యులభావివిచంపియు బహువిధంబుల గో
లాహలంబుసేయుటయుహాలాహలవిషజ్వాలంబులచేత దేవదానవానీకంబు
లుంబోలెననేకంబులుమహీప్రజాసంఘంబులుహీనభయంబులనొలసిదుచుం
జనిహరిశ్చంద్రనరేంద్రునింగనుంగొనిసర్వాంగసంగతోర్వీమండలంబులసుదం

డప్రణామంబులాచరించి మస్తకన్యస్తహస్తారవిందులై యిట్లనిరి॥ సీ॥ సదయుం
డవై నేటితుదదాక నుమునీవు పెంపుదీపింపఁ బాలింపుచుండ । నీరీతి బాధల నెన్న
డు పొందక నీ చల్లదనమున నిండు వేడ్క । దల్లిదండ్రుల యొద్దితనయుల గతి మాకుమ
ఱుగుపిం దెలరీతి నేఁటి వహించి । భవనంబులను వెండి పైడియు నడబడగు ఱతి లేనిపా
డియు గూడుగలిగి॥ తే॥ క్రీడమై నెండకన్నును నీడకన్ను । నెఱుఁగ కన్నుల దమ్ముల హి
తుల సుతుల । గూడిసుఖమున్న వారము కోరుక్కలొదవ । సత్యసల్లాపయోహరి
శ్చంద్రభూప॥ ఉ॥ జారులుఁ జోరులు న్విమలసత్యవిదూరులుఁ గ్రూరులున్న రా ।
చారులు తేరయాచకులు సాధులబాధలొనర్చు భీకరా । కారులు లేరు లేరుమఱి క
ల్మషచిత్తులు మత్తులున్నరి । శ్రీరమణాగ్రగణ్య వివరింపఁ భవత్పరిపాలితావనిన్॥
క॥ క్షితిసకలసస్యవతియై । యతిసాంద్రంబుగ ఫలించు నపమృత్యువులె । ట్టితఱిం
బ్రభవింపవు కదు । హితముగ నెలమూఁడు వాన లెలమిం గురియున్॥ చ॥ చిరతర
దేవతాగృహవిశేషమహోత్సవకృత్యముల్పరం । పరలుగ సాగునెల్లప్పుడుఁ బ
్రపవుష్పశలాటుసత్ఫలో । త్కరములఁ బొల్చు పాదపనికాయములింక వునిర్మ
లాంబువుల్ । సరసులనేఱులం బిడుకుఁ జాలఁగ గోవులు దుగ్ధపూరముల్॥ సీ॥ ఇట్లు
వర్తింపంగ నిప్పుడు కొన్నాళ్ళ గోలె ధరింపంగఁ గొలఁది గాక । బ్రహ్మకైన నుగ
ణింపఁగరాని పిక్కువన్నెల మెకంబులును బుల్గులును నేల । యీ నినయట్లు కోట్లా
నకోట్లు గూడి తారణతరనినాదములు చెలఁగ । జెయ్వులుతోఁటలు చేలు గా
ఱుపులును నేపెల్లఁ దూలఁగ రూపుమాపి॥ తే॥ యాలమందలఁ గొందలంబందఁజే
సి । జనపదంబుల మనుజులఁ జంపుచుండఁ । గదలమెలగంగ శంకించి కాఁపురములు వ
ిడిచివచ్చితిమో పృథివీకళత్ర॥ క॥ ఈమృగబాధలు మాన్పిద । యామతి మనుఁ
బోవవలయు హాలహలాగ్ని స్తోమభయమడిపి యమరులఁ । బ్రేమన్రక్షించినట్టి
మృడుని విధమునన్॥ చ॥ అనినఁగృపారసంబు హృదయాంబురుహంబున సంజనిం
పన । య్యినకులరత్నమిట్లను మహీప్రజలందని యాంగఁ జూచి మీ । కనఁ యుమ నింత
మాత్రమున కై భయమందుచు నుండ నేల యీ । ఘనమృగభీతి మాన్పెదసుఖస్థి తి
మీకొనఁగూడునట్లుగన్॥ వ॥ అనియభయప్రదానంబొసంగి యమ్మహీప్రజా
సందోహంబుల వీడుకొలిపెనంత॥ ఉ॥ పంకజగర్భసృష్టిసుమధూపంబులు వృతము
లందుబత్తులుం । బంకరుహాప్తులందురతిభర్త యుజేరివసింపవాప్పెను । ప్పం
కరుహాప్తుఁడస్తగిరిపైఁ గడుమందమునై నరత్నులన్ । మంకెన పువ్వు గుత్తి క్రియ
మండలమంతయుఁ గెంపు లీనఁగన్॥ చ॥ తరుణవయస్కుఁడైన హిమధాముని మిం
దమునం బునిల్పియుం । బరసతి సన్నుపుష్పసు మమానదలంచినఁ జాలసిగ్గునం । దిశ్వతి
తదకిన్నుపొంగిన విధంబునఁ బశ్చిమ వాహిని గ్రుంకె భా । నుఁ డుఁగుముద్యతిశతిన



నంగవికాసకళామిషంబునన్॥ క॥ అనుపమతేజోనిధియగు । దినవాథుని మహిమ
రాశి దేరిన చందంబున సాంధ్యరాగదీధితి । గనుపట్టె నవీనకింశుకప్రసవరుచిన్॥
క॥ హేలాగతి విరహులపై । నోలిన్రతిపల్లభుఁడు ప్రయోగించు మహా । నీలోత్పల
శరజాలము । పోలికఁ దిమిరంబు దిశలఁ బొరిబొరిఁ బర్వెన్॥ క॥ మృగనాభిపరిమ్లా
రితో । నగభిన్మణిపేటికరణి నలినభవాండం । బుగనుంగొనఁగను బట్టెను । మిగులఁ
దమస్సముదయంబు మెండుకొనంగన్॥ తే॥ యామినీచంద్రవదనవియత్సరేం
ద్ర । నీలమణిపాత్రలో పలనించినట్టి । విమలఘనసారశకలసంఘములనంగఁ । బ్ర
బలెనత్తు త్రవితతులంబరమునందు॥ వ॥ అంత॥ ఉ॥ శంకరమౌళిభూషణము సార
సమిత్రుని తోడి జోడు మీ । నాంకుని మేనమామ కలశాంబుధి కూరిమి పట్టి యామి
ని । పంకరుహాయతాక్షి ప్రియభర్త వియోగ్గృహమధ్యదీపమే । నాంకుఁడు గాన
నయ్యె నుదయాద్రిపయిం దిమిరేభసింహమై॥ క॥ నిండారు కళలహిమకరు । మం
డలమొప్పారెనయనమహమొదవఁగ నా । ఖండలదిక్సతి మౌక్తిక । కుండలమనవి
మలకాంతికోమరుదశిర్పన్॥ శా॥ కాకాకాశగునీతరంగచయసీకాశద్యుతిస్ఫాట
మై । కాసెం గౌముదిచక్కఁగా సకలదిగ్భాగంబులన్మన్మథుం । డేసెం బాంథజన
ప్రజంబుల పయిన్ జృంభించి లీలాధను । ర్వైశారద్యమునివ్వటిల్లఁ బ్రసవాస్త్ర
శ్రేణులం బెల్లుగన్॥ ఉ॥ నారణలేక యొక్కమొగి వాంఛలు దీరఁగ సాంద్రచంద్రి
కా । పారణ సేయుచుం బొదలెఁ దాయని వేడ్కఁ జకోరవారముల్ । కైరవబాం
ధవోపలనికాయములో లిప్రవించెనేఱులై । జారులుచోరులుం గడువిచారవ
నొందిరి పొంగవారిధుల్॥ వ॥ ఆసమయంబున హరిశ్చంద్రధరణీవల్లభుండు
తాత్కాలోచితకృత్యంబులు నిర్వర్తించి నిద్రింపం దొడంగెనంత॥ తే॥ కాముకే
పరిశ్రాంతిఁ గన్నుమోడ్చి । వేడ్కనిద్రించు విటవిటీవితతి బెదరఁ । గృక్కుటంబుల
కొక్కరోకోయటంచుఁ । గూయఁ జొచ్చెఁ గరోరసిఘూర్ణమణములు॥ సీ॥ చంద్రుఁ
డద్దపుబిళ్ళచందానఁ బశ్చిమ దిశనిల్చెఁ గాంతిమందీభవించి । యొక్కటొక్కటి చి
క్కెఁ జుక్కలాకసమున నాడ కాడకుఁ గడు నల్పరుచుల । విటవిటీతతులపై పిష
మాయుధుఁడు రోషమెడలి బాణాసన మెక్కుడించె । వనములసింధుజీవనములఁ
జెలరేఁగెఁ గలయంగ బహుపక్షికలకలములు॥ తే॥ కాంతుతుడి పోయె గృహదీ
పకళికలెల్లఁ । జక్రదంపతులలరె నిర్వక్రలీల । నంబుజంబులు విరిసి రోలంబములకు
విందులొనరించె ప్రాభాతవేళయందు॥ మ॥ ధరణీనిర్జరరాజి ప్రముక్కశతపత్రం
బుల్వి జృంభించెప । ట్చరణశ్రేణుల కెల్లనామెతలు పెట్టుం జక్రవాకావళుల్ । పర
మానందముఁబొందబింబరుచిబింబశ్రీ విడంబింపసం । బరరత్నంబుదయించె
జంభరిపుహర్మ్యస్వర్ణకుంభాకృతిన్॥ వ॥ అనినవినికాంతేయం గజుండటమిఁ

దివ్యాస్త్రారితంబై యెఱింగింపు మనుటయు॥ మ॥ అమరాహ్లోకహ దానదానవవిపక్షా
స్త్రాంఘ్రిసేనాకళా । కమనీయస్థిరభావభావభవతాకా చంద్రసీకాశకా।
శమరాశిప్రతిమానసిర్మలయశస్సౌభాగ్యభాగ్యప్రభా । వమరారాతిసమా
నమానవిభవవ్యాపారపాథోనిధీ॥ క॥ మందార దానగుణసం।క్రందనసమవ
శీకరుణకౌబేరదిశా।సౌందర్యయువతివిలసిత।చందనచర్చాయమానసదమ
లకీర్తీ॥ పంచచామరము॥ వసుంధరాధరేంద్రధైర్యవారిజాననామనో।జసర్వ
భూతలేశమాన్యచారువర్తనాసటుత్।ప్రసూనపాణవైరిమౌళిభాగవిస్ఫుర
త్సుపర్వసింధుసీచిజాలతుల్యవాగ్విలిఖ్యరాజ్యభుక్॥ ... ... ... ☙

గద్య॥ ఇది శ్రీమదాపస్తంబసూత్రపవిత్ర కౌండిన్యముని చక్రవర్తిగోత్ర స
కలసుకవి జనానీక మిత్ర దేవనామాత్యకుమార వినయవివేక విద్యాలంకార
శంకరవిహాభిధేయప్రణీతంబైన హరిశ్చంద్రోపాఖ్యానంబను మహాప్రబంధం
బునందుఁ బ్రథమాశ్వాసము. ... ... ... ... ☙

శ్రీ ర స్తు.

---

శ్రీ కంఠాయ న మః.

హరిశ్చంద్రోపాఖ్యానము - ద్వితీయాశ్వాసము.

శ్రీలలితలోచనాబ్జవి। శాలయశోరుచినికాయసధమలసుమనః। పాళీ
సంవాసితది।గ్వ్యాలాధమ్మిల్లమంత్రిబాచయమల్లా॥ వ॥ ఆకర్ణింపుము పాండ
వాగ్రజునకుమారకుండియుండిట్లని యెనట్లు శౌనుమంతుండు ప్రథమసాను మం
తంబునం గనుపట్టుటయు నటమున్న వేళ్లని యవ్వసుంధరావల్లభుండు సం
ధ్యాద్యనుష్ఠానంబులు నిర్వర్తించి మృగయావిహారంబునకుం జనువాఁడై పురం
బునం జాటంబంచిన॥ తే॥ వేఁటమాణిక్యముపకారి వెండిగుండు। వాయువేగంబు
వెఱిపుచ్చ గాయగరుడఁ। డడవిపోతులరాజుచిత్రాంగిబాఁడు।మల్లెయనసొప్ప
పెక్కునామములవాన॥ మ॥ బలుకోఱల్తను మధ్యముల్మహదురో భాగంబులుం
బెద్దమూ।తులునుంగల్గి మృగేంద్రడింభములకుం దుల్యంబులై నట్టి జాగిలపుంగు
క్కల హేమశృంఖలముల సన్గీలించికోటానకో।టుల వేగంగొనివచ్చిరాటవికులా
టోపంబు పొల్పొల్లఁగన్॥ చ॥ గొలుసులఁ బట్టి లుబ్ధకులకుంతిత శక్తిఁగదించి నిల్పఁ
గా। బలువిడి సంఘ్రిలన్పయఱుపల్లుఁదవ్వుచు వికట మైన। భస్సలిగ బళింపబాతు



దువిధంబుల మోరలు మీఁదికెత్తుచు। కర్కశఘనభౌంక్రియాధ్వనుల గాఢతరోద్ధత
సించెదికుక్కలన్॥ సీ॥ కఱుకులై నట్టి జుంజులు వెండ్రుకలు సిర్లుగవియు మేనులు కెం
పుగన్నుగవయు। గుఱుచ జేవులు బొట్లు కురువిందపూసపేరులు నొంటియట్ట చె
ప్పులును గలిగి।వలలును బెట్టుక్రోవులు బెద్దయురులును దెరలును బోనులు దీమము
లును।వసులుగసులు పోగువాలు వెండ్రుకత్రాళ్లు బలువిండ్లు నమ్ములు బల్లెములును॥
తే॥ ఖండివాటులు నీఁటెలు బట్టెసములుఁ। బంట్రకోలలు నాదిగా బహువిధముల।
సాధనమ్ములు ధరియించి శబరపతులు।వచ్చిరాఖేటకక్రియావ్యసనరతులు॥ సీ॥
వ్యాఘ్రింబునైనను శీఘ్రింబ తరమిడి పొడిచెద మీఁటెలపూవుచెడక।శరభంబునై
నను సరభసంబున డాసి పదము లెన్నిదియుంద్రుంచెద ముపొదివి। సింగంబునైనను
భంగంబు నొందించి జీవంబుతోన తెచ్చెద ముపట్టి। భేరుండమునునైన నోరెండసీ
యక నలిచేసెదము చాలబలిమి వెలయ॥ తే॥ సాహసంబున మత్తగజంబునైనఁ। గ
రలితొండంబు తెగనఱికెదము కేవ। నేఁడు చూడుము మా వేఁట నేర్పులెల్ల।నను చు
బంతంబులోకకొంద ఱాడిరపుడు॥ మ॥ తలచుట్టన్ జడసొల్లియంబులును సీల్దట్టీలు
జేకట్టుదం।డలువాకట్టులు ముప్పిడుల్మేకములన్ద్దాకొల్పు వశ్యంపుమం। దులునుం
జోపుదుఁ గోలలుం గుఱుచచేదుల్లున్సమగ్రింబులై । చెలువారన్భటకోటివచ్చె
మృగయాశృంగారమేపారఁగన్॥ వ॥ ఇవ్విధంబున నపరిమితకిరాతవారితంబులు
సముద్భటభటానీకంబులుం జనుదేరన మ్మానవాధీశ్వరుండు దానును మృగయా
విహారసముచితశృంగారవేషం బంగీకరించి పుత్రకళత్రామాత్యసమేతుండై॥ ఉ॥
ధనదుని పుష్పకంబునకుఁ దానెన వచ్చునటంచు లోకముల్।వినుతి యొనర్పఁ బొల్పె
సఁగి విద్రుమమౌక్తికవజ్రనీలకాం।చనమయమున్సు వేగహయసంఘటితంబును
నైన తేరుసొం। పొనరఁగ నెక్కి మిక్కిలి సముత్సుకతంబున బాహ్యసీమలన్॥ క॥
మాతలిఁ దలఁపింపంగల।సూతుఁడు దనరథము గడపుచో బహుగతులం। జాతు
ర్యంబులు చూపఁగ।నాతని నేర్పులకు జాలహర్షము వొదలన్॥ వ॥ కౌబేరదిశా
ముఖుండై కొంతదవ్వుచని యంతట॥ మ॥ కనియెన్భూతలనాథుఁ డాటవికరాకా
చంద్రబింబాననా।జననిత్యోచితపుండరీకగవయస్తంబేరమాఖేటమున్। ఘన
శృంగాటము నర్మదోర్మిపటలీగర్జద్దిశాపేటమున్ ! వినుతానేకనికుంజగూ
టము మహావింధ్యాటవీవాటమున్॥ ఉ॥ మారుతపూర్ణకీచకసమాజరవంబులు
నర్మదానదీ।నీరజభృంగగానమృదునిస్వనవైఖరితోడఁ గూడియుం। పారఁగన
ధ్వనీననివహంబులకున్ శ్రవణోత్సవక్రియా । గౌరవముల్ఘటించు నొడికంబుగ
వింధ్యవనాంతరంబులన్॥ వ॥ వెండియుఁ బుండరీకశుండాలగవయగండభేరుండ
కంఠీరవసారంగభూదారభల్లూకలులాయప్రముఖనిఖిలమృగనికాయభయం

కరానూనధ్వానబధిరితకకుబంతదంతావళకర్ణకుహరాంతరాళంబును దిం
త్రిణీతమాలతాళవటకుటజ కపిత్థాశ్వత్థకోవిదారసిందువారమందార పిచు
మందచందనమాకందమాతులుంగలవంగజంబుజంబీరవకుళక్రముకపనసబద
రీమధూకమాధవీకింశుకశింశుపాశోకాదినానావిధపాదపశాఖాశిఖావిహార
మాణమయూరకోకిలకీరశారికాకలవింకకపోతఖంజరీటకాకఘూకాద్యనేక
శకుంతసంతతి ప్రబలనినాదమేదురంబునునై యరుణగభస్తికిరణపరంపరలకుఁ
బ్రవేశింపఁదరంబుగాకకతంబుసాంద్రంబై యిసుకచల్లినంగ్రిందరాలకయిరులు
గవియుచుంబసరుడాలువింధ్యావసుంధరాధరపరిసరారణ్యంబుదరిసిమృగంబు
లు మెలంగుపట్లరసిముట్లుతారువేయించి పోగువాతించివలలును దెరలునెత్తిం
చిబోనులుదీమంబులునొడ్డించి॥ మ॥ ఘనబాణాసనమెక్కువెట్టిపటుదోర్గర్వం
బఖర్వంబుగా। వనధిధ్వానముకంపెమించుగుణనిస్వానంబుగావించియు। బ్బున
నేసెన్ఘనభీకరాశుగతతుల్పుంఖానుపుంఖంబుగా। వనజాతాప్తకులాగ్రగణ్యుఁ
డుమృగవ్రాతంబులంగూలఁగన్॥ వ॥ ఇవ్విధంబుననత్యంతభయంకరంబులగుశ
రంబులంబఱపినంగరంబుభీతిల్లియెల్లమృగంబులుతల్లడిల్లిపెల్లొలఁగనట్టియెడ॥
తే॥ మేదినీనాథశరహతమృగసమూహ। ఘనకళేబరజనితరక్తప్రవాహ। వితతి
ప్రవహించెగైరికక్షితిధరేంద్ర। సానుసంభూతనిర్ఝరచయముఁబోలె॥ క॥ అంత
టప్పృగయాకేళిని। రంతరపరితృప్తినొందియవనీశుఁడతి। శ్రాంతుండై సెలవిచ్చె
నఁ। బంతమునగిరాతపతులుభటసంతతులున్॥ క॥ ఉరువడిఁ జెల్లార్చుచుఁగే। స
రిశాబకసదృశరూపజయసత్వభయం। కలములగువేఁటకుకలఁ। బరువిడిచిన
సవివధించెబహుమృగతతులన్॥ వ॥ తదనంతరంబవారునుబదచిహ్నంబులవెం
బడింజనినికుంజంబులుదూఱిపొంచియున్నమెకంబులుద్రుంచియువిశాలంబుల
గుజాలంబులంబడంద్రోఁపితగుల్పఱిచికొనియుదీమంబులనొడ్డి యేమఱుపాటు
నంబోదివియుంగనివిసనకమఱియును॥ తే॥ సాళువముగిద్దులగుడు వేసడముకు
రుజు। బాజుజలకట్టెజాలియహ్పైలయణుజు। నోరణంబులునాదిగాఁ బేరువడిన। వేఁ
టడేగలగిఱికొనవిడిచికడిమి॥ తే॥ గ్రద్దసాగునుగాకికోఁజునుగక్కెరయును। గూ
బపార్వంబుబెగ్గురుకొక్కెరయును। గోంకలావుకరయాడేలుగువ్వవెలిచ। పొట్టి
పిట్టయునసఁగల్గుపులుఁగుగములు॥ క॥ తూలించివిపినమెల్లను। గాలించితదస్త్ర
వారిఁగ్రవ్యచయంబుల్। దేలించితనిసివేఁటలు। బాలించినరేశ్వరునకుసమ్మదము
దవన్॥ క॥ చమరీవాలములుగురం। గమదములుగజదంతములునుగరికిటిసంజా। త
ములగుముక్తాఫలములు। నమితంబుగదెచ్చియిచ్చిరతివినయమునన్॥ వ॥ ఇచ్చి
నసపియుస్పియుంగైకొని ప్రియంబునంజంద్రమతికిసమర్పించియవ్వేటకాఱులకు



బసదనంబొసంగి యబ్బిసరుహాప్తకులుండు సరసవివేకరతుండు సత్యాంతహి
తుండునునగుసత్యకీర్తిఁగనుంగొని॥ తే॥ అనఘవర్తనవినుమృగయావిహార।
కారణంబునదూరమేతేరవలసె। మనకునీరాకసఫలమౌమార్గ మొకటి। తెలియ
జెప్పెదసమ్మదస్థితిఘటిల్ల॥ లయగ్రాహి॥ అల్లదెసదాఁగతినటల్లహరిగైత్యరిపుభ
ల్లిమకుటప్రసవవల్లరిసముద్య। త్ఫుల్లకుముదాబ్జనవపల్లకవసద్భ్రమరమల్లి
మునఁగౌతుకమువెల్లిగొనఁగన్నుల్। చల్లగఁబయోధిప్రియవల్లభఁగనుంగొను
ముకొల్లలుగముత్తిరమునెల్లపుడుమజ్జ। త్సల్లలితచిత్తులకుఁబెల్లొసఁగుజహ్ను
మునితల్లజసుతోరుతటినల్లచదలేటిన్॥ శా॥ తత్తీరంబుననిష్ఠమైఁదపముదాత్త
ప్రీతిగావించుభా। స్వత్తేజోరమణీయునంబురుహభూసంకాశు నంహఃప
యోభృత్తీవ్రశ్వసనుంబ్రసన్నగుణగంభీరున్వసిష్ఠుందయా। యత్తస్వాంతున
రుంధతీవిభుసపర్యాకాంక్షఁజూడందగున్॥ క॥ అనినృపతిదండనాథుని। య
నుమతమునసరిగికాంచెననురాగమునె। మ్మనమునఁదైనఁగొనుచుండఁగ। ననుప
మమువసిష్ఠమౌనియాశ్రమమెదురన్॥ కనితత్ప్రదేశంబున॥ మహాస్రగ్ధర॥
వరరుద్రాక్షప్రభూషావ్రజరుచిరతనుర్వ్యాఘ్రచర్మోత్తరీయుం। బరమధ్యా
నాంతరంగప్రణిహితశివునిన్ బద్ధపద్మాసనస్థున్। గరవిన్యస్తాక్షదాముంగనద
రుణజటాకల్పుభస్మాంగరాగున్। జిరకాలోపార్జితాతిస్థిరవిపులతపశ్శ్రీగరి
ష్ఠున్వసిష్ఠున్॥ వ॥ కనుంగొనిప్రముదితస్వాంతుండై యమ్మహీకాంతుండునిజకిరీ
టకోటిసంఘటితహరినీలరోలంబంబులుతదీయచరణారవిందంబులు చుంబింప
సర్వాంగాలింగితమహీమండలుండై దండప్రణామంబులాచరించికరకమలంబు
లు మొగిడ్చినంగనుంగొనియమ్మునివల్లభుండిట్లనియె॥ చ॥ అపగతబుద్ధినింతమృగ
యావ్యసనంబునఁగేళిసల్పఁగా। నృపులకునీతిగాదుధరణీశ్వరభాగ్యయునీవుభీ
కరాతపసమయంబునన్బహువిధంబులదుష్టమృగంబులున్నయి। వ్విపినములం
జరించుటవివేకమెయాత్మఁదలంచిచూచినన్॥ క॥ సప్తోపాయధురీణత। సప్తవ్య
సనములువదలిసదమలబుద్ధిన్। సప్తాంగరక్షణుండయి। సప్తాశ్వకులేంద్రమెలఁ
గఁజనునరపతికిన్॥ క॥ మునిజనవినుతంబగున। స్మనువంశంబునజనించిమఱువంద
గునే। మనుజేశనీతిమార్గము। వినునీతిజ్ఞునకురాజ్యనిభవముఁవాదలున్॥ తే॥ ఇచ
టనాలస్యముడిగినీవిపుడపురికిఁ। బొమ్ము వేగంబయింకొకకబుద్ధివినుము। మఱచి
తప్పియుఁగౌశికమౌనియాశ్ర। మంబుపొంతకుఁబోవకుమనుజనాథ॥ క॥ ప్రొడమిం
గోత్రధులకానతి। వడిఁబెట్టినవాఁడతండుపరికింపంగాఁ। గడుఁగుటిలవతఁడనుం
డె। న్నడుమనాతనిపేరికూరనంజకుమున్నృప॥ క॥ పరరంధ్రాన్వేషియునిష్ఠురచ
రితుఁడునరయగాధిసుతుఁడతనివద్దం। బరుణాంశువంశమణిపై। తెరువైనను

వలదుచూరఁగధీరవిచారా॥ వ॥ అనియుపదేశించిపిశాచులుపుటయునావృత్తాంతంబంతయుం దెలిసివిశ్వామిత్రుండుహరిశ్చంద్రమహీకళత్రునిదనయాశ్రమంబునకురప్పించు నుపాయంబంతరంగంబునఁజింతించి యనల్పకపటకౌశలంబున నొకమాయామృగంబునుగల్పించిననదియును॥ సీ॥ నవఫేనరుచినవ్వుధవళాననంబునునల్లఁగల్వలగెల్చునయనములును। బద్మరాగప్రభంబగటుకర్ణంబులుకాంచనదీధితిమించుతనువు। మౌక్తికకాంతులమఱపించుచాఱలుతుహినంబుతోసుతదారయుకడుపు। మరకతదీప్తులఁబురడించుఖురములుపవనంబుఁదలకించుపటుజవంబు॥ తే॥ గలిగిలీలావిహారంబుకారణముగ। నవనిఁజరియించుపంకరుహారియంక। మృగముగతినుండుటయు సంయమీశ్వరుండు। దానిఁగనుఁగొనికడుసమ్మదమునఁబొంది॥ వ॥ హరిశ్చంద్రధరిత్రీవల్లభునల్లనయొలయించిమదీయాశ్రమంబునకుం దెమ్మనిపంచిన॥ క॥ తనతనుకాంతులుదిక్కుల। మునుకొనివెల్లెడలఁబర్వమురియుచుఁజనియె। ఘనచిత్రమృగముచయ్యనఁ। బనివడిభూవరునిదృష్టిపథముననిల్చెన్॥ చ॥ నిలిచినభానువంశజుఁడునివ్వెఱగందితదీయవిభ్రమంబులుపలుమాఱుచూచుచునపూర్వమృగంబిదిదీనిమేనుబి। ట్టలయరయంబునందఁజిమిఝల్లనప్రాణముతోనపట్టెని। ర్మలమతినైనలోహితకుమారునకిచ్చెదఁగేలిసల్పఁగన్॥ వ॥ అనిసారథింగనుంగొని॥ ఉ॥ అల్లదెపైఁడియుఱ్ఱిముదమారగఁజూడుముదానిఁగూడనీ। వెల్లవిధంబులన్రథమహీనజవంబునఁదోలుమన్నభూ। వల్లభునాజ్ఞసూతుఁడనివార్యగతిందగఁదోలెవాయువే। గోల్లసితాశ్వయుక్తమయియొప్పగునయ్యరదంబుచయ్యనన్॥ వ॥ ఇవ్విధంబునరథంబుదోలించిమహీనాయకుండుదాయంబోవుటయునమ్మాయాకురంగంబునిరాయాసంబున॥ సీ॥ బంధనంబెడలిభూభాగంబుఁజేరియిచ్ఛాలీలవిహరించుగాలియిట్టి। కుండేటితోఁబొత్తుగూడకవచ్చినయుడురాజబింబంబునడిమియిట్టి। వీరభద్రునికృపవెండియునుద్భ్రాంతమైనదక్షమఖంబులోనయిట్టి। కుధరనందనవెండికొనపిసర్జించినజేతోభవారాతిచేతియిట్టి॥ తే॥ ననుకరించుచుమిగులఁబెంపగ్గలింప మంచిమురువునుబరువునుమదముముదము। పొదలఁగనుఁగొనువారికింపులుఘటిల్ల। నల్లనల్లననడయాడెనభినవముగ॥ సీ॥ చేయీకకుప్పించిచివ్వనదాటుచుఁగొమ్ములచేబయల్చిమ్ముకొనుచు। బిత్తరంబులుగాగబేరెముల్వారుచుమరిగినక్కైవడిమలసికొనుచు। గసవుపోచలుకసీగాట్లుగాగొఱుకుచువివృతాస్యమునజారఁబిడుచుకొనుచు। రిక్కిరిక్కనదోకద్రిప్పిజాడించుచు ఖురపుటంబులదలగోఁకుగొనుచు। తే॥ నిగిడిపాఱుచునంతంతనిలువబడుచు। నొడలికండూతికైచెట్లనొరసికొనుచు। నుదరియొకెక్కడమిన్నకబెదరిపడుచు। గువ



లయేశ్వరునెలయించికొనుచునరిగె॥ వ॥ ఇట్లరిగివిశ్వామిత్రునియాశ్రమంబుప్రవేశించిమొఱంగిచనంజూచుదానితెఱంగెఱింగిరోషించికనుంగవఁగెంపుజనియింపనాత్రిశంకునందనుండువిశంకటభుజాబలంబునశరాసనంబెక్కువెట్టిమౌర్వీరవంబొనర్చిదర్వీకరభీకరంబగుశరంబుదొడిగితెగనిండందిగిచిదృష్టిముష్టిఘారేయుండైయేయుటయునయ్యేటునదూలక వాతూలజవంబున నక్కురంగంబుకౌశికుసమ్ముఖంబునకుంజని యదృశ్యంబయ్యెవిశ్వంభరావల్లభుండునాయిట్టిపసలంబడివెట్టితనంబుననవ్వనంబెల్లంద్రిమ్మరినవాఁడుగావున నితాంతనిబిడాతపాక్రాంతుండును క్షుత్పిపాసావంతుండునునై మందశ్రమంబునంబొందిశీతలజలాన్వేషణాభిలాషియైచనిచనిముందట॥ సీ॥ మందారజంబీరమాతులుంగలవంగకేతకీచంపకకింశుకముల। మాకందచందనమాలూరఖర్జూరకోవిదారమధూకకురువకముల। జంబూవటాశ్వత్థనింబనీపకపిత్థతాలతమాలహింతాలములను। దింత్రిణీపాటలతిలకామలకదేవదారుపున్నాగకర్పూరములను॥ తే॥ మఱియుఁదక్కినపావనక్ష్మారుహముల। బహువిధంబులపూఁదీఁగపందిరులను। బ్రబలివిలసిల్లుకౌశికాశ్రమముఁగాంచె। నుల్లమలరంగమేదినీవల్లభుండు॥ తే॥ మానవాధీశయాపుణ్యకాననమునఁ। దోయదశ్యామమునిహోమధూమవితతి। యంబరంబుననభినవంబైననల్ల। పట్టుజగజంపుగొడుగుసవిభ్రమమునొసఁగు॥ ఉ॥ పంకజసూతికైనఁదలఁపంగదునద్భుతమావహిల్లనే। శంకకులాగ్రగణ్యవినుమాగమశాస్త్రపురాణములన్నిరా। తంకమువంబఠించునెడఁదాపసపుత్రులకుంగవుళ్లుగిరన్। వంకలుదీర్చిచెప్పుగొరవంకలుఁజిలుకలునవ్వనంబునన్॥ సీ॥ కడుఁబ్రేమఁజన్నిచ్చుబడిఁదప్పితిరిగెడులేడిపిల్లలకుబెబ్బులులు। కంఠీరవంబులుగంధసింధురములతోడమాటికిఁజెలులాడుచుండుఁ। జిట్టెలుకగములతోఁజెలుములువాటించుఁబ్రియమునబావురుఁబిల్లిగములు। నీలకంఠంబులులాలనంబొదవబాటించుకుంభీనసడింభకములఁ॥ తే॥ గొండగొట్టియుపిందునుగ్రోఁతిగమియు। మంతనములుండుఁబోరపొచ్చెమింతలేక। సాళువంబులుఁబక్షులుఁగేలిసల్పు। గాధిపుత్రుతపోవనవీధియందు॥ వ॥ ఇట్టివిచిత్రంబులకుబాత్రంబగునవ్విశ్వామిత్రుతపోవనక్షేత్రంబునిరీక్షించితదభ్యంతరంబున॥ సీ॥ సంఫుల్లహల్లకజలజాతమకరందపానలోలాలినీగానరవము। వీచిడోలాకేళివిభ్రాంతవిలసితచక్రవాకమరాళసముదయంబు। సతతకేళీసక్తసంయమిబాలికాస్తనకుంకుమారుణస్వచ్ఛజలము। ప్రవిమలశశికాంతపాషాణకల్పితసోపానమార్గసంశోభితంబు॥ తే॥ పవనకంపితతీరభూభాగవిటపి। పుష్పగుచ్ఛపరాగవిభూషితంబు। మకరకచ్ఛపజలజంతునికరయుతము। భూవిభుఁడుగాంచెనొక్కసరోవరం

బు॥ తే॥ కాంచి మానవనాథుఁ డంగనయు సుతుఁడు। దాను దత్తీరభూమి రథంబు
డిగ్గి। దండనాథుఁ డుకరముక్తై దండ యొసఁగ। సరసిఁ దఱికి వినిర్మలజలము గ్రోలి॥
వ॥ కృతావగాహనుండై తత్సమీపప్రదేశంబునఁ బ్రదీపించు పుష్పితమాధవీలతా
మంటపాంతరంబునఁ గిసలయతల్పంబునఁ జంద్రమతీసతీలలామంబు మృదూరు
పీఠంబు పధానంబుగా శయనించి బాలరసాలపల్లవప్రకల్పిత తాళవృంతంబున శీ
తలమందవాతూలంబు సోఁకఁగ దిసి విసరు దండనాయకు వదనారవిందంబు వలో
కించి॥ క॥ సదమలబహుపుష్పలతా। సదనవసద్భ్రమరగానఝుంకారములన్। ము
దమొదవించుచునున్నది। యిదియే మునియాశ్రమంబొ యెఱుఁగఁగవలయున్॥
తే॥ అనుచుఁ బలుకుచునుండంగ నచటి కపుడు। కుశసమిత్పర్ణఫలములు గోయనా
క్ర। ఋషికుమారుండు వచ్చి మహీశుతోడఁ। జెప్పె నిది కౌశికుని వనక్షేత్రమనుచు॥
ఉ॥ చెప్పిన మేదినీరమణశేఖరుఁ డుల్లమునందు సంతయున్। ముప్పిరిగొన్న భీతి ముని
ముఖ్యుఁడు గౌశికుఁ డేమి సేయునో। యప్పరమేశుఁ డే యెఱుఁగు నంతయు నిక్కడఁ
బాసి వేగనే। చొప్పునఁ బోదమింక మనసుద్ధి యెఱుంగక యుండ నాతఁడున్॥ క॥ ఎ
క్కడి హేమకురంగం। బెక్కడి మృగయావిహార మెక్కడి విపినం। బిక్కడి కేటికి వచ్చితి।
మక్కట యిట్టిప్రమోదమయ్యె న్మనకున్॥ తే॥ నవవిరించియరుంధతీనాయకుం
డు। మఱచితప్పియు గాధికుమారువనము। చొరకుమీవని చెప్పె విశుద్ధబుద్ధిఁ। గౌరి
నామీఁదివాత్సల్యగుణము పొదల॥ క॥ ఇచ్చోటఁ దడయవలవదు। చెచ్చెరఁ బురికేగు
మనుచుఁ జెప్పిన నేలా। వచ్చితిని మృగము వెంబడి। వచ్చునె విధిఁ గడవ నెంతవారల
కైనన్॥ తే॥ ఏమి సేయువార మెక్కడి కేగుద। మేది కార్యచింత యింక మనకు। మిగుల
మోసమయ్యె మృగయావిహారైక। కారణమున నేమిగాఁగఁ గలదొ॥ ఉ॥ ఆ ముని
సార్వభౌముని దృగంతములించుక బేవురించినన్। హేమగిరీంద్రమైన ధృతి నేస
ఱిబిట్టు చలించు ద్రెళ్ళుగ్గుది। క్ష్మామజయూథమైన నుడుసంఘములైనను గాలునా
సుధాధామదినేశులైనఁ గడుఁ దల్లడమందుదు రేమి చెప్పఁగన్॥ తే॥ శర్వరీశక
ళామౌళిగర్వమైన। నడఁచు కౌశికమౌని కేననఁగ నెంత। యబ్ధిలంఘింపనోపిన
యలఘుబాహు। బలునికైన దుష్కర మెచ్చొటి పడియెదాఁట॥ చ॥ మలయజశైత్యయు
క్తములు మానసముల్ విలయోష్ణభానుమం। డలకిరణాతితీక్ష్ణములు నాలుక లెప్పు
డు మౌనికోటికిం। దలఁపనను గ్రహించినఁ బితామహుఁ జేయుదు రల్పునైనఁ బే।
రలుకవహించి రేనికడు నల్పుని జేయుదు రప్పితామహున్॥ ఉ॥ ఇప్పుడు పోయి యి
మ్మునికులేశ్వరుఁ డల్గకమున్నె చేరినా। తప్పక సంస్తుతించుచుఁ బదంబులకుం బ్రణ
మిల్లియుందమో। చప్పుడు సేయక క్షణమసత్వరప్రవృత్తిం దొలంగిపోదమో। యి
ప్పటి కేది కార్యమది యిద్ధమతిం దడనాచరింపఁగన్॥ వ॥ అని విచారడోలాందో



ళితమానసుండై యున్న యమ్మానవేంద్రునింగన్గొని యమాత్యశేఖరుండగు స
త్యకీర్తి విశుద్ధబుద్ధిక్రియాపాటవంబు జేటపడ వినయాలాపంబుల నిట్లనియె॥ క॥ ఓ
కమలాప్తకులాగ్రణి। మీ కేటికి నింతచింత మిన్నక వినుఁడు। స్తోకమతిని వివరంబుగ।
నాకుం దెలిసిన తెఱంగు నన్వినిపింతున్॥ శా॥ భూపగ్రామణి వర్ధికల్పక మహాం
భోరాశిగాంభీర్య రే। ఖాపారీణుఁడ వద్రిధీరుఁడవు లోకస్తుత్యసత్యవ్రతా। లోప
శ్రీవిభవోజ్జ్వలుండ విదియేలా చింత దగ్గించినన్। నీ పైన న్గడు వారలుంగలరయో
నిత్యప్రతాపోదయా॥ అదియునుంగాక॥ తే॥ శత్రుమిత్రత్వములు రెండు సమ
ముగాఁగఁ। జూచి నిందా ప్రశంసల స్రుక్కఁబడక। యుబ్బనొందక యడఁపులనొం
టిఁ దిరుగు। మౌనులకు నేల నృపులతో మత్సరంబు॥ చ॥ జనవరనీకుఁ గౌశికుఁ డసన్న
యమేటికి నింత యాత్మలో। నునుపఁగ నా మునిప్రవరుఁ డుల్లమునం గృపపిక్కటిల్ల
మీ। జనకుఁ ద్రిశంకు భూవరు విశంకటశౌర్యుని బొందితోడ నే। యనుపఁడె దేవ
తాపురికి నారసి చూడ మహాద్భుతంబుగన్॥ క॥ విశ్వామిత్రుని మీఁదన। విశ్వాసం
బెలనీకు వివరింపంగా। విశ్వార్థదాయకుండవు। విశ్వంభరఁ గలుగు మానవితతు
లకెల్లన్॥ తే॥ సారవర్తనయాదుర్విచారతమము। వరవివేకకళాదివాకరుని చే
త। నడఁచి యొకకొంత సేపు సౌఖ్యాన్వితముగ। నిద్రఁ బొందు మనిర పాయముద్రఁ
జెందిరి॥ వ॥ అని పలుకు ప్రధానాగ్రగణ్యు సమగ్రమనీషా విశేషభాషణంబు లాక
ర్ణించి యమ్మహీకాంతుండు చింతావివర్జితస్వాంతుండై సంతాపంబుడిగి నే
త్రకమలంబులు ముకుళించి ముహూర్తమాత్రంబు నిద్రించి వాక్రువ్వ నాకర్ణింపఁ
దరంబుగాని భయంకరంబగు దుస్స్వప్నంబుం గాంచి బిట్టుమిట్టిపడి కలవరించుచు
ధైర్యంబవలంబింపలేక నలుదిక్కులు చూచుచు బాష్పజలపూరితనేత్రుండును
ప్రకంపితగాత్రుండును నై యొండెఱుంగక యున్న యన్నరేంద్రుం గనుంగొని సచం
ద్రమతి యతిత్వరితంబున॥ క॥ కెంజాయలనీనెడు కర। కంజంబునఁ గంకణములు ఘ
లుఘలుమనఁగా। మింజయుని వెన్నుచఱచుచు। సంజకభ్రమయెల్లఁ దెలిపె నతిశ
యాధృతినై॥ తే॥ ఘటితనిర్మలఘూరిముక్తాఫలప్ర। కాండసౌభాగ్యనిర్జితగగన
సింధు। కంకణంబైన నిజహస్తకంకణంబు। కడకనూడిచి రత్నగాబడిసి వైచి॥ సీ॥
ప్రాణేశ యేమయు పాటుఁ బూర్వంబిట్లు బిట్టు మేలుకని యేల మిట్టిపడెదు। శరణా
గతారాతిజనపాలభయహరణాతిదక్షుఁడవు సమగ్రమతివి। దుర్వారమదఘూ
రిగర్వాంధపరిపంథిబాహాబలారణ్యపావకుఁడవు। సప్తపారావారసంవేష్టిత
క్షమాచక్రసంరక్షావిచక్షణుఁడవు॥ తే॥ నిత్యసత్యవ్రతస్తుత్య నిరుపమాన। పా
రగంభీరవాచావిశారదుఁడవు। ప్రబలధైర్యసుపర్వపర్వతమవీవు। భ్రాంతిఁ
బొందంగఁదగునె నీకింతలోన॥ క॥ అనితనభర్తృముఁ దెలిపెదు సతిఁ గని దుస్స్వప్నం

బెగంటిఁ గమలాననే। వినిపింతుఁ దత్ప్రకారము। వినుమీవని తెలియ ధరణివిభుఁడిట్లని యెఱిఁగె॥ సీ॥ మణిమయంబగు సభామంటపంబున వైభవోన్నతి నేఁ గొలువున్నవేళ। రోషారుణేక్షణోగ్రరుచిరాగ్ర తేజుండు ధరణీసురుం డొకరుఁడరుగుదెంచి। యదలించి ధరణిపై నస్మత్కిరీటంబు పడఁ దన్నిమణి తలఁ బట్టి తిగిచి। కరము సిద్ధయవృత్తిఁ బురము వెల్వడఁ దోలె బహువిధాపత్పరంపరలఁ జెందె॥ తే॥ యీశ్వరానుగ్రహంబున నే చిపిదపఁ। బూజ్యసామ్రాజ్యవైభవస్ఫురణఁ గంటి। ననుచు దుస్స్వప్నపద్ధతి మనుజవిభుఁడు। సర్వమును జంద్రమతితోడ సరవిఁ జెప్పె॥ ఉ॥ చెప్పిన నంతయు స్వామిశేశయలోచన కౌతుకంబుపె। ల్లొప్పమి నెంతయున్ భయము నొందియు నొందని యట్టులాత్మలోఁ। గుప్పలుగొన్న ధైర్యమునఁ గొంకక భూరి వివేకశక్తినా। తప్పక పల్కెఁ జేరి వసుధావరుతో డఁబ్రియోక్తివైఖరిన్॥ క॥ ఏతన్మాత్రంబునకో। భూతలపురుహూత యింత పొలుపఁతిమతిలో। భీతిల్ల నేల చెప్పెదఁ। గౌతుకమొదవంగ వినుఁడు కల తెఱఁగెల్లన్॥ చ॥ అలుక జనించి వచ్చిన ధరామరవర్యుఁడు గాధిపుత్త్రుఁడు। జ్జ్వలమకుటంబు దన్నుటలు చయ్యన రాజ్యవిభూతిఁ బాయుటల్। పలుమఱుఁ దన్నిమిత్తమునఁ బ్రాప్తములైన బహుప్రయాసముల్। గలుగు శశాంకమౌళికృపఁ గ్రమ్మఱ రాజ్యరమా విశేషముల్॥ వ॥ అని చంద్రమతి హరిశ్చంద్రు మనస్తాపంబు మాన్పి యూరడించుచుండె నంతనచ్చట॥ క॥ కోపంబున నెండియుఁ గపటోపాయంబొకటి యాత్మనూహించుచు మాయా పారీణతమీఱఁగ। దాపసవర్యుండు గాధితనయుఁడు వేగన్॥ క॥ మాతంగకుంభకుచములు। మాతంగకరోపమానమహితోరువులున్। మాతంగయానములుగల। మాతంగవధూయుగంబు మహిమ సృజించెన్॥ క॥ అన్నలినాక్షులవాలుం। గన్నులకెదిరింపలేని కతమునఁ గాదే। పన్నినభయమున బెడిస। లెన్నఁడు జలదుర్గభూములే మఱు వెడలున్॥ చ॥ శివశివ యావిలాసినుల చిక్కని చక్కని గుబ్బచన్నులున్। ధవళమరీచిబింబము నదల్చు మొగంబులుఁ గెంపుమోవులుం। గువలయకాంతిసంపదలకుం గుదురైన వెడందకన్నులున్। యువజన ధైర్యమూలములనొక్కటఁ బెల్లగిలంగఁ జేయవే॥ సీ॥ కొదమతేటులఁ దెచ్చి విదియచందురుఁ దెచ్చి విషమాస్త్రు సింగిణి విండు దెచ్చి। కలువపూవులు దెచ్చి ఘనచంపకము దెచ్చి దాడిమీబీజసంతతులు దెచ్చి। జలజరాగము దెచ్చి శష్కులికలు దెచ్చి ధవళ తాంబూల పత్త్రములు దెచ్చి। శంఖంబు దెచ్చి బిసంబులు దెచ్చి నిర్ఝర శాతకుంభకుంభములు దెచ్చి॥ తే॥ పృష్ఠగోర్ములు నావర్తపులినములును। గదళికాస్తంభములు శాలిగర్భములును। జిగురులును దెచ్చి కాని సృజింపరాదు। కమలజునకైన నాహంసగామినులను॥ క॥ ఆనీల వేణులకుఁగల। గానకళానైపుణంబు గంధర్వసరో। జాననలకు లేదింత



యు। వీనుల పండువులు సేయు విశదస్వరముల్॥ క॥ చండాలత్వము దక్కఁగ। నొండేమియు వెలితి లేని యొప్పుల కుప్పల్। గుండలిపతియును జాలఁడ। ఖండమతిం దద్విలాసగరిమను నుతింపన్॥ వ॥ ఇవ్విధంబునం గనుపట్టు చండాలబాలికాయుగంబు సృజియించి మౌని శుండాలం బానీలవేణుల కిట్లనియె॥ సీ॥ పాటించి వినుఁడు నా పలుకులు దెలియంగ గంధసింధుర రాజగమనలార। చిత్తరివన్నెలు పెట్టి మీ రెంతయు నాసపరివారగులఁ బొసఁగ నరిగి। జలజాప్తకులవార్ధి చంద్రు హరిశ్చంద్రు సద్భక్తి దర్శించి సంస్తుతించి। సంగీతవిద్యాప్రసంగముల్ ప్రచరించి మృదుమధురోక్తిసంపదలు నెఱపి॥ తే॥ వివిధలాస్యక్రియాకౌశల విధులు చూపి। చేరి సంతోషితస్వాంతుఁ జేసి యతని। నడుగరాని పదార్థంబులడిగి ధైర్య। హీనుఁ గావించి భంగించి యేగుదెండు॥ వ॥ అనుటయు వల్లెయని యప్పల్లవాధరలమ్ముని వల్లభునకుఁ బ్రణమిల్లి వీడ్కొని సముల్లాసంబున॥ సీ॥ చైతన్యమొందిన శాతమన్యవశిలానికురుంబ సాలభంజికలనంగ। సంపూర్ణపూర్ణిమాచంద్రాస్యలై సంచరించు నీలోత్పలశ్రీలనంగ। జంగమత్వము గాంచి సౌభాగ్యవిస్ఫూర్తి నుతికన్న తాపింఛలతికలనఁగ। బొలుపు దీపింపఁ బ్రౌఢిగావించిన మకరకేతను నిధేనుకలనంగ॥ తే॥ బడతులా కోటి సినదసంపదలఁ గడిసి। గిలుకుమెట్టెల చప్పుళ్లు గులుకరింప। గలికి రాయంచ కొదమల గతులసొబగు। నేలు నొసపరి నడకల నేగుదెంచి॥ క॥ చండాలికల సమాయుధ। శుండాలికలూరువిజితసురుచిరకదళీ। కాండాలికలమృతాకర। ఖండాలికలా నృపాలుఁ గనుఁగొని వేడ్కన్॥ వ॥ అనుపమాన వినయపూర్వకంబునం బ్రణామంబులొనర్చి కరకమలంబులు మొగిడ్చి॥ మ॥ జయమార్తాండకులావతంస విమలత్రాణాధనానాచమూ। చయపాథోనిధికుంభసంభవ సమస్తద్వీపవిన్యస్తభూ। రియశస్స్తంభవిజృంభమాణ మతివర్ణింపన్ సమర్థుండె యే। వ్యయమై యొప్పు భవన్మహామహిమ యవ్వాతాశనాధీశుఁడున్॥ ఉ॥ నీరమణీయవైభవము నిర్జరవల్లభు గెల్చు నీమహా। దారత పారిజాతవసుధారుహముం బ్రహసించు నీ శుభా। కారము చంద్రమండలముఁ గైకొనకుండు నటంచు మాటికిన్। సూరిజనుల్ నుతింపనినుఁ జూడఁగ వచ్చితిమయ్య వేడుకన్॥ గీ॥ విపులధవళాతపత్త్రిత విమలకీర్తి। మండలుండవు మహితలాఖండలుఁడవు। నిన్నుఁ గనుఁగొనఁగంటి మిన్నృపవరేణ్య। మత్పురాకృత పుణ్యకర్మముల కతన॥ క॥ వీణెలు వాయింపంగ బ్రవీణత్వము గలదు మాకు వినిపించెదమ। క్షీణతర గానవిద్యల। జాణలు గానలును మెచ్చి సంస్తుతి చేయన్॥ వ॥ అనితదీయహృదయానుకూలభావం బెఱింగి యాలీలావతులు గంధర్వనితంబవతులకుం బ్రతిబింబంబులై యత్యంతవిడంబంబున॥ సీ॥ వీణెలఁ గవుసెన ల్వాడవిడిచి చెఱఁగుల మెఱుఁగు రాఁగాయలమీఁదు దుడిచి। కుచకుంభముల మోపి కొని తానములకును

జక్కగాఁ బవడంపుసారెలొత్తి। శ్రుతిగూడఁ దంత్రులు సుడిగొల్పి మీటుచు జీవా
ళి పట్టించి చెలఁగు రత్నకంకణధ్వనులతోఁ గరపల్లవాంగుళులల్లార్చుచు నేర్పు
వెల్లమెఱసి॥ తే॥ మొనసి శ్రుతులేడు మువ్వేడు మూర్ఛనలను। గలుగు ముప్పదిరెం
డు రాగములవాని। మిశ్రమ్ముల శుద్ధసారంగమేళనముల। మంద్రమధ్యమతారక
మానసరణి॥ శా॥ గాణత్మ్యచ్ఛఁగఁ బాడి రింపు దొలకంగాఁ దాళమానంబులన్।
క్షోణీనాథజయాంకసంకలితముల్ సాళాదిగీతావళుల్। వాణీపాణిసరోరు
హాంగుళినఖవ్యాపారలీలారణ। ద్వీణాసంచితపంచమక్వణకళావిఖ్యాతకంఠ
ధ్వనిన్॥ తే॥ ఆనవీనవిశేషగానామృతమునఁ। బొదలి వెంతయు నాశ్చర్యమొద
వనపుడు। వల్లకీదండములఁ బుట్టెఁ బల్లవములు। సారమణిపఙ్క్తి కరఁగి నీరయి స్ర
వించె॥ వ॥ ఇవ్విధంబునఁ బాడిన నవ్వెలినాడచేడియల నిరుపమానగానవిశేషం
బులకు బరితోషంబునొంది హరిశ్చంద్రధరిత్రీవల్లభుం డుల్లంబున సంతసిల్లి వార
లకనేకమణిమయాభరణంబులు తురంగమదకర్పూరకాశ్మీరగంధసారతుషార
నీరాదిసౌరభద్రవ్యంబులుఁ బ్రియంబెసంగ నొసంగి వీడ్కొలుపుటయుఁ జూచి
మందహాసంబు చేసి యగ్గోసంగిపడంతు లమ్మహీకాంతున కిట్లనిరి॥ గీ॥ పదార్థం
బులేల ధాత్రీశ మాకు। వివిధభావజ్ఞ మతకళావేది వీవు। బడలితిమి చాల నిబిడాత
పంబుచేత। నీ సితచ్ఛత్ర మొసఁగి మన్నింపవలయు॥ చ॥ ధరణిశ తెల్లనీగొడుగుద
క్కఁగఁ దక్కిన వస్తువుల్ పరం। పరలుగ నెవ్వి యిచ్చినను బర్విన తాపము పాయనే
ర్చునె। పొరిఁబొరిఁ గాయ నెండఁ గడుఁ బొక్కె శరీరము వేడ్కమాయెడం। గరు
ణవహింపఁగాఁ దగును ఖండితదానకళాధురీణతన్॥ క॥ అనుటయు నామాటల త
లం। గనుఁగొని యుత్సాహముడిగి ఘనకోపముతో। మనుజాధీశ్వరుఁ డిట్లనుఁ। గ
నుఁగ్రేవలయందుఁ గెంపు గడలుకొనంగన్॥ క॥ పుడమిపయి దొల్లి యీఁగతి। నడిగి
న యాచకులు గలరె యనుచితమిది మీ। యెడ దలనిబ్బరికింపక। గొడుగడుగుట యె
ట్లు కండక్రొవ్వున నన్నున్॥ క॥ ప్రేమంబున యాచకులకుఁ। గామితవస్తువుల నొ
సఁగు కాలమునందున్। భూమీశుల కిడరానివి। చామరయుగళంబు గొడుగు జ
ర్చింపంగన్॥ చ॥ కమున నభిలాషమీరు నడుగంగఁ దలంచిన చామరంబులున్। గొడు
గును దక్కఁ దక్కినవి గోరుఁడు వస్తువులెవ్వియైన నే। నొడపక యిత్తునావుడు న హ
నకుతూహలముప్పతిల్లన। ప్పడఁతులు పల్కిరిట్లనుచు భానుకులోద్భవుతోఁ డఁజ
య్యనన్॥ ఉ॥ శీతలవస్తుసంతతులచేత సడంపఁగ వచ్చుఁ గొంతయు। యాతపతా
పఖేదము ధరాధిప మన్మథబాణఘాతసం। జాతవియోగతాపమునఁ జాలఁ గృశ
త్వము నొందుచున్నను। కౌతుకలీల నీవిగువు కౌఁగిటఁ జేర్పు రతిప్రసంగతిన్॥
వ॥ అనుటయుం గర్ణపుటంబులం గరంబులు చేర్చి యవ్విమలచరిత్రుఁడు శివస్మరణం



బు చేసి ప్రచండరోషంబున నంజండాలబాలికలం జూచి మీరలధికముద్రాధారిణుల
ని తిరస్కారంబు సేయనేరక యూరకున్న నింగితంబెఱుంగక మదిరాపానవికా
రంబున శరీరవిస్మృతిం బొంది విప్రలాపంబులు పలుకఁదరని వెండియు నిట్లనియె॥
తే॥ దర్శనస్పర్శములకును గరుమీరు। మీకుఁ గౌఁగిలియిమ్మన మెలఁతలార। పలుక
నాలుక లెట్లాడె భయములేక। తెలియ మీ జాతి యెంత బుద్ధియును నంత॥ క॥ చూచి
నమీ యందిప్పుడు। యాచకముద్రావిశేష మణుమాత్రంబున్। దోఁచదు మీ రెక్క
డివా। యాచండాలాంగనలౌ మహాద్భుతమరయన్॥ క॥ ఆయతకారుణ్యంబు
న నీయపరాధంబులును సహించితి నికన। న్యాయోక్తులేమి పల్కినఁ। గోయుదు
నాలుకలు మిమ్ముఁ గొంకక యలుకన్॥ చ॥ అనుటయు నాసరోరుహదళాక్షులొ
కింతయు శంకలేకయు। బ్బున మదగర్వముల్ పొదల భూపతి డగ్గఱి పెక్కుభంగు
లఁ। గనుఁగవ లార్చుచు న్వివిధకామవికారవిధానకృత్యముల్। గ్గొనకొని చూపుచు
న్మతియుఁ గోరి యకారణహాస్యలీలలన్॥ సీ॥ పొరిఁబొరిఁ గింజల్కపుంజంబు లెగ
యఁ గేళిసరోజాతముల్ త్రిప్పికొనుచుఁ। గడకంటిచూపుల బెడఁగొందు వీనుల
తొడవులొయ్యనచక్కఁ ద్రోచికొనుచు। దోర్మూలరోచులు ద్రుళ్లుగింతలు వెట్టఁ ది
వుటమైఁ ధుఱుములు దిద్దుకొనుచు। నొసపరిబాగుగా నొసలఁ గస్తూరికాతిలకం
బులొయ్యన తీర్చికొనుచు॥ తే॥ తలుదనును గుబ్బచనుదోయి వెలికిఁ దోపఁ। జిలుఁ
గువలిపెంపు బయ్యెద చెఱఁగులొత్తి। పొసఁగ లేఁజెమటారంగ విసరికొనుచు। మ
సలుచుండిరి శృంగారమహిమ చెలఁగ॥ క॥ ముద్దులుగురియుచు ముగియుచు। నిద్దపు
టద్దములలోన నీడల యొప్పుల్। పెద్దయుఁ జూచుచు నైకొని। గద్దరితనమున విలా
సకళలు దొలంకన్॥ ఉ॥ విందులుగాఁగఁ గర్ణపుటవీధులకుం బికనాదలక్ష్మికిం।
బొందులుగాఁగఁ బల్లవికపుంగవమోదకళాభివృద్ధికిన్। మందులుగాఁగఁ బల్కు
చును మందమనోహరవిభ్రమంబులం। జిందులు వాలుచుం జిరుగు చేతులఁ దాళ
ములొత్తియాడుచున్॥ తే॥ ధరణిపతి డాసి నరపాలతమకుఁ దాము। తివిరి మో
హించి వచ్చిన యువతిజనుల। నతులఁ దేల్పక పూని తిరస్కరించు। టరసి చూచినఁ
గారాదు పురుషులకును॥ ఉ॥ కావున మమ్ముఁ బ్రేమమునఁ గౌఁగిటఁ జేర్చి రతిప్రసం
గలీలావిభవంబునన్ బహుకళానిపుణత్వము మీఱ నన్యథా। భావములుజ్జగించి ని
రపాయసుఖస్థితిం బొందు రూపరే। ఖావిధుబింబ మన్మథుని గర్వము సర్వముఁ
బాయునట్లుగన్॥ క॥ అంభోజముకుళసమకుచ। కుంభంబులు రాయిడింపఁ గోరి
కలలరన్। బుంభావరతుల నినుఁ గడు। సంభావించెదము మాకుఁ జనువీవలయున్॥
తే॥ మానవాధీశ యీలతామందిరంబు। రమ్యమై యున్న దిచ్చోటు రతివిహార।
యోగ్య మీరీతిఁ దడయంగ నుచితమగునె। రమ్ము విరహానలమున కోర్వంగ లేము॥

వ॥ అనియువ్విధంబున నంబ్రేలుచు వాలుఁగంటులు మహీపాలు కేలు కేలం గీలింపను
ద్యోగించుటయు నాలీలావతుల తలం బట్టి యంగినిలింపపతి ప్రతిమానుండగు నబ్బా
నుకులాభరణంబు తాలిమిఁ దొఱంగి యమ్మాలెతల మదంబడిపెడ ననిదర్వీకరభీ
కరతర కశాఘాతంబులం గాయంబులు జర్జరీభూతంబులు సేయం దొడంగినం గ
నుంగొని యమ్మాత్యపురోగవుండగు సత్యకీర్తి కదియంజను దెంచి కరసరోజంబు వట్టి
సన్నుటం దొలంగం దిగిచి పోవైచి మనంబున గారుణ్యంబు పూరించి నిలిచి॥ మ॥ జ
ననాథోత్తమ యాఁడువాండ్ర పయి నీ చందంబున న్సాగ్రతం। గినియం బాడి యె
శిశుకర్ప లెవితరిఁ నంపన్సరోజేక్షణల్ । వినుమీవల్గినదుర్మదోద్ధతమహావిద్వేషి
రాజన్యసై। న్యనికాయంబుల మీఁదఁ గాక తగునే యన్యప్రదేశంబులన్॥ క॥ త్రిద
శేంద్రసదృశ నీవీ। సుదతుల వారింపఁ బూనుచో పృథ్వీ వలంపన్ । మదనాగమరేఁటి
కోదమల । విదళింపఁగఁ బూనునట్టి విధమైయుండున్॥ సీ॥ ఈ వెలందుల కలప
ద్యోదలభియాతిభూమీతలాధీశుల కేతనములె । యీ పంకజాక్షుల యెలవంక
బొమలహంకారవద్వైరులకార్ముకములె । యీ కీరవాణుల కోకస్తనంబులు
మత్తారిగిరిదుర్గమండలములె। యీ రాజముఖుల మృదూరుదండంబులుకపట
ద్వేషులకరికరములె॥ తే॥ ఈపడంతులకడకంటిచూపులహిత। మనుజనాయక
సునిశితమార్గణములె। వీరిగోపింపదగునె యుర్వీకళత్ర। కృపదలిర్పఁగఁ జూచిర
క్షింపవలయు॥ మ॥ వలదీరోషము మానుఁడీ తగదు నావాక్యంబులాలింపుఁ। డర్థుల
బత్యర్థులరీతిఁ జూచిన మహాదోషంబు ప్రాపించును। జ్వలకీర్తీశ్వరయాచకప్రి
కరరక్షాదక్షయీ వేళకున్। వలయున్నామక శేముషీపథమున న్వర్తింప శాంతస్థి
తిన్॥ తే॥ అనుచు హితబుద్ధినుడివి ప్రియంబు మీఱ। శాంతుఁగావించి మరలించె సచి
వుఁడధిపు। నంకుశంబున సూఁదినయంత భద్ర। దంతి మరలించునట్టి చందమున దలి
ర్పు॥ క॥ తదనంతరంబ ప్రియము। న్పదమలవాగ్వృత్తి వెలయఁ జంద్రమతియుఁ బె
ల్లాద వెడమతి నైపుణమున। హృదయేశ్వరు మోముచూచి యిట్లని పలికెన్॥ సీ॥ ఏ
న్నఁడైన నువింటి మేమహీతలమున నకసారంగంబు గలదనంగ। నాయిట్టి వెం
బడిపడి యాసని చ్చోటికే గుదెంచితిమి విహీనబుద్ధి। నెక్కడిమాలెత లేతెంచిరీ
తాపసాశ్రమభూములకనుచితంబు। చండాలబాలికాజనములకిటువంటి చక్క
దనం బెట్లు సంభవించె॥ తే॥ విశ్వసింపంగఁ దగునె వివేకులకును। భూమిపాలక
యుడిగాధిపుత్త్రుకపటకృత్యమింతయుఁ గాకున్న నిట్టియద్భు। తములు గలుగంగ
నేర్చునే తలఁచి చూడ॥ క॥ అవుడు వసిష్ఠమహాముని। విపులకృపాగరిమబుద్ధి విల
సిల్లంగా। నుపదేశించిన పలుకులు। నృపవర తారార్కమయ్యెనిపుడిచ్చోటన్॥
వ॥ అనిపలుకుచుఁ డనమ్మాతంగకురంగలోచనలక్కడఁ దలంగిచని॥ సీ॥ మురువేది



వాడిన మోముదామరలును గడు నొప్పిపొందిన కాయములును। గొప్పులు వీడిచి
కుఱులుపజ్జకురులును వీతరాగములైన వాతెఱలును। జఘనమండలమునజాఱిన
చీరలు ఘనరక్తసంసిక్తకంచుకములు। కరఁగినయంగరాగములును మిగులఖండ
ములైన కర్ణతాటంకములును॥ తే॥ బాష్పధారలఁ దోఁగిన పయ్యెదలును। ప్రేలిము
క్తాఫలంబులు రాలుసరులు। కలసినాదంబు తెడలిన కంఠములును। గలిగి యత్యంత
దైన్యంబు గ్రందుకొనఁగ॥ క॥ త్రిజగత్పవిత్రు నవపం। కజనేత్రుఁ దపోవిశేషగాత్రు
సముద్యాన్నిజతను తేజోవైభవ। విజితప్రాభాతమిత్రు విశ్వామిత్రున్॥ చ॥ కని
మునిచంద్రయాధరణికాంతుఁడు మమ్మ మహాగ్రకోపియై। కినుకమనంబులో
మిగులఁగిల్కొనఁ బొత్తుల మొత్తుకైవడిం। గొనకొని మొత్తె సమ్మెటలఁ గొంకక కని
ర్దయవృత్తి జేసి మో। త్తినఁగడు నొచ్చి వచ్చితిమి తిక్కదలంపఁగ నీవు నావుడున్॥
శా॥ ఏమేమీ మిము భూవరాధముఁడు దానెం తేన హంకారసైనై। భీమస్ఫూర్తిఁగ
శాభిఘాతములచే బిట్టలఁ నొప్పించెనే। యేమాడ్కిన్ధరియించువాఁడొ యిఁక
నూహింపంగఁ గల్పాంతవే। శామృత్యుంజయఫాలనేత్రశిఖిలీలం బర్వుమత్కో
పమున్॥ వ॥ అని త్రిపురాసురవీరుల పయింగవియు ఫాలలోచనుండునుం బోలె
నాభీలరోషావేశంబునం గరకమలాక్షమాలిక నేలంబడవైచి కనత్కపిలాంగా
రశంకనంకురింపం జేయుదృగంతంబులంతంతకుం గెంపులీనుచుండ సమీపవాసు
లగు తాపసజనంబులమనమ్ములు తల్లడిల్ల ప్రచండదండంబు కేలంబూని జటాభా
రంబు దూలియాడఁగ టిమండలంబున వల్కలాంబరంబులువీడం బంఠ్లుగొలుకు
చుఁ బదంబులు దాటించుచుఁ జను దెంచు నవ్విశ్వామిత్రుంగనుంగొని హరిశ్చం
ద్రుఁడమ్మృగేంద్రంబుఁ గనుంగొనిన కరికలభంబు చందంబున నత్యంతభయంబు
నుఁబొంది॥ ఉ॥ మనసామ్రాజ్యవిభూతు లెల్లనిఁక నిమ్మానీంద్రుచేఁ జాలనా। శన
ముం బొందక యుండు నేయని మనస్తాపంబు దీపింపనా। య్యానభార్యాయుతుఁడై
యెదుర్కొనుచు సాష్టాంగంబు దండంబు పె। ట్టినగోపంబునఁ దన్మహారమణు
కోటీరంబు బీరంబునన్॥ ఉ॥ తన్నిన మాన సాబ్జమున ధైర్యమొకింతయు జాఱనీక
య। త్యున్నతభక్తితో వినయముబ్బఁగ వెండియు మ్రొక్కి తెల్విమై। నన్నరనాథ
పుంగవుఁడు హస్తసరోజయుగంబు మోడ్చియు। ద్యన్నవభాను తేజుఁడగు తాప
సకుంజరుఁ జూచి యిట్లనున్॥ చ॥ అనఘచరిత్ర మీమృదుపదాబ్జము మామకరత్న
యుక్తకాంచనమకుటంబుతో నొరసి చాలగ నొప్పివహించె నేనొనర్చినయప
రాధమేమి యిటు సేయఁగ నానతియిమ్ము నావుడున్। మునికులముఖ్యుఁ డిట్లని యె
మోమరుణాంబుజకాంతి నీనఁగన్॥ శా॥ ఓరీ రాజకులాధమా నృపులు లేరో వేఁట
రారో మదవ్యాఘ్రాభీలమృగాదులందును మరోఘోరాటవుల్లేవొ మా। యారా

ముంబుఁగలంచి జంతుతతి మాయం జేసియు స్నాతుకమా। రీరత్నంబులు వేఁడవచ్చి
ననువారి న్నోఁదినావేమి రా॥ క॥ ఒక పాదమనఁగ నేటికి। సకలాంగంబులును నొచ్చె
సాహసవృత్తిన్। మొకమోడక నీ చేసిన। సకలటిక కృత్యములు మాకుఁ జర్చింపం
గన్॥ క॥ ధరణీశ చంక దుడ్డును। శరణార్థియు నడు మాట సరివచ్చె ముని। శ్వరబా
ధకమగు నీదు। శ్చరితము పరికింప మిగుల సాహసివరయన్॥ చ॥ ఇలఁగల రాజులెల్ల
భజియింపఁ మహోన్నతిఁ జక్రవర్తివై। యలరుట యెల్ల తాపసజనాశ్రమభూ
ముల కొగ్గు సేఁత కే। తులువ భవద్వివేక మతి దుర్నయమార్గ యని వ్విధంబునన్। మె
లఁగఁగ నీకు నెవ్వఁడు సమిద్ధమతిన్ సెలవిచ్చె జెప్పుమా॥ ఆ॥ అసిమిలోని దొకటి
యమ్మోడి దొక్కటి। నీ చరిత్ర మెల్ల నేఁడు తెలియ। వచ్చె మాకుఁ గపటవర్తనుఁడ
వు నీవు। చేరి నిన్ను విశ్వసింపఁ జనునె॥ చ॥ నృపతులు తొంటివారలు విజృంభణలీలఁ
జమూసమేతులై। విపినములన్వినోదగతి వేటమెయిం జరియించుచుండ రే। తపసు
లయాశ్రమంబులకుఁ దద్దయు నీవలె నిష్ఠురక్రియం। గృపహృదయంబులో వదలి కీ
డు దలంపరు గాక యెన్నఁడున్॥ క॥ మాయాశ్రమసారంగముఁ। బాయక వెను వెం
టఁ దగిలి బడలించుచుఁ గ। ర్వాయత్త చిత్త మదమున। న్యాయంబా నీకు మద్వనంబు
చొరంగన్॥ చ॥ అలరులు రాల్చు చుందలిరుటాకులు దుంచుచుఁ బక్వమైన స। త్ఫల
ములు గోయుచు న్వివిధపాదపశాఖలు పట్టి యూఁచి ప। క్షుల బెదరంగఁ దోలుచు
విశుద్ధ సరోవరవారిపూరముల్। గలచుచు గాసి సేయు పలుగాకుల మాన్పవు నీదు
భృత్యులన్॥ వ॥ అదియునుం గాక॥ మ॥ మరి నా పెంపుడు కూఁతులై వెలయు నీమా
తంగవామాక్షులం। గరిణీయానల బల్లవాధరల రాకాచంద్రబింబాస్యలన్। సర
సాలాపకళావిలాసనిధుల న్సంగీత చాతుర్యలం। గరుణాహీనతఁ బట్టి సమ్మోటల
నలకంగొట్టగాఁ బాడిమే॥ తే॥ ఆశ నర్థింపవచ్చిన యట్టివారి। కీప్సితార్థంబులి
చ్చుట యెల్ల మాని। నెట్టుకొని బిట్టు వారిఁ బోఁగొట్టు టెల్లు। రాజ్యమదమున నన్ను
విరసకరించి॥ క॥ వికసితశిరీషకోరక। సుకుమారశరీర నారశోభాన్వితలన్। మొ
కమోటమింత గలుగక। యకటా మోదంగఁ జేతులాడెనె నీకున్॥ ఉ॥ మామక
రోషవహ్ని పలుమాఱు నను బ్బఁడొ డంగఁ జేర్చెనే। వేమెయి నింక నా యెదుర నె
క్కుడి కేగుదు దుర్మదాంధయా। హైమవతీ మనోరమణుఁ డడ్డము నిల్చిన నిల్చు సం
దియం। బేమియు లేదు పూని నినుఁ నిప్పుడె ప్రాభవహీనుఁ జేసెదన్॥ వ॥ అనిన నమ్మ
హీపతి సంవర్తసమయసమవర్తి యుంబోలె మహోగ్రమూర్తియై యున్న
యమ్ముని చక్రవర్తిం గనుంగొని తదీయ తనుప్రభాపటలంబు మిఱుమిట్లు గొలుప
భయభ్రాంతుండై యేమియుం బలుకనేరక నివ్వెఱపడి యూరకయున్న నా భూ
మింజయుఁ జేరి మేనత్తా సంబు మాన్పి హితోపదేశంబు చేయం దలఁచి నిత్యసత్యవి



వేకవర్తియగు సత్యకీర్తి ధన్యుండిట్లనియె॥ సీ॥ మనుజేశ నీవు మూఢుని రీతి నిట్లేల మిన్నక
భ్రమఁ బొందియున్నవాఁడ। నాపద ప్రాపించునప్పుడు ధైర్యంబు విడువక మిగుల
వివేకబుద్ధిఁ। దెలివిమై మెలఁగంగ వలయు మానుష మున కైవిక మటు మీఁదఁ దప్పదె
వ్వరుఁ। గావున నిమ్మౌనికంఠీరవము జేరి ప్రార్థింపు మేన పరాధి ననుచు॥ తే॥ గా
లకూటవిషాగ్నులఁ గడచు నితని। భీషణంబైన దుర్వారరోషవహ్ని। యితని పే
ర్విన్నఁ దలఁకుదు రేమిచెప్ప। హరివిరించిపురందరాద్యమరులైన॥ క॥ తాను ప
యిఁ దూఁచి చూచిన। వాసుకి కంకణుని కెత్తువచ్చు నితండో। వాసరవల్లభవంశ
జ। యీశంయమిఁ బోలఁగల దె యెచ్చోఁ దపసుల్॥ మ॥ కరుణాపాంగనిరీక్షణ
స్ఫురణ నీ గాధేయుఁ డొక్కింతయా। దరవృత్తిం గనుఁగొన్న యంతటన మోదం
బారఁ గల్యాణముల్। దొరకున్ మానవలోకసంతతికి నస్తోకప్రభావుండు భూ।
వర యీ పుణ్యుఁడు నగ్రగణ్యుఁ డరయ న్వాచంయమశ్రేణికిన్॥ ఉ॥ నావుడుఁ డె
ల్విఁబొందిన నరనాథశిఖామణి ప్రేమ హస్తరా। జీవయుగంబు మోడ్చి మునిశేఖ
రుఁ గన్గొని యో మహాత్మ నన్। గావఁగ వయ్యనా వలనఁ గల్గిన నేరములెల్ల మాటి
కిన్। భావములోఁ దలంపక యపారకృపారసమానసుండవై॥ క॥ మీకిను కకెద
రి నిల్వఁగ। నాకుం దరంబగునె త్రిభువననుతశశిరే। ఖాకల్పశేషతల్పులు। నాకం
పము నొందిభయమునం దుదురనినన్॥ తే॥ తనయుఁడజ్ఞానియై చేయు తప్పులె
ల్లఁ। గన్నతండ్రికి లోఁగొనికరుణఁ గావఁ। జనదె యటు తూఁటి సూరకుఁ జంద్ర
హాస। పెత్తుదురె మేల నామీఁద నింతకినుక॥ తే॥ మూఢమతిఁ జెందియపరాధము
లు గడంగి। నేనొనర్చితిఁ జాలనజ్ఞానినగుచు। వానినన్నిటి లోఁగొని వత్సలతన। ను
గ్రహింపుము మౌనిజనాగ్రగణ్య॥ శా॥ మీ కోపంబను శేషపన్నగము నామీఁదఁ వ్రా
డినాఁ గనో। కారుణ్యాత్మక నేమహాభయమునం గంపించుచున్నాఁడనన్। జేరఁ బ్రి
మ్మని బల్కి తల పైఁ జేచేర్చియూరార్చినా। నేరంబుల్ హృదయంబులోనిడక మ
న్నింపంగ దే ప్రేమ కెక్కుదన్॥ తే॥ పూని శరణంబు వేఁడెదు నాని నెట్టి। దుష్టశాత్ర
వుడైన నోశిష్టవర్య। యెగ్గులెన్నక మతి భయం బెల్లనుడిపి। ప్రోచుటయు యుత్తమం
బు కారుణ్యమతిని॥ తే॥ తాపసోత్తమ నీదు చిత్తంబు నాదు। భాగ్యమింద్రాది దేవ
తాప్రభుతిఁ గన్న। నిన్ను శరణంబు వేఁడెద నీళ్ళ ముంపు। పాల ముంపుము వేయును
బల్కనేల॥ వ॥ అని హరిశ్చంద్రుండు సుతసతీసమేతుండై మహీతలంబునం జాఁగి
లిదండప్రణామంబులతి ప్రేమం గావించి లేవక దీనభాషణంబుల నన్యథా శరణం
నాస్తి త్వమేవ శరణం మమ యనుచు ప్రార్థింపఁ గొంత సేపునకు నమ్మునిదంతావళంబు
కెక్కుతదయ నిజస్వాంతంబునం గీలుకొల్పి శాంతభావంబు వహించుచు నారాజ
శేఖరు మహానుభావంబు మదిలో మెచ్చుచు నతనిశిరంబు కరంబున నెత్తి లేలెమ్మని యి

ట్లనియె॥ తే॥ నీవుచేసినదోషంబునీకయుండె। దీర్ఘరోషంబుమాకునింతేసియేల।
మొగమునందున్ననీదైన్యముద్రఁజూచి। కరుణజనియించెఁగాచితిధరణినాథ॥
క॥ ఘనుఁడవగుకతననీచే। సినదుండగములుసహించిచేపట్టితినే। మనుజేశయిం
కనాచె। ప్పినవాక్యంబొకటిసేయఁబ్రియముదలిర్పన్॥ ఉ॥ క్షోణితలేశనాయను
గుఁగూఁతులవర్ణనసేయనొప్పున। ప్రాణసివువ్వుబోఁడులనుబల్లవపాణులఁ
జారుసైకత। శ్రోణులఁగీరవాణులమరున్మణివేణులసర్వలోకక। ల్యాణులనీవుని
చ్చెదఁబ్రియంబునవారిఁబరిగ్రహింపుమా॥ క॥ నాపలుకుల్లంఘింపక। భూపా
లకవారిఁబ్రీతిభోగినులనుగాఁ। జేపట్టినుమతనేలిన। గాపట్యములేకనిన్నుఁగా
చెదనెపుడున్॥ తే॥ సూర్యకులవర్యనీమనస్థైర్యమెఱుఁగ। వలసియూరకపలి
కినపలుకుగాదు। మాకునానందమొదవనమ్మానవతుల। నాదరక్రియఁదగఁబెం
డ్లియాడవలయు॥ వ॥ అనియివ్విధంబునంబలుకునమ్మునీంద్రువాక్యంబులమ్మహైక
ర్ణపుటంబులకు నసహ్యంబులగుటయు నమ్మహీవల్లభుండుల్లంబునఁదల్లడిల్లి
డిల్లపడియెల్లవిధంబులఁగపటకృత్యంబులుగల్పించి యిక్కల్లరితపసిసేయును
పద్రవంబులాసాదింపక యిచ్చెలవ్రదొలంగి పోవనీయండేఁగాంచినదుస్స్వ
ప్నఫలంబుమిన్నకతొలంగునేయనికౌశికునింగనుంగొని॥ తే॥ క్షత్రియత్వంబు
వర్జించిసంయమీంద్ర। తగునెనాకిప్పుడీమాటలెతలవరింప। నంటఁగారానియ
న్యాయంబకటయెట్లు। తెలియకీమాటమీరానతిచ్చితిరిట॥ సీ॥ అనినవిశ్వామిత్రుఁ
డవనీకళత్రునిగ్గినుకజనింపవీక్షించిపలికె। వివరించిచూడభూవిభులకుఁదప్పవు
ఘనతపోనిరయదుఃఖములుధరణి। నాథరాజ్యాంతానినరకాణియనిపలుక్కుసల
లితస్మృతివాక్యసరణివినవె। కావుననాయాజ్ఞనీవెలివాడఁకజిగురాకుబోఁడుల
దగవరించి॥ తే॥ పూజ్యసామ్రాజ్యసౌఖ్యసంభోగమహిమ। చెందుటయబుద్ధిదీ
నికిఁజింతయేల। నెమ్మిఁబరలోకసౌఖ్యంబునమ్మినేఁడు। దొరకులాభంబువిడువ
వేఁదుఱునుగలఁడె॥ ఉ॥ నేరవుసౌఖ్యమొందధరణీపయజీర్ణముఁబొందునంచు
నాహారముమానివెల్లాదవునాఁకటిచేఁగృశమైచరించుటల్। సారవివేకమేతల
పఁజయ్యనినీమెలఁడీఁగెబోఁడులన్। గౌరవలీలఁగైకొనుముకాదనుమీమతిసం
శయింపఁగన్॥ తే॥ పసిఁడిమేడలలోనఁబూఁబాన్పులందు। బాసగనీయిందువద
నలబొందితేని। బొంచితోడనెజంభారిపురికినుతు। ననఘవర్తనుఁడగుభవ
జ్జనకునట్లు॥ తే॥ అనినమనుజేంద్రుఁడిట్లనుమునివరేణ్య। మత్కులాచారమెడలియా
మానవతులఁ। గూడియుండుటవివరింపనోడవిడిచి। వదరుపట్టినయట్లపోత్రిదశ
వంద్య॥ తే॥ కులముడిగదాచియీమాటలెత్తలవరించి। కాంచుగీర్వాణలోకసౌ
ఖ్యంబులొల్ల। బంతమునరాజ్యమైనవర్జింతుగాని। చలముకొనియెన్నిచెప్పినం



గులమువిడువ॥ సీ॥ అనినభూవరుఁబట్లయగుఁగాకనీవింకఁ దిరుగనాడినపుహా
దేవునాన। నీసర్వరాజ్యంబునేఁటితోవర్జించితడయకమాకిమ్ముధారవోసి। సా
మ్రాజ్యసంభోగసౌఖ్యంబుమాకోర్కినీకారణంబుననేఁడుదొరకె। గరిమఁదో
రణములఁగట్టకింతేవాసిజనులబంపవలయుసంతసమున॥ తే॥ వసుధప్రజలకుఁ
దగనానవాలుగాఁగ। నెలమినీయంగుళీయకమిచ్చిపనుపు। నాయునైశ్వర్యపు
త్రపౌత్రాభివృద్ధి। బొందుమాచంద్రతారకస్ఫురణవెలయ॥ వ॥ అనుటయున
వ్విశ్వామిత్రునకువిశ్వంభరాకళత్రుండిట్లనియె॥ మ॥ తగమీయానతిసేయుకం
టెనుబ్రశస్తంబైనపుణ్యంబులీ। జగతింగల్గునెనాకుబంధురతపస్సామ్రాజ్యసిం
హాసనం। బుగురుప్రాభవలీలనెక్కిమిగులంబొల్పొందిబ్రహ్మర్షివై। దిగధీశ
స్తుతకీర్తిగాంచినమహాతేజస్విమీవారియన్॥ క॥ మీకోర్కిసలుపఁగలుగుట। శ్రీ
కరబహుపుణ్యగణ్యాచిరతరలక్ష్మిన్। జేకొనుటగాదెమునివర। యాకల్పముగాన
నేఁగృతార్థుఁడనైతిన్॥ ఉ॥ శ్రీలుదలిర్చుచుండమునిశేఖరమున్నిటిదాఁకము
న్నుమీ। రేలినభూమిగాదెయిదియిమ్మనినన్ననెలక్రమ్మఱం। బాలనమాచరింప
మతిఁబాయకవాంఛజనించెనేనిభా। షాలలనామనోరమణసన్నిభగైకొనుఁడె
ల్లరాజ్యమున్॥ తే॥ తెల్లముగవస్మనశ్శుద్ధితెలియఁగోరి। పలికెదరుగాకమీకేమి
భ్రాంతియస్థిరంబులైనట్టియీమహీరాజ్యసుఖము। లనినధరణీశుఁజూచియమ్మ
నివరుండు॥ మ॥ సెలవింబాఱఁగనవ్వుచుంబలికెనాక్షేపించియీనేర్పుమా। టబు
మాముందఱసాగిరావుపెఱచోటంగానిభూపాలరా। జులలోనన్నినుసత్యవా
క్యయతుఁడంచుంజెప్పఁగాముజ్జగం। బులయందున్వినుచుందుమప్పలుకుదాఁ
బొంకయ్యెనీపట్టునన్॥ సీ॥ ఇనవంశమున్ననీవిచ్చెదననిపల్కిజాఱనాడఁగనీకుఁ
జనునెయిపుడు। మిన్నకచననియ్యనిన్నుమిథ్యాలాపశీలతారతుఁగాఁగఁజేసి
కాని। మృషలుపల్కితినాస్త్రిమీరేగుఁడనిననుబోయెదమాటలువేయునేల। యని
పల్కుచుండంగనావేళఁజంద్రమతీకాంతభర్తకాంతువిక్కచూచి॥ తే॥ తపసి
గావించుకపటకృత్యంబులనెడి। యురులఁదగిలితిమిఁకనేలయొందుతలఁపు। లేమి
పలుకంగఁజూచినభూమిరమణ। బొంకుదొరయనిధైర్యంబుపూనవలయు॥ క॥
మీరిఁకనేమియుఁబలుకక। ధారుణియంతయునుగాధితనయునకిచటన్। ధారా
పూర్వకముగనని। వారితమతిదానమిందువసుధాధీశా॥ క॥ మితభాషణుండుసం
భృత। వితతార్థచయుండునగుటవివరింపఁగసూ। నృతసంపదయునువితరణ।
చతురతయునుగోరికాదెసజ్జనుఁడెందున్॥ చ॥ మునుధరయేలిచన్ననృపముఖ్యు
లనేకులుచర్చచేసినన్। జనవరవారిలోనవిలసన్మతిపారగులెవ్వరైనసొం। పునఁ
దమవెంటనుంటిమొనమోపఁగఁజాలినయంతమేరయుం। గొనిచనిరేధరాతల

ముకొంకకునీయుల దానమిచ్చుచోఁ॥ క॥ భూమితలమెల్ల మాయా।వామనవటుమూర్తియైన వనజాక్షునకుం। బ్రేమంబున బలియొసఁగఁడె। యామరతరువితరణక్రియాదీపితుఁడై॥ ఉ॥ ధీనిధియైన విప్రునకుఁ బ్రియలీలఁ దధీచియొకీకడఁ। జేసెఁడు మేరయిచ్చి సుప్రసిద్ధయశస్థితిఁ గాంచెఁ ఘనియం। భోనిధివేష్టితక్షితి విభుత్వముమీరఁగ దానమేలు భూ। దానముఁ బోల లేవు మఱి దానము లెవ్వియు మానవేశ్వరా॥ క॥ దశదానంబులలోపల। విశదాధికమహిమ నొప్పు వేల్పులలోనం। బశుపతిగతి భూదానము। వశమే తత్ఫలము దెలిసి వర్ణింపంగన్॥ క॥ వసుధేశపాత్రదానం। బొసఁగంగాఁగఁ దగ్గమీకు సుర్వీచక్రం। బసదృశవితరణమహిమం। బొసఁగంగాధారఁబోయఁ దెలిమిదలిర్పన్॥ వ॥ అని నిజహృదయానుకూలంబును నఖిలభువనభరితయశోమూలంబును నిత్యసత్యాలవాలంబును గాఁ బలుకు నన్నిలవేణివాక్యంబులాకర్ణించి యమ్మహీకాంతుండు సంతోషితస్వాంతుండై॥ క॥ ఆహా యీసతి విహిత।వ్యాసారము లెంత యొప్పె ననుకూలవరా।రోహాలు గలిగిన బతులకు।నూహింపన లభ్యవస్తువొకటియుఁ గలదే॥ క॥ తన చేయు ధర్మమునకును।మనమున వేడ్కొందు తలఁపు మాని ప్రమోదం। బొనఁగూడ మెలఁగ నేర్చిన।తనుమధ్యయె వానిపాలి దైవంబరయన్॥ వ॥ అని పలికి తూర్ణంబుగ సువర్ణకలశంబులఁ బావన జలంబులు దెప్పించి దేవబ్రాహ్మణక్షేత్రంబులు దక్కఁ దక్కిన ధాత్రీతలంబు సర్వంబును సుమా మహేశ్వరప్రీతిగా మీకు సమర్పించితి నని యేర్పడం బ్రియపూర్వకంబుగాఁ గౌశికునకు ధారవోసె నయ్యవసరంబున॥ సీ॥ సారసౌరభములసకలదిక్కులయందుఁ గురిసెను మందారకుసుమవృష్టి। దివి నాదితేయవాదిత్రనిర్ఘోషముల్ గర్ణసౌఖ్యంబులు గాఁగఁ బ్రబలె। గంధర్వగానముఖ్యక్రియాసహితంబులప్సరోనృత్తంబులతిశయిల్లె। నింకనరుంధతీహృదయేశుఁ డెజయించుసన్నభోవాణివాక్యములు చెలఁగె॥ తే॥ నపుడు గాధిసుతుండు ధరాధినాథుఁ। జిత్తసమ్మదమొదవ నాశీర్వదించి। వినుతిఁ గావించి దుగ్ధాబ్ధివీచికాస। మానవాచాపరంపరామహిమ వెలయ॥ వ॥ అనిన విని కౌంతేయాగ్రజుండట మీఁది వృత్తాంతం బెఱింగింపుమనుటయు॥ మ॥ కరహాటాంధ్రకళింగవంగరమణీకందర్పపాంచాలబ। ర్బరహంసీగమనాలతాంతశరసౌరాష్ట్రాంగకాంభోజఘూ।ర్జరసౌవీరవిదర్భకోసలపయోజాతాననాదర్పకా। కురుకాశ్మీరమరాటలాటవిలసత్కేకస్త్రీమన్మథా॥ క॥ మందరపర్వతధీరపు।రందరవిభవాభిరామరతిరమణకన। త్సుందరకైలాసశర।త్కంధరసంకాశవిమలకమనీయయశా॥ స్రగ్విణి॥ లింగమాంబాసుతాలేలిహానైకపా। దాంగదధ్యావళీనాత్మగాంగేయగ।ర్వాంగనానర్తకీహారిజిహ్వాస్థలీ। రంగసారంగదృగ్రాజిమీనధ్వజా॥ ... *



గద్య. ఇది శ్రీమదాపస్తంబసూత్రపవిత్ర కౌండిన్యమునిచక్రవర్తిగోత్ర సకలసుకవిజనానీక మిత్ర దేచయామాత్యకుమార వినయవివేక విద్యాలంకార శంకరకవి నామధేయప్రణీతంబైన హరిశ్చంద్రోపాఖ్యానంబను మహాప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము. ... ... *

శ్రీ ర స్తు.

శ్రీ కం ఠా య న మః.

## హరిశ్చంద్రోపాఖ్యానము - తృతీయాశ్వాసము.

శ్రీమహనీయప్రాభవ। హేమాచలరాజధైర్య హితబంధుజన।స్తోమామరధాత్రీరుహ। భామాజనపుష్పభల్ల బాచయమల్లా॥ వ॥ ఆకర్ణింపుము అప్పాండవాగ్రజునకు మార్కండేయుం డిట్లనియె॥ క॥ ఆపగిదిం గొనియాడి మ।హీపతి వీడ్కొనుచు మునికులేశ్వరుఁ డరిగెన్। భూపాలకమణియును నయో।ధ్యాపురమున కేగి సముచితస్థితినుండెన్॥ ఉ॥ ఆమఱునాడు కౌశికమహామునియుం గృతకాల్యకృత్యుఁడై ప్రేమదలిర్ప శిష్యజనబృందము గొల్వ వసుంధరాధిపగ్రామణి పూనిపొంకసమకట్టును పాయము నాత్మలోపలన్। వేమఱు నగ్గడించుచును వేడ్కనయోధ్యకువచ్చెఁ జెచ్చెరన్॥ సీ॥ వచ్చి సర్వంసహావరుఁ గాంచి దీపింపనత్యంతభయకంపితాంగుఁ డగుచు। గద్దియడిగ్గి భూకాంతుండు సాష్టాంగదండప్రణామంబు తగ నొనర్చి। మణికుంభపూర్ణనిర్మలజలంబుల నర్ఘ్యపాద్యాదులిడి మధుపర్కమొసఁగి। సకలవైభవముల సామ్రాజ్యసింహాసనాసీనుఁ గావించి యక్షణంబ॥ తే॥ సచివసామంతకింకరజనులఁ బ్రజల। వేగరావించి వారితో విశదవాక్య। సరణిఁ గౌశికునకు మహీచక్రమెల్ల। ధారవోసినమార్గమంతయును జెప్పి॥ క॥ లోకములకెల్ల నేతిక। యీకౌశికమౌనివర్యుఁ డీతని పదనా।ళీకములు గొల్చియుండుఁడు। ప్రాకటతాత్పర్యవినయభక్తులు వొదలన్॥ తే॥ సుతసతీయుక్తముగ నేను ధృతి దలిర్ప। విపినభూముల కేగెద వేడ్కననిన। నధికశోకార్తులై వారల వనిభర్త।నడుగుఁదమ్ముల కెఱఁగి యిట్లనిరి బెదరి॥ ఉ॥ సల్లలితప్రతాపఘనసత్త్వవచోరచనాకలాపమీ। చల్లదనంబునం బ్రదికి సమ్మదమొందఁగ నేటిదాఁక నే।మెల్ల మనోరథంబులున హీనతఁ గల్గఁగ సౌఖ్యవృత్తిమైఁ।దల్లి మఱుంగు బిడ్డలవిధంబున

నుంటిమిమేవుచూవుచున్॥ క॥దారుణశార్దూలమునకు।సారంగములట్లమము
విచారింపకయీ।క్రూరునకునప్పగింపఁగ। నేయూపునబుద్ధివాడమెఁగృపవదలి
నృపా॥ సీ॥రుచిరామ్రపల్లవారుణజటాపటలంబొప్పొలుపొందుభసితత్రిపుండ్ర
కంబొ। లాలితరుద్రాక్షమాలికాజాలంబొహరిసారంగచర్మాంబరంబొ। సు
రుచిరస్ఫటికాక్షసూత్రవితానంబొ ఖండితదండకమండలువులొ।మహనీయజ
పహోమమంత్రతంత్రంబులొతరుణదర్భాంకురస్తబకచయమొ॥ తే॥తపము
సంతతమౌనముద్రావ్రతంబొ।కందమూలంబులొవ్రతోపకరణచయమొ।యొ
డవులనెపాయకుండుసంయములకేల। వసుమతీనాథసామ్రాజ్యవైభవములు॥
ఆ॥ఇతనిచిత్తవృత్తినెఱిఁగిమేమేరీతిఁ।గొలుచువారమధికకోపియితఁడు।మిహి
రకులవరేణ్యమీవెంటఁదోడ్కొని।యరుగవలయుమమ్ముఁగరుణననిన॥ ఉ॥ తో
యజగర్భుతోడఁదులఁదూఁగఁగనొప్పెడుపుణ్యమూర్తిగా। ధేయుఁడమీరలీ
తనియుదీర్ణమహత్వమెఱుంగలేరుగాం। గేయవసుంధరాధరముగెంటినగం
టునమర్త్యసన్నుతా। మేయతపఃప్రభావమున మిక్కిలికోపిమునీంద్రకోటి
లోకన్॥ తే॥బ్రతుకవలసినఁబ్రతికూలభాషలుడిగి।నాడునుడివిననుడువుననడపుఁ
డనుచు। నుచితభంగులవారలనూఱడించి। మనుజనాథుండుమునిశిఖామణికి
మ్రొక్కి॥ చ॥వినయముతోడభూప్రజలువేయువిధంబులసేవసేయఁగాఁ।మునికు
లముఖ్యవైభవసమున్నతిరాజ్యముసేయుఁడింకనేఁ। జనిమెదనన్నలేనగవుసొ
గేకునాననపంకజంబునన్।జననమునొందనిట్లనియెసంయమివర్యుఁడవార్యవై
ఖరిన్॥ చ॥ఇలకునధీశ్వరత్వమువహించిననాకుధరించుటొప్పుఁగా।నలబడిసేగు
మీకివియనర్హముశేటికిఁదాల్పనెందుని। ర్మలమతిఁబంచునాత్మననుమానములేక
తదీయతన్నభూ। షలునిఖిలంబుఁగైకొనియెఁ జయ్యననిర్దయచిత్తవృత్తియై॥
తే॥ కైకొనినఁదాల్మిచెలఁగభూకాంతుఁడపుడు। సుతసతీయుక్తుఁడైగాధిసూ
నుపాద।పద్మయుగళికిమఱియుసుభక్తిమ్రొక్కి।పురమువెల్వడియల్లననరుగు
నెడను॥ సీ॥ త్వరితంబనృపుఁగూడఁబఱతెంచియల్లననలుకజనింపసంయమివరే
ణ్యుఁ। డలనాడునినుమేముయజ్ఞార్థమడిగినధనమునీమీఁదనేయునిచినార। మా
పిత్తమీయకపోవంగఁబూచెదవిడివివేకములోనిడేతలంప।ధరణీశముఱచినఁదలఁ
పింపవలదెయన్యద్రవ్యమునకుదురాశయేల॥ తే॥ ఋణముదీర్పకయుండుటగు
ణముకాదు।మంచివారికిమదివివేకించిచూడ। నందులోపలమిగులబ్రాహ్మణుల
సొమ్ము।నపహరించినఁబ్రాపించునత్యఘంబు॥ క॥భూవల్లభమునుధరణీ। దేవున
కొడఁబడినస్వాపతేయముపిదపన్। వేవేగనీకయంకిలి।గావించినఁదలఁపరాని
కలుష ములొదవున్॥ తే॥ఎఱుఁగకొదవించెనేనియునినకులేశ।విప్రదత్తాపహార



ణముర్వీశ్వరునకు।జాలగల్మషమొదవుసంశయములేదు। మరచిసర్వంబుబట్టిన
గలవకున్నె॥ చ॥అనిననృపాలుడమ్మునికులాగ్రణిపల్కెడుక్రూరవాక్యముల్।విసికి
రముల్గ్రియాత్మగడువేదననొందుచునోమహాత్మ్మ।ఘనతరరాజ్యసంపదలుదా
చనిసర్వమునీకునిచ్చితిన్।దనివివహింపకిట్టిదగునాయపరాధములెన్నమాట
కిన్॥ చ॥ ఉడుపతిమౌళిమూర్తివనియెందుదలంపులుమానిభక్తినీ।యడుగులు
గొల్చికీర్తిమహిమాఢ్యుఁడనయ్యెదనంచునున్ననా।యెడహృదయంబులోఁగృ
పవహించితపోధనవర్యసారెకుం। బెడదలుచుట్టియప్పుబయిఁబెట్టకయింతటఁ
దృప్తిబొందుమీ॥ వ॥అనినబాలకురంగంబునాలోకించునాభీలశార్దూలంబునుం
బోలెనమ్మునిశార్దూలంబురోషాకారంబువహించి హునున్మనియదలించియిట్ల
నియె॥ తే॥నెయ్యమునఁదొల్లినీవుమాకియ్యకొనిన।ధనమువేఁడిననిట్లాడఁదగునె
నీకు।సత్యవాచాధురీణతజరపెదేని।విత్తమంతయుఁదెచ్చివేవేగనిమ్ము॥ క॥ ఇల
బూర్వద్రవ్యమునకు। సెలవుగనిచ్చితివెనిజముచెప్పుమునీమా।టలునేటిదాఁక
ననృతం।బులుపౌరయవునేడిదేలబొంకఁగనీకున్॥ చ॥అనుటయుమేదినీరమణుఁ
డామునివర్యుతలంపెఱింగినె।మ్మనమునధైర్యసంపదలుమాటికిఁబాదుకొనం
గజేరివం।దనమొనరించియోమునిజనస్తుతయిప్పుడుజోకఁజేసిమీధనమొసఁగం
గలేనిపరితాపమునన్మిమునిట్లుపల్కితిన్॥ క॥సంశయమేటికియోముని।వంశా
గ్రణియిచ్చెదన్భవద్విత్తమునేఁ। ద్రింశద్వాసరములకహి। మాంశుఁడుచం
ద్రుండుసాక్షియట్లేకున్నన్॥ సీ॥కొంచకముమువిక్రయించియైననునీధనంబుఁ
గైకొనుఁడుసర్వంబుననిన। నట్లకాకనిమానవాధీశువిడ్కొనియరిగిసత్వరగతి
మరలివచ్చి। యుర్వీశపాడమెనాకొకవిచారముసముపార్జితంబగువిత్తమను
దినంబు। నన్నుపొనమ్ముకైనీవునెచ్చంబుఁజేసిననెంతయుమోసమరయ॥ తే॥
ననుచుఁదనశిష్యవితతిలోనధికకోపి।వివిధమాయాప్రకారప్రవీణబుద్ధిఁ। బరుష
భాషణునిర్దయుభయదచరితుఁ। గతెనచిత్తునిశతునినక్షత్రకునిని॥ వ॥ కనుఁగొ
నికడియంబిలిచి తదీయకర్ణంబునఁగొన్నికపటక్రియావిశేషంబులుపదేశించి నీ
వీనృపకుంజరువెనువెంట జనియాయానెలవులంగూడంబడినధనంబుసర్వంబు
నువ్యయంబుసేయనీయక ప్రియంబుదక్కరయంబునంగైకొనుచు రేలునుంబగ
ళ్లునుంబాయక నిరంతరపథపరిశ్రాంతులంగుందించియు క్షుత్పిపాసాపరవశ
త్వంబునొందించియుఁ దాల్మిదూలించియుదైన్యంబుగీలించియుగాంభీర్యంబు
వదలించియు ఘనతరక్రోధంబుననదలించియుఁద్రింశద్వాసరంబులకునిరవశే
షంబుగనితండొడంబడినధనంబుఁదెమ్మనినియమించి యమ్మహీపాలునాలోకిం
చి॥ తే॥ ఇతనినువెంటఁవోద్కొనియేగిభక్తిఁగొనబుసాఁగఁగననుఁగనుఁగొనిన

యొట్లు। కనుఁగొనందగు నాయాసమును కనుఁగొర్వ। లేఁదు సౌఖ్యంబు జరవృఁడే నేఁడు
మొదలు॥ ఉ॥ అనినఁ బుత్రకు నప్పగించి నృపముఖ్యుని సన్నమదూర్ఛమిలో। ఘనదైన్యం
బున నూళ్ల వెంటనడుగంగా నీసునీవే విధంబున మావిత్తముఁ జోకఁ జేసెదవు నేర్పు
శ్రీ యిదదృంగి। యల్లననొకింతయేమియుంగఁ జెప్పఁదగునీలాగు నిరీక్షించెదరు॥
ఉ॥ క్షీరకణీనతంబౌరయ కోర్ధరణీశ్వరయింక నైన నా। కూరిమికూఁతులం గమల
కోశికవిస్ఫురణాపహాసివ। ఊరుహఘోర సంచలిత సూక్ష్మతమోదరులన్వరిం
చివి। స్వార విశేష రాజ్యరమ సర్వము నిచ్చెదఁ బూను నావుడున్॥ మ॥ వనజాతాస
నధీసిధీవినుఁడు దేవబ్రాహ్మణక్షేత్రముల్। పనిలేవేమియు మాకుము న్నెవివరిం
పందత్ప్రదేశంబులన్। ధనమార్జించిరయంబు మీబుణముసత్యస్ఫూర్తిమైఁదీ
ర్చెదన్। నను బల్మాఁ బనుమిన్న కేమిటికి సంతాపంబుఁ బొందింపఁగన్॥ తే॥ దయ
మనంబునఁ దలఁపక తలఁచి తలఁచి। వట్టికుచ్చితములు పన్నవలదు మమ్ము। వేళలఁ
బెట్టఁగ ఁదగి సాగి వెడలనింపు। కినుకచాలింపుఁ డేసు మీకింకరుండ॥ క॥ అనికౌశికు
నాడఁబడ జె। ప్పిన రేశ్వరుడరిగెనాత్మఁ బెనగొను ధైర్యం। బున మతి యేమియు బ
లుకక। వనితాసుత సహితుఁడగుచు వనభూములకున్॥ చ॥ మునివరుఁడంది నేశ
తులముఖ్యుని నిర్మలచిత్తశుద్ధికిన్। మనమున చాపురేయనుచు మస్తకమూఁచుచు
దానయోధ్యకుం। జనినయమార్గశీల తత్ప్రజాపరిపాలన మాచరింపసజ్జనను తు
సత్కీర్తి ప్రియసంగతితో నియమించి చయ్యనన్॥ వ॥ పురంబు వెడలి యదృశ్యా
కారుఁడై ధారుణీశ్వరువెను వెంటదగిలి చనుచున తండగు తెరువున నతిదుర్గ
మంబుగా భీషణ పాషాణ కంటకానేక వల్మీక తరుపుంజంబులు నిర్మించియు నెట్టు
కొనితీవ్రాతపంబుగాయునట్లుగా నుష్ణకిరణుని గట్టిగఁ జేసియు వాపీకూపతటా
కసద్మాకర తరంగిణీప్రహ్రాదవ్రాతంబులు శుష్కభూతంబులు గావించియు దుస్త
రక్షుధాతురత్వంబును జెందివన్యంబులగు ఫలంబులు గొనిభక్షింపం బోయిన న
త్యంతతిక్తంబుగాఁ జేసియు నిరంతర భయంకరంబులుగా దుష్టమృగసముత్క
రంబులం గల్పించియు నిర్దయస్వాంతుండై బహువిధంబులగు నంతరాయంబు
లొనర్చుచుండె అయ్యవసరంబున॥ సీ॥ వదలి క్రొమ్ముడి వీడి వాడి మాల్యంబులు వే
మాఱు మూపుపైఁ ప్రేవేలియాడ। నీరమల్లాడుచో నెడలేమిను త్తరీయాంచలములు
కంటకావృతముగ। ఘనతరాతపము చేఁ గందిన మైఁ దీఁగ నవిరళ ఘర్మబిందువులు
వోడమ। సోనలై సాంజనాశ్రుజలపూరంబులు పాలిండ్లపై దిగి పాఱుచుండ॥ తే॥
నందనునిఁ జంకనిడుకొని నడచినడచి। యలసియడుగోక యామడైయరుగుదెం
చు। చంద్రమతిఁ జూచి యాహరిశ్చంద్రనృపతి। యుల్లమునఁ జింత యెంతయు ను
ప్పెఁ ల్లి॥ సీ॥ ధాసురమణిమయప్రాసాద నిశ్రేణులెక్కఁ గానోపదీ యిందువదన।



కోమల శశికాంత కుట్టిమ స్థలములు మెట్టంగనోపదీ మెఱుఁగుఁబోఁడి। మందిరా
రామ సీమా సమీపంబుల విహరింపనోపదీ విద్రుమోష్ఠి। పోషిత నవకీరపోతంబుఁ
గైగేలఁ ధరియింపనోపదీ హరిణనయన॥ తే॥ నగములెక్కితి నాగోహణంబుఁ జేసి
మొనసి యేమాడ్కి గమనించి మొరపనేల। భయదకాంతారభూములెబ్బంగిఁ
దఱిసి। కొడుకు నేచందమున నెత్తుకొనియు వచ్చె॥ సీ॥ తుమ్మెదగమి గెల్చు ధమ్మిల్ల
బంధంబు చెదరి కుంతలములు చిక్కువడియె। శశిబింబకాంతికి సడన మైకను పట్టు
వదనపద్మము వసివాళ్లువాడె। క్రొక్కారు మెఱుఁగుఁగై కొను నీతనూవల్లి బిడాళ
పంబు చేసొబగుదూలె। కెందమ్మి పూవుల గెలువంగ నూహించు మృదుపాదతల
ములు మిగులఁ బొక్కె॥ తే॥ వచ్చి పగడంపుఁ గెంజాయ పగటుమోవి। పగిలి బీఁట
లువాఱు విభ్రమముగ ఱేఁగె। తరళనేత్రకు నానిమిత్తమున నకట। యవిరళంబైన
యాయాసమావహిల్లె॥ వ॥ అని చింతాక్రాంతుండై కాంతారత్నంబు నూఱడిం
చుచుఁ గరాంబుజంబు నవలంబంబుగా నొసంగి నిజభుజాపీఠంబున నంగుమారుని
నిడుకొని ధైర్యంబణుమాత్రంబును జెదరనీక చనుచుండె॥ అంత॥ తే॥ దీనగతిలేని
బడలికఁ దెచ్చుకొనుచు। కపటవర్తనుఁడైన నక్షత్రకుండు। కట్టుకట్టు మాప్పఁ బుచ్చు
చు మిట్టనిట్టు। నేలఁ గూర్చుండఁబడి మహీపాలుఁ జూచి॥ చ॥ అలసితి నింక నొక్క
యడుగైనను నేనడువంగ నోపమైఁ। గలయఁగ ఘర్మబిందువులు గ్రమ్మెఁ బదంబు
లఁ బొక్కులెక్కె శ్రీ। తలసవిధక్ష్మారుహావితానము నీడకునన్ను జేర్పు భూ। త
లపతి ముఖ్య దేహమున దాహభరంబు జనించె నెంతయున్॥ తే॥ నీకు మత్ప్రాణ
రక్షావివేకమాత్మ సంభవించిన యేని విశ్వంభరేశ। మేటిజవమున నరిగి మెచ్చో
టనైన। విమలజలములు దప్పికి వెదకి తెమ్ము॥ సీ॥ అనిన మహీకాంతుఁ డత్యంతదు
ర్వార చింతాపరంపరాక్రాంతుఁడగుచు। జనపదంబైన గోష్ఠంబైన నొక్కటి వెద
కి చేరక యుండ విఘ్నమయ్యె। మునికుమారకుఁ డింక మూరెఁడు మేరయు నడవలే
ననుచు నట్టడవిలోనఁ। గదలకయున్నాఁడు గడు ప్రమాదము ప్రాప్తిపథ పరిశ్రాం
తి వెంబ్బఁగినఁ బెంగుఁ॥ తే॥ బైతెరువు కానఁగాఁగ నీబ్రహ్మ వారి। సేలతోడనే పంపె
మునీంద్రుఁడకట। యేమి ప్రాప్తించునో యింక నీశ్వరాజ్ఞ। గడప వచ్చునె యెంత
టి ఘనునకైన॥ క॥ అని తల్లడిలుచుండఁగ। నినకుల వల్లభుని జూచి యిట్లను హృద
యం। బునఁ దాల్మికలిమివాడముఁగ। వినయోక్తులఁ జంద్రమతి వివేకస్ఫురణన్॥
మ॥ నిరవద్యసిర సూనృతోక్తి రచనాసర్మిద్రధాత్రీతలే। శ్వర నక్షత్రకుఁ డెంత
యుంబడలె దీనంబైన యెండం దసూ। స్ఫురణం జల్లపడంగ నికనడవం బ్రోద్దేమి
యున్ లేదు భూ। సరూరబింబం బపరాబ్ధికిం జనియెఁ గంజాయుర్వ్యసంబింపఁగన్॥
తే॥ మునికుమారుండు డస్సిన మోసమరయఁ। బెంపుదూలంగ సకనడపింపరాదు।

పుత్రకుని నైన విడిచిన తత్పుత్రకునిని। యెలమి రక్షింపవలయు నేడిచట నిలిచి॥ ఉ॥ శీతల
నిర్మలాంబుకణసేచనకృత్యము లాచరించి ధా। త్రీతలనాథయూఁకటికిఁ దియ్య
నిపండ్లును బెట్టి పల్లవ। వ్రాతవినిర్మితవ్యజనహాయువు లల్లనసోఁక ధీరతా। న్వి
తమతిన్ని వ్రజింపఁదగ వీతపరిశ్రమఁ జేయుడీతనిన్॥ చ॥ అనవుడు నట్లకాకయని
యన్మనుజేంద్రుఁడు నెమ్మనంబునన్। మునిసుతరత్నబ్రవణముఖ్యకృపావిభవం
బు మాటికిం। బెనఁగొన నీటికందువ యభీష్టమతి న్వెదకం దలంచి కా। ననతరువీ
థులం గలయ నాలుగుదిక్కులు చూచుచున్నెడన్॥ వ॥ వెను వెంటం దగిలి యదృ
శ్యాకారుండై చనుదెంచు విశ్వామిత్రుం డత్యంతకోపాటోపంబున నమ్మహీపతి
కినంత రాయంబు లాపాదించును పాయంబు నిస్వాంతంబున జింతించి దంతఘా
తకుండను నొక్క నిషాదుని దనమాయాపాటవంబున గల్పించి యానక్తంచ
కునకిట్లనియె॥ తే॥ తపసుఁడపరాబ్ధిఁ గుంకునంతకు త్రిశంకు। సుతుని మ్రానియలఁ
బెట్టి యుచ్చోట నిల్పి। దారుణంబైన యుగ్ర బేతాళవటము। క్రింద వసియింపఁ బను
పుమీ రేయియు తసి॥ ఉ॥ హాలహలానలప్రతిమఁ డవ్వటభూజమునందునున్న బే।
తాళుఁడు ఖర్వగర్వమున దైవతకోటుల నైనఁ బట్టియా। భీలగతి న్వధించు నని పే
ర్కొను మర్త్యుల నేమి చెప్ప శా। ర్దూలము జింకలం బొదివి త్రుంచు విధంబున ద్రుం
చున్నుగ్రతన్॥ వ॥ కావున నీప్రయోజనంబు సమకూర్చుమనుటయు మహాప్రసా
దంబని యాక్షణంబ॥ సీ॥ రమ్యభూతిత్రిపుండ్రములలాటంబున మహితరుద్రా
క్షదామంబుల బుత। విమలసారంగచర్మము కటీరంబునఁ బాటలఘనజటాపట
లి మౌళి। సురుచిరస్ఫటికాక్షసూత్రంబు కరమునఁ దరుణదర్భాంకురతతులు వ్రే
ళ్ల। కనకంపుఁ దామ్రకుండలములు వీనుల బొందుగాను దరబంధంబున దుమఁ॥ తే॥
జెలువు దీపింప భానుమండలముతోడ। దనతనూదీప్తివితతి మంతనములాడ। గప
టవృద్ధతపోధనాకారుఁడగుచు। మానవాధీశుఁడరుదెంచు మార్గమునను॥ వ॥
మనోహరతపోవేదికాగ్రంబున వ్యాఘ్రచర్మాసనాసీనుండును సమీపవిన్యస్త
దండకమండలుండును ముకుళీకృతనేత్రకమలుండును మిథ్యానియమజపధ్యా
నతత్పరుండును నైయుండుటయు మార్గవశంబున వచ్చి కనుంగొని యమ్మహీవ
రపుంగవుండు నతని నిక్కంపు మౌనిగ కాఁదలంచి వినయపూర్వకంబుగా నమ
స్కారంబొనర్చి కోరకితకరసరోరుహుండై యిట్లనియె॥ చ॥ విలయకృశానుతు
ల్యమగు వేడిమి నీనిబిడాతపంబుమి। క్కిలి తపియింప జేయ నతిఖేదమునొందె శరీ
ర మెల్లమీ। లలితకృపావలోకనముల న్ననుఁ గన్గొని నామనంబుశీ। తలముగ జేసి వ
త్సలత దద్దయు ప్రీతి ననుగ్రహింపరే॥ ఉ॥ ఓ ఋషివర్య దుష్టమృగయూథసమ
న్వితనిర్జనవన్యకాం। తారములందు దుర్గమపథంబుల ద్రిమ్మరి మత్పురాకృతో।



దారవిశేషపుణ్యయుక్తంబునఁ దావకపాదపద్మముల్। చేరఁగఁ గంటి నొక్కరుఁడ
ఁ జేరితి ధన్యుఁడనైతి నావుడున్॥ తే॥ నిద్దయును బ్రోద్దునకు నేత్రబిసరుహము
లు విచ్చి భూరిసంజ్ఞఁ జేసి భూవిభునీక్షుఁ జూచి మాయాపరిజ్ఞాన సురుచిరోక్తి
మహిపు నిట్లనుఁ బ్రత్యక్షమౌనికరణి॥ క॥ ఎంతయు బడలితి విపథ। శ్రాంతి మహీ
కాంత పెంపు సడలి భవద్వృత్తాంతం బంతయుఁ దెలిసితి। మంతర్వీక్షణకళామ
హాత్వమున వలనన్॥ సీ॥ సాంద్రకీర్తిప్రథఁ జక్రవర్తిత్వంబు గనిన హరిశ్చంద్రమనుజ
పతివి। నీవు ప్రదాతవై నిఖిలరాజ్యము నొక్క తాపసవరునకు ధారవోసి। యతనికి
మున్న మఖార్థమిచ్చెదనని పలికిన విత్తంబు పడయఁ గోరి। పురము వెల్వడి సతీపు
త్రయుక్తుండవై వారణాసీపురి కరుగుచుండ॥ తే॥ ధనమునకుఁ గాఁగ నీమీఁదఁ దప
సీయాజ్ఞ। బైతరువు వచ్చి మునితనూభవుఁడు నొచ్చి। ఘనపిపాసాతురుండైనఁ
గాంచి బెగడి। వచ్చితివి నీరు వెదక భూవరలలామ॥ వ॥ అనుటయు నత్యాశ్చర్యంబు
నుం బొంది హరిశ్చంద్రుఁ డతనికి బునఃపునఃప్రణామంబు లాచరించి మహాత్మా నీచర
ణారవిందంబులు సేవించి నక్షత్రకరక్షణార్థంబు భవదీయాశ్రమంబున నేడు వి
శ్రమించెద ననిమఱియు నిట్లనియె॥ ఉ॥ ఈవనవీథుల న్వెదకి యేను జలంబులఁ దెచ్చు
నంతకున్। జీవము నిల్పనోపఁడలసెన్ మునిపుత్త్రుఁడు దప్పిఁ జెంది తే। జోవిజితా
ర్కు వాకపయశో దురితంబులు రాకయుండ మీ। పావనకుండికాజలము పారకృ
పారతిఁ బోయఁగాఁ దగున్॥ చ॥ అనవుడు మందహాసమున నక్కపటాత్ముఁడు భూ
మిపాలుతో। ననిమేదినేంద్రవంశజరహస్యము నన్ను నివృత్తిపూనికా। ననములను
న్నమా నెలవున న్వసియింపఁగ రాదు మీకు నే। మ్మునము మాకపాయమగు మౌని
కులం గనుఁగొన్నఁ డాసినన్॥ మ॥ సలిలంబల్ప ముపత్త్రమండలువులో సర్వంసహా
ధీశత జ్జలపానంబున మౌనినందనున కేచందంబునఁ దీఱెడిన్। దలపై పవ్వినదప్పి
యుప్పులుకు దాఁదరిఁ గాంచి నంబుద్ధియే। తెలియం జెప్పెద నీటికందువ మనోదేశం
బు మోదింపఁగన్॥ సీ॥ విను మిచ్చటికిఁ గూఁత వేటుదూరంబునఁ గలదొక్క హ్రాద
ము నిర్మలజలంబు। తత్తీరభూమి విస్తారశాఖలచేత విలసిల్లు నొకవటోర్వీరుహం
బు। పుత్రకళత్రనక్షత్రకసహితుఁడై యల్లనల్లన నచటి కరిగి। మార్గపరిశ్రాంతి
మానునట్లు గఁబయఃపానంబొనర్చి యా పాదపంబు॥ తే॥ క్రిందవసియింపు మీ
రాత్రి నృపవరేణ్య। యచటు దక్క గనీకు నన్యప్రదేశ। మిరవుగాదని చెప్పి యదృ
శ్యుఁడయ్యెఁ। గపటసంయమి నైన నక్తంచరుండు॥ క॥ ఆయెడ నానాపక్షుని। కా
యములు కశోరయుతముగా మేఁతలకుం। బోయిన వి మరలి వచ్చి కు। లాయంబును
జేరెం గలకలధ్వను లెసఁగన్॥ క॥ మనుజపతి పొందు దుఃఖము। గనుఁగొనఁగా లేక
చసినకైపడిం బనియెం। దనకిరణనికర మెయ్యు। య్యనమణిపుచఁ దపనబింబమప

రాంబుధికిన్॥ సీ॥ కందరపటలసంకాశంబులగునంధకారముల్తొరంగగ్రమ్మె దిశలు వ్యోమసీమం జెల్లఁబామరమై తారకస్తోమములుఁదిండిలోడ్తోనపొదలె విరహాగ్నిశిఖలచేఁ వేఁగిరథాంగపరంపరలెల్ల గుల దుఃఖింపఁబోడఁగ భీకరానేకపక్షికరంధ్రింబులు వెడలి చరించె దరీవ్రకరములు॥ తే॥ ఝిల్లురిఝల్లీవిరావముల్ప్రకటిల్లె ఘిగులదలుమగఘూకముల్మ్రోలఁగియాడె నిబిడముగ శాకినీఢాకినీపిశాచ భూతబేతాళసంచారములు సెలంగె॥ వ॥ ఇట్టి భయంకరనిశాసమయంబున నమ్మహీరమణుండు కర్కశపటతపోధనుండు చెప్పిన వటవిటపిచకర్కటికింజనసముకట్టి ఘట్టిందనభుజంబునం బెట్టుకొని నక్షత్రకునివీఁపునఁగదియించి చంద్రమతిం జెట్టఁబట్టుకొని నిజభుజాదండమహాగ్రమండలాగ్రపరిఘాపటలవిరళీకృతదుర్గమమార్గాంధకారుండై చనిచని॥ తే॥ మత్స్యకచ్ఛపభీకరమకరనికర సంకులంబును వన్యేభసలిలపాన గళగళధ్వానపూర్ణదిక్పథము నైన హ్రదముఁగన్గొనెఁదనయకట్టెదురనృపతి॥ మా॥ ని॥ తోరమ్మై వికసించిన కైరవతోయరుహంబులు షట్పదఝంకారములుం బహుళంబుగఁ బర్వఁ గ్రౌంచరథాంగబకవ్రజసంచారములున్వటసాలరసాలకుచందనభూజవితానలసత్తీరముఖంబగు సోపు దలిర్పనుతింపదగున్ హ్రదముజ్జ్వలమై॥ వ॥ ఇవ్విధంబుననున్న హ్రదంబుం గనుంగొని॥ సీ॥ తత్తీరభూమిఁ బదంబునిల్పి వారికి సలిలపానక్రియాసౌఖ్యమొసఁగి తాను బ్రత్యాశ్రితశరీరుఁడగుచు సాయంకాలవిధులు సయ్యనఁ దీర్చి మధురంబులైన నిర్మలజలంబులు గ్రోలి యధ్వపరిశ్రాంతి నపనయించి ధైర్యవివేకగాంభీర్యముల్ హృదయారవిందంబులో పలసందడింప॥ తే॥ మానినందనునకుఁ జంద్రమతికి లోహితాస్యునకు నిద్రపోవనర్హస్థలంబు వెదకఁదగు ననియొయ్యనవదన మెత్తి కోరిన బుద్ధి కుఱ్ఱలనుగనుంగొనెడితఱిని॥ ఉ॥ ఓలిసనేకఘూకనివహోగ్రరవంబులుఁ గోటరాంతరా భీలభుజంగపూత్కృతులుఁ జెల్లగనొక్కకటంబికర్కటిల్లఘూ తాళికినాలయంబయి పురాతికినైనభయంబుఁ జేయు బేతాళవటంబుఁ గాంచె వసుధాతలనాథుఁడు వీతభీతుఁడై॥ క॥ బహువిధశాఖాపటలీ విహితాఖిలదిక్తటంబు బేతాళవటం బహిమకరకిరణసముదయ విహారదుర్గమజటంబు వీక్షించె దగన్॥ వ॥ ఇట్టి దారుణబహుపాన్మహీరుహంబు నిరీక్షించి యవ్వసుంధరాధ్యక్షుండు॥ తే॥ కడఁగి సాహసమొదవ శంకావిహీన మానసుండయి చేరి యామ్రాని క్రింద లేఁతకసవున శయ్యఁ గల్పించుటయును సారిదినక్షత్రకుండు దుసుప్తుఁడయ్యె॥ చ॥ ధరణితలేశు దేవియును దత్పదపద్మసమీపభూస్థలిం బోరిఁబోరి గ్రమ్ము దుఃఖమునఁ బుత్రుఁడు దానును నంశుకాంచలాస్తరణమునందుహస్తముపధానముగానొనరించి వెండిదు స్తరమగు నాఁకటంబడలి దైవము దూఱుచుసుప్తిఁ బొంది



నన్॥ మ॥ అపుడా చందనగంధిగంధకరిణీయానం గురంగాక్షి వంశపవిత్రన్నవపల్లవాధరపుటస్సంపూర్ణచంద్రాననం జపలావల్ల్యుపమానదేహలలితన్ జాయన్విలోకించియా నృపవంశాభరణంబు మానసములో నెంతేవిచారంబునన్॥ తే॥ అధికమైన పథశ్రాంతినాదమఱచి సుప్తినొందెడు వీరికిఁ జోటు దుష్టమృగపిశాచభయంబంకురింపకుండఁ గావఁదగు నాదు జాగరూకత్వమనను॥ చ॥ అనిశలపోసి భాస్కరకులాగ్రణి యుగ్రకృపాణపాణియై యనిమిషవంద్యుఁ జంద్రధరు నార్తజనావనదక్షు శంకరున్ మనమున నిల్పి నీవ గతియంచు నిపట్టుచు నాల్గుదిక్కులం గనుఁగొనుచుండె నెచ్చరికఁ గల్గి తలంకక వీతనిద్రుఁడై॥ ఆ॥ అత్తఱి నర్ధరాత్రమగుటయు నవ్వటోర్వీరుహంబునందు విడువకుండ భయదవికృతభూతచయములాడల వెంట నవనిభాగమునకు నవతరించి॥ వ॥ ఇంతకాలంబునకు నిచ్చోట మనుష్యసంచారంబు కలిగెనని పరస్పరాహ్వానసంభ్రమంబులు భయంకరహుంకృతిధ్వానంబులు ననూనంబులై దిశలఁ జెలంగ నమ్మానవేంద్రుఁ జెంగటికిఁ బోదివిన॥ తే॥ శంకయొక్కింతయును లేక పంకజాప్త కులవరేణ్యుండు తద్భూతకోటినెల్ల డగ్గఱకయుండఁ దమిగాఢప్రతాప వైభవంబున నెంతయు వాఁడిమెఱసి॥ క॥ ఈ యధమపిశాచంబులఁ బాయక వధియించు టేమి ప్రాభవమని తా రోయుచు భుజగేంద్రమహోగ్రాయత కౌక్షేయకమున నభ్యాగతములన్॥ వ॥ తూర్ణంబ కర్ణనాసికాచ్ఛేదంబు గావించుటయు నత్యంతఖేదంబునుం బొంది నిజాధీశ్వరుండగు బేతాళునకు నన్నియుఁ దెలియ విన్నవించుటయు నతండును భీషణరోషావేశంబున॥ శా॥ ఎట్టెట్టీ మిముఁ నొక్క మానవుఁడు దానెంతేని హంకారియై బిట్టల్లందెగి యింత సేసెనె కదన్ బీభత్సరూపంబుగాఁ గట్టా యేగతినింక వాఁడు నిలువంగా నేర్చునా ముందటన్ జట్టల్పీ తెరఁ బొట్ట వ్రచ్చెద భుజాశౌర్యంబవార్యంబుగన్॥ ఉ॥ వెఱ్ఱితనంబుగాక యరవిందజుకైనను జేరరాని నా మఱ్ఱికి లంకునన్మనుజమాత్రుఁడకున్నిలువంగవచ్చునే యిక్కెనుండ శక్యముగునే వివరింపనీవంగి చెంగటన్ జుఱ్ఱెదఁ దత్తనూపలలశోణితధారలు పొట్టనిండఁగన్॥ శా॥ ఇందాశాలికినైనవిచ్ఛలవిడిన్ పేఁలంజోరన్ రాదు నిస్సందేహంబుగ నావటంబు నరుఁడే జాడం బ్రవేశించెనో యెందున్నిక్కిలియద్భుతంబు మదినూహింపంగ వంటెంటెలోఁ గుండెల్పొచ్చిన చందమయ్యె నిది పెక్కుల్మాటలింకేటికిన్॥ వ॥ అని భయంకరాటోపంబున నం బేర్చి పెల్లార్చుచు భూతప్రేతపిశాచశాకినీఢాకినీసంఘాతంబులు గణనాతీతంబులై సేవింపం బెంపుమిగిలి॥ సీ॥ పరుసనిజుంజులు పల్లివెండ్రుకలజొంపము మారుతమునఁ గంపంబునొందఁ నిలయమేఘాకృతిఁ దలపింపఁగా జేయునొడలిపైఁ జీఁకటి ముడివడంగఁ జంద్రనిష్ఫలకంబు వెండ్రుకంబులై

దళుకులొత్తు॥ క॥ నానాతటినీతతులును। గాననములు బర్వతములు గ్రామములు
మహాస్థానీయంబులు గడచియు। హీనగతిం జనుచునుండ నింతట విలోకనక॥ వ॥ విశ్వా
మిత్రుండు వైశ్వానరుం బ్రియంబున నాకర్షించి యతనితో నిట్లనియె॥ మ॥ వసుధా
ధ్రంబులనైన నీదు భయదజ్వాలావళిం జేర్చియే। ర్చు సమర్థత్వము గల్గు నీకితరు
లాజోద్యంబా కోమర్త్యులం। బసదూలించుట నీప్రభావము నుతింపక శక్యమే యే
రికిం। బ్రసవాస్త్రింబారిగొంటి విపవపురజిత్ఫాలాగ్ని నేత్రాకృతిక॥ క॥ తవిలి హ
రిశ్చంద్రమహీ। ధవుఁ డరిగెడు మార్గభూమిఁ దావక కీలా। నివహంబులచే నెం
తేయు। నవరోధము నర్పవలయు ననత్యాగ్రిముగక॥ వ॥ అనుటయు నట్లకాక యని
యొక్కరువలి చుట్టంబు మహీవల్లభుం డరుగు తెరువునం బ్రబలి యత్యంత దుర్గ
మంబుగా నిరర్గళమారుతప్రచలిత మహీరుహాన్యోన్యసంఘర్షణంబులవలనఁ
బ్రచండగతిం బ్రభవించి యొండొరాలిన కారాకుఁ బ్రోవుతండంబులం దవిలి రవ్వలు
కొని భుగభుగాయమానంబులై పెల్లగయుచు నిబిడాంధకారిత వ్యోమంబులగు
ధూమంబులును చిటచిటాయమానంబులై యభంగురంబులగు విస్ఫులింగంబు
లును ధగధగాయమానంబులై మింటనంటు నెఱమంటలును బెరిగి యొక్క మొ
గిం బిక్కటిల్లి చనుదెంచు నద్దవానలంబు వీక్షించి మానవాధీశ్వరుండు మనంబున
దురపిల్లుచుఁ జింతాక్రాంతుండై నిజకాంతామణిం గనుంగొని॥ క॥ భీకరమై మె
టుచూచిన। నో కాంత తరింపరాని హుతభుక్కీలా। నీకము కడుం బ్రబలెను నా। ళీ
కాసనుఁ బ్రాంతగడవలేరెవ్వారుక॥ తే॥ తరళలోచన కాశికాపురముఁ జేరి। ఋషి
శిఖామణి కౌశికు ఋణము దీర్చి। నిత్యసత్యవచఃకీర్తి నెగడకుండ। నిచటనంకిలి యొ
వ్యోనిం కేమియనఁగ॥ సీ॥ హరిణలోచన మనకగున పాయము నకుఁ జింతింపనాత్మ
నాకెంతమైనఁ। దాపసాత్మజునకుఁ బ్రాపించుచున్న ప్రమాదంబునకుఁ జాల
ఖేదమొదవుఁ। గావున నొండు మార్గంబులన్నియు మాని చయ్యన నేఁ బ్రవేశం
బొనర్ప। హవ్యవాహనుఁ డుమత్ప్రాణాహుతుల సంతసిల్లి మీ యెడదయసేయు
నిదప॥ తే॥ ననుచు హృత్పంకజంబున నఖిలభక్త। గణవశంకరుఁడైన శంకరుని నిలి
పి। యతిభయంకరమైన కారగ్గికెదురు। చని యెడఁగు వహరిశ్చంద్రజనవరుండు॥
వ॥ ఇవ్విధంబునం జనుజీవితేశ్వరుం గనుంగొని శోకవ్యాకులితమతియయ్యును సం
దధైర్యవతియై చంద్రమతి యిట్లనియె॥ తే॥ ప్రాణనాయక ధైర్యంబు పాయఁ బెట్టి।
యివ్విధంబున నానతియియ్యఁదగునె। నిమిషమైన నను నినుఁ బాసి నిల్వఁజాల। నేన
చాడ్చెద నీవహ్నిలోన మున్ను॥ ఉ॥ ఇందుకు నేమియుం బలుకకేచన వీఁదగు నాకు
నావుడుం। గుందిదినేంద్రవంశజుఁ డుకోమలికిట్లను నో మృగాక్షి యో। చందనగరి
ధియోగుటి విశారదసికెటువంటి తెంపుసే। యుండదగు నేఁడు దీయవ్వాదయాంబుగలం



ర్గుం గురంగలోచనా॥ వ॥ అనియశ్రుధారాపూరితనేత్రుండై యున్నయమ్మహీశ
శత్రునకుం జంద్రమతి వందనంబొనర్చి కరారవిందంబులు మొగిడ్చి॥ సీ॥ ఇనవంశ
వర్యనామనవిచేకొనఁదగు నింక నేమియు నానతియ్యవలవ। దశమిమయే తెంచుద
వానలంబీక్షించి యిపుడు యంబుఁ దలఁకెదు మునికుమారు। ప్రాణంబు గాచు నుపా
యంబు చింతింపుఁ డంతరంగంబున నతిరయంబ। యాతండు బ్రదికిన నుపకీర్తిసా
కుండ నుండంగఁ గల్గు భూమండలేశ॥ తే॥ తడయఁ జనదింక నదె వచ్చె దారుణా
గ్ని। నన్నుఁ బనువు డుధృతి నిల్పి మున్న యనుచు। మాటికిని వేఁడుకొనఁగ నమ్మనుజ
భర్తృఁడు। దీర్ఘనిశ్వాసపవనంబు దీటుకొనఁగ॥ వ॥ శిరంబు వంచుకొని కరంబు వి
చారంబున నేమియుం బలుకనేరక యూరకుండుటయు నదియంగీకారంబుగా
గైకొని యక్కురంగనయన హరిశ్చంద్రునకుఁ బ్రదక్షిణపూర్వకంబుగాఁ బునః
పునఃప్రణామంబొనర్చి యాలస్యంబుదక్కి యాభీలదావానలజ్వాలాజాలంబు
లకుఁ దూలక యభిముఖురాలై చనుచుండ దనవెంటం గూడి తోలంగక తోడునీడ
యుఁబోలె నేతెంచుచు నేనునుం జనుదెంచెదఁ గొనిపొమ్మని పోరుపెట్టుచుఁ గరం
బులం గొంగు బట్టి తివియు ననుంగు బట్టినిలో హితాస్యుసింగనుంగొని మోహాతిరే
కంబున ననేకవిధంబుల లాలనంబొనర్చుచు సమగ్రవిచారంబున గుమారయుమా
రమణు కారుణ్యంబున దావపావకంబు శమియింపం జేసి తూర్ణంబ చనుదెంచె
దపూర్ణచంద్రప్రసన్నవదన నాయన్నమీయున్నయున్న యెడన నావచ్చునం
తకుఁ గదలకయుచ్చోటనయుండుమీ యని కుస్తరించి తదేకనిష్ఠాపరత్వంబున॥
తే॥ నియమమొప్పంగఁ బుట్టంబు నెఱికఁ గట్టి। ప్రాణవల్లభు నిజమనఃపద్మపీఠిను
నిల్పి ధైర్యంబు దళుకొత్త నుత్పలాక్షి। కృష్ణవర్త్మకు భక్తిమైఁ గేలు మొగిచి॥ సీ॥ ప
రమపావన తేజ పావక సదయాత్మ హరిణాంకమౌళి పర్యాయకాయ। యస్మ
పాతివ్రత్యము నమనోవాక్కాయకర్మవిస్ఫూర్తి చేధర్మనిరతఁ బూనిచరించి
తినేని మత్ప్రాణేశ్వరుండు సూనృతవచోరూఢి మెఱసి। భూనుతకీర్తి విభూతి
శోభితుఁడేని శీతలాకృతిమాని శిష్యునకును॥ తే॥ విశదవాత్సల్యమున మున్ను కుశల
మొసఁగి। పిదపఁ గౌశికు ఋణము సంప్రీతిఁ దీర్పఁ। గూడునట్లుగఁ జెనిమిటికో డుడు
గవుణ। నరసి రక్షింపవయ్యజోహారు నీకు॥ క॥ అని పలికి యరుణసరసిజ। వనమునఁ
బ్రవేశించు నంచవడపున ధైర్యం। బును భూరివివేకంబును। మనమునఁ దొనఁగొ
నఁగఁ జంద్రమతి శిఖిఁ దఱిసెక॥ వ॥ ఇట్లు తఱిసి తదీయమధ్యంబున బుష్పితాశో
కవనాంతరంబునఁ గీరకిశోరంబునుంబోలెఁ జరమసంధ్యారాగంబులోపలఁ దోఁచు
ణతుషారమయూఖరేఖయుంబోలె నిలిచి యెలమిం జెలంగి యుండుటయు నా
తన్వంగి పాతివ్రత్యశీలతపోవిశేషంబులకుఁ బరమాశ్చర్యంబునొంది [illegible]

దరాదిబృందారకసందోహంబులమందానందకందళితహృదయారవిందంబు లంగ్రొందుకొనియుండందతోరంగారుకరుణారసంబులఁ దొప్పదోఁగియుందిందిరంబులకువిందులౌసర్వంజాలుమకరందబిందుబృందంబులుచింద నితాంతలతాంతవర్షంబులుగురియించిరయ్యవసరంబున॥ తే॥ భీకరజ్వాలలొయ్యనఁ బెంపుడుగఁగ। డిరేదినిప్పులగములవేఁడిమిశమింప। ధూమమంతయునుడుగవోవఁదోఁచుపడిన। గాలియుడుగంగవనవహ్నిజాలమడఁగె॥ తే॥ ఈవిధంబునదావాగ్ని యెల్లనణఁగి। పోవ్రుటయుజాలనద్భుతమావహిల్ల। నేలమిఁజెక్కుచెమర్చకాయిగుఱుఁబోఁడి। నందపాసవికాసంబుకందళింప॥ క॥ తొల్లింటియట్లనచ్చిన। మల్లసితప్రీతిసుతునిముద్దాడుచుభూ। వల్లభునకుభక్తిం బ్రణ। విల్లినసాంద్రప్రచుపలెక్కమెఱుఁగుంబోఁడిక్॥ ఉ॥ ఓవనితాశిరోమణిసరోరుహలోచననీసుశీలతా। శ్రీవినుతప్రభావమునఁజేసిమహాద్భుతమావహిల్లఁగా। నీవనపావకంబణఁగె నెల్లశుభంబులుగల్గునింకనీ। పావనవర్తనంబుకతఁ బ్రస్తుతికెక్కధరాతలంబునక్॥ తే॥ రాజముఖి నాకునపకీర్తిరాకయుండ। నీవ ప్రోచితిపీసంయమీంద్రతనయుఁ। గానవారసిజూడనీకారణమున। మానిధనమిచ్చిసత్యంబుబూనఁగల్గు॥ వ॥ అనిసముచితసంభాషణవిశేషంబులనవ్విశ్వంభరావల్లభుండు దనప్రాణేశ్వరిం బ్రశంసించి యాదరించె ఆసమయంబునఁ ద్రిభువనైకదేశికుండుతదీయప్రకారంబువిలోకించి విస్మయంబంది కల్పాంతవహ్నియుంబోనియనల్పంబైన యద్దావపావకంబునం బ్రేలి తూలక యప్పల్లవాధరివల్లభుండునుం దానునొండొల్లిటియట్లమహానందంబునంబొంది నందనోపలాలనంబు సేయుచుఁదేజోవిశేషంబశేషంబైయుండదీపించుచున్నయదియునిపెండియు॥ తే॥ లోలలోచనమిసిమింతురాలు గాక। వహ్నికీలలలోనిట్లువన్నెచెడక। యున్నచిదిరాలచిత్రమో హాతలంప। వినియుఁగనియునెఱుంగమివ్విధము నెచట॥ క॥ మామకనిశ్చలభూరిత। హోమహిమలమించిమిగులఁబొలుపొందెనె యీ। భామినిపాతివ్రత్య। శ్రీమహితగభీరగుణవిశేషములరయక్॥ క॥ విపదంధకారపటలీతపనమయూఖములు పతిహితక్రియలెప్పుడుం। జలపక్షికవియచాలవె। యపరిమితాభీష్టఫలచయంబులనోసఁగక్॥ క॥ కావునఁబాతివ్రత్యక। లావిభవముచేతనీవిలాసినిస్ఫృతిమై। దావానలకీలావళి। నేవంతయుఁబొందకలరనెలమిధాలంకక్॥ ఉ॥ ఇంకనుపాయమేదిగలదీకమలాప్తకులావతంసముక్। బొంకఁగఁజేయహేమగిరిఁబోలెడుధీరతయంకురింపనే। యంకిలిఁబొందకెట్టిభయదాపదలైననునిస్తరింపుచుక్। శంకవహింపకుండెడినిజంద్రమతీసతికారణంబునక్॥ వ॥ అనియిట్లు రాదోళితమానసుండై యమ్మునిపుంగవుండు పెండియుఁ గసంగియు



తరంగంబునఁ జలంబుదలఁబుగానెక్కొంచినిజాకారంబు దక్కినవారల కెరిగి గోచరంబుగాకయుండ నక్షత్రకుంగదిసీయాలింగనాది సంభావనంబులఁ బ్రీతునిఁగావించివాత్సల్యంబునసిట్లనియె॥ తే॥ వాసికెక్కిననాశిష్యవరులలోన। మిగులమాన్యునిఁగానిన్ను మెలఁపివాఁడ। నాకుఁబ్రత్యుపకారమొనర్చువేళ। యిదియచూనీకుఁబరికింపనిద్ధచరిత॥ ఉ॥ నీకపటక్రియామహిమనేర్పుదలిర్పగజోకఁజేసియు। స్తోకవివేకభూరమణుతోడుతఁగూడిచరింపకుండనీ। కోకరుచాశిరోమణి నకుంఠితబుద్ధివిశేషధీరతా। శ్రీకమనీయభర్తృహితశీలనుతం బెడవాపుచయ్యనక్॥ వ॥ అనిబోధించిగాధినందనుండుతిరోధానంబునొందెతదనంతరంబ॥ తే॥ చంద్రమతిఁజూచిపలికెనక్షత్రకుండు। తెలవభవదీయవిమలపతివ్రతాప్ర। భావమభినుతిసేయంగఁబద్మజునకు। నహికులాధీశ్వరునకైనలవిగాదు॥ క॥ తామరసభవునిసతియుఁబు। లోమజయునరుంధతియునులోపాముద్రా। భూమయునసూయయుఁగా। కీమహిలోనీకునెవ్వరీడుపురంధ్రుల్॥ ఉ॥ ఎట్టితపంబొనర్చెనొమహింబరమేశుఁడు మెచ్చునట్లుగా। నెట్టివిశేషదానములహీనతఁజేసెనొ యెట్టితీర్థములు। మెట్టెనొ పుణ్యశీలమునమించిజగన్నుతిఁగాంచినట్టినిన్పట్టపుదేవిఁగాఁబడసె ధానుకులోత్తముఁడంబుజాననా॥ క॥ భీకరదావాగ్నిశిఖా। నీకముపాల్పడకయుండనిరుపమకరుణం। జేకొనినన్నుఁబ్రోచితికాఁ। తా కల్గెన్నికుఁబ్రాణదానఫలంబుక్॥ క॥ ఇంమకుఁబ్రత్యుపకారము। పొందుగనిఁకనీకునొకటిపూనియొనర్తుం। జందనగంధివినందగు। మందేతరబుద్ధిఁజెంది మద్వచనంబుల్॥ సీ॥ కౌశికమానిపుంగవు వేఁడియతనిచేఁ గ్రమ్మఱ సామ్రాజ్యగరిమవడసి। శీఘ్రంబమూర్ధాభిషిక్తునిగావింతు నీపుత్రుసుజనవర్ణితచరిత్రు। గాకొనిమరలిసంతోషంబుతోనయోధ్యాపట్టణమునకునరుగుదెమ్ము। విశ్వసింపుమదీయవిహితోపదేశంబుమృషగాఁదలంపకుమీనవయాన॥ తే॥ నానదుప్పుబుద్ధివినకయున్నావవేంద్రుఁ। గూడివేనువెంటఁదిరుగఁగఁగోరెదీని। జలజనేత్రబహుప్రయాసములనొంది। తిరుగుచుండంగవలయుదిగ్దేశములను॥ చ॥ కలఁగకదావపావకశిఖానివహంబులణంచినట్లయో। నెలఁతయణంపశక్యమగునేషదనాహితఘాలలోచనా। నలమునకంబెనుగ్రతఘనంబయి హాటకగర్భకైటభా। రులదలఁకించుకౌశికునిరోషహుతాశనవిస్ఫులింగముల్॥ తే॥ అదియునుంగాకయోకురంగాయతాక్షి। నేఁడుమొదలుగనింకనెన్నికనువాసర ములుపదిచిక్కసంయమిప్రవరుతోడ। నవనిభర్తగుతించినయట్టిమితియు॥ చ॥ మునిబుణమేగతిక్ మొదలుముట్టఁగఁదీర్చెదరొక్కచిన్నమాక్। జనపతిచేతనేత్రజలజాతదళాయనేత్రయెవ్విధం। బునను…

తమైనసీ । పెనిమిటియిట్టిశీలమునఁబృథ్విఁజరింపఁగఁబోలదేరికిన్॥ చ॥ అలుక జనింపఁగౌశికమహాముని యేమఱిపాటుభీమభం । గుఱఁజనుదెంచి మాధనము గొబ్బనఁదెమ్మనియానఁబెట్టినం। గలఁగుచు నేయుపాయమును గానక నిన్ను మునీతనూజుఁగొం । దలమున విక్రయించు వసుధాధవుఁడెవ్వరికైనఁజెచ్చెరన్॥ తే॥ ఇంతవట్టుననిశ్చయంబిగురుఁబోఁడి! నాకుఁజూడంగనదిగాన నాథుపల్కు| నమ్మియేతెమ్ము గ్రమ్మఱనందనుండు । నీవుసాకేతపురికి రాజీవనయన॥ వ॥ అనిన యిందువదన మందస్మితసుందరవదనారవిందయై కర్ణపుటంబులం గరకమలంబులు చేర్చి హరస్మరణంబు సేయుచునమ్మునితనూజుంగనుంగొని యాస్తోకవివేకవిశేషభాషాకౌశలంబొదవ నిట్లనియె॥ క॥ సతికిహపరసౌఖ్యములకుఁ। బతియె నిదానంబు చూవె పరికింపంగా । బతినెడఁబాసిచరించెడు । సతికిన్ వ్యర్థగావెసకలసౌభాగ్యములున్॥ ఉ॥ కోరికలెల్లఁజాలనొడఁగూర్చుప్రియుం బెడఁబాసినట్టిపం। శేరుహపత్రలోచనకుఁ గీరము వైరముపూర మెంతయున్ । భారము మంచికప్పురపుఁబల్కులు ములుకులుపచ్చవెచ్చశృం । గారవనాంతరాళి శశికాంతపువేదులు సూదులారయన్॥ క॥ ఓమునిరాజతనూభవ। సోముని నెడఁబాసియున్నఁజూడందగునే। యామినియట్లతలంపఁగ। భామినియును బ్రాణనాథుఁబాసినవేళన్॥ శా॥ వాలుంగంటికి నింటియాతఁడు మనోవాంఛాప్రదానక్రియా। హేలాలోలుఁడు నీలవేణికిఁ బ్రియుండే ప్రొద్దునొప్పారుర । త్నాలంకారము కాంతకున్ మగఁడు నిత్యానందసంపాదియిం । కేలా వేయును జెప్ప నేడ్డడయుఁ బ్రాణేశుండతన్వంగికిన్॥ ఉ॥ కావున నిత్యసత్యగుణగణ్యుఁడు పుణ్యుఁ డితండు భర్తయున్। దైవము కామితార్థఫలదాతయు నాకుఁదలంచి చూడని । భావజమూర్తి వై భవునిఁబాసి చరింపఁగ నెట్లు నేర్తునే । నోవటువర్య యీయనుచితోక్తులుపల్కఁగనీకు ధర్మమే॥ క॥ గాధితనూజుని మాయాం । బోధిన్ మద్భర్తయెలమునిఁగడిగిరిక। న్యాధవు సేవాద్రోణిక। సాధనము గని స్తరించు సంశయ మేలా॥ తే॥ ఇంద్రసన్నిభుఁడగుహరిశ్చంద్రవిభుని । ధైర్యగాంభీర్యశౌర్య సుస్థైర్యవైభ।వంబు లెఱుఁగక విప్రలాపంబులురక । పలుకుచున్నాఁడవో వెఱ్ఱి బ్రహ్మచారి॥ సీ॥ అపరపద్మాసనుండగుకౌశికుండును నీవును నింద్రాది దేవతలును। మేలు మేలని చాలమెచ్చి నుతింపనిశ్చలుఁడు హరిశ్చంద్రచక్రవర్తి । యుత్తరక్షణశాలి వార్తకెక్కెనమేటి మార్తాండకులకర్త మగ్ధితారి । నిత్యసత్యస్ఫూర్తి నిర్మలతరకీర్తిఁబ్రబలిహిమాద్రిజాభర్తకరుణ॥ తే॥ వడసి క్రమ్మఱఁ బాలించు ప్రాభవమున । వక్రమేమియు లేక భూచక్రమెల్ల । ననిననిదియంతయును నిక్కమనుచు మోసు।మిగులనద్భుతమొదవంగ గగనవాణి॥ వ॥ అంతనమ్మహీకాంతుఁడమ్మద్దియఁ



గనుంగొని యుద్దినంబుమనకుని చ్చోట నాలస్యంబు సేయంబని కాదు పురోభాగంబున గవ్యూతిత్రమాత్రంబునఁ గాత్యాయనీకళత్రు నివాసంబును కమనీయ సంపద్విలాసంబును కలుషలతావితానశితాసియునగు కాశీనగరంబు ప్రకాశించుచున్నయది యప్పురంబు ప్రవేశించి కౌశికుఋణవిమోచనోపాయంబు చింతింపవలయునని కాంతాసమేతుండై కొంతదవ్వేఁగియుండట॥ సీ॥ జాహ్నవీనిర్మలజలపరిక్షాళితబహులోకభీకరపాతకంబు। విశ్వనాథకిరీటవిధుకళాకౌముదీసముదయాచ్ఛాదితసౌధవీథి। కేశవస్వామ్యురోదేశప్రఫుల్లాబ్జవనమాలికాగంధవాసితంబు। కాలభైరవభుజాకలితఢక్కా-ఢీలఢమఢమధ్వనిమహాడంబరంబు॥ తే॥ నిండ్లుమతిదుండివిఘ్నేశుఁడుండుభూమి। యన్నపూర్ణావిశాలాక్షులాటపట్టు। శ్రీకరంబైనవారణాసీపురంబు। కనియె వేడ్కహరిశ్చంద్రజనవిభుఁడు॥ వ॥ అనిన కౌంతేయాగ్రజుండటమీఁదివృత్తాంతంబెఱింగింపుమనుటయు॥

మ॥ హితచేతోజలజాతసప్తహయసాహిత్యక్రియాంభోజసం। తతనిర్వక్రపరాక్రమక్రముణమంథగ్రావసంక్షోభిత । ప్రతిపక్షధ్వజనీధవప్రబలగర్వప్రాభవాంభోనిధా । నతనూతిభ్రమచంద్రికావికచకాంతాలోచనేందీవరా॥ క॥ శాండిల్యగోత్రవర్ధన। పాండిత్యాభరణదానపటవనవమా। ఖాండవతనూభ్రవవిభవా। ఖండలదుర్వారవైరిగర్వాద్రిపతీ॥

మాలినీవృత్తము.

ద్యుమణివిమలతేజా తోయజాక్షీమనోజా।
శమితవిమతలోకా సాధురక్షవివేకా।
కమలభవకులీనా కల్పవృక్షోపమానా।
హిమగిరిసమధైర్యా యెల్లనామాత్యవర్యా॥

గద్యము ✽ ఇది శ్రీమదాపస్తంబసూత్రపవిత్ర కౌండిన్యమునిచక్రవర్తి
గోత్ర సకలసుకవిజనానీకమిత్ర దేచయామాత్యకుమార విన
యవివేక విద్యాలంకార శంకరకవినామధేయప్రణీ
తంబైన హరిశ్చంద్రోపాఖ్యానంబను మహా
ప్రబంధంబునందు దృతీయాశ్వాసమ్ము

సంపూర్ణము.



శ్రీరస్తు.

# హరిశ్చంద్రోపాఖ్యానము.

## చతుర్థాశ్వాసము.



శ్రీచారుసదనపదసేవాచరణానితాంతనియమహర్షితసీహా! నాకలోకన్యావల్లభ! బాచయమెల్లప్రధానబంధునిధానా॥ వ॥ ఆకర్ణింపుము అప్పాండవాగ్రజునకు మార్కండేయుండిట్లనియె, అట్లు హరిశ్చంద్రుండు కాశికాపురంబుఁ గనుంగొని తదీయపరిసరంబున॥ ఉ॥ రంగదనేకనిర్మలతరంగ ప్రఫుల్లసరోరుహాభ్రమద్భృంగదటద్వయీప్రబలదీపితపుష్పలతాకుటుంబుఁగఁబూ! తాంగజరద్రథాంగకలహంసముఖాంబుపతంగజాహ్నవి! గంగఁబ్రియాతిరేకమునఁ గన్గొనియెం బ్రమదాంతరంగుఁడై॥ ఉ॥ వారిధికామినీరాణిరతివల్లభవైరికిరీటభాగమణి! దారలతాంతమాలికజనంబులపాలిటివేల్పుటావుభా! శ్రీరమణీకుచాగ్రతటదీపితమౌక్తికహారవల్లిభా! గీరధిచెప్పనొప్పెసఁగుఁగిల్బిషభూజకుఠారధారవై॥ వ॥ ఇత్తెఱంగున నంబొల్పుచున్నయుత్తరంగిణింగనుంగొని నమస్కరించి॥ శా॥ తల్లీ మిన్నకనిన్నునాడినజనుల్ తారర్థిఁగైవల్యభా! స్వల్లక్ష్మిందగజట్టికొందురనినక్ వాంఛించి ప్రేమంబుసం! ధిల్లన్నిన్నొగనియాదువాకరుదేనిర్వాణసౌభాగ్యముల్! కల్లోలాపహృతాఘపంకత్రిజగత్కల్యాణిభాగీరథీ॥ తే॥ జాహ్నవీనీదుజలములు సదమలములు! లఘువులును శీతలములుఁదలంపఁ గ్రుంకు! లిడినవారికి నల్లనో మెడలుదలలు! జడలుగట్టులలాటంబులుడుకునరుదు॥ వ॥ అని ప్రశంసించుచుఁ గదిసి భక్తితాత్పర్యవినయసంభ్రమంబులు మనంబునం బెనంగొనుచుండ సుతసతీసమేతంబుగాఁ గృతస్నానుండై పరమధ్యానపూర్వకంబుగా మాధ్యాహ్నికక్రియాకలాపంబులు నిర్వర్తించి మహాయాత్రామాత్రంబు తదీయసైకతక్షేత్రంబున వసియించి గమనాయాసంబు దొలంగుటయు నచ్చోటు వాసి వచ్చుచుం గాశీపుటభేదనప్రభావంబభివర్ణనాపూర్వకంబుగా వినిపింపఁదలంచి యిట్లనియె॥ శా॥ ఏతత్పట్టణవైభవంబులమరిక్ హేలావతీధాతకుక్! వాతాశప్రభుతారకాహితులకుక్ వర్ణింపఁగా శక్యమే! చేతోజాతభయంకరుండు సుజనక్షేమంకరుండిచ్చటం! బ్రీతింగాపురముండు శంకరుఁడు మాబింబాధరాయుక్తుఁడై॥ క॥ పంచాస్యమధ్యయిచ్చటఁ! బంచత్వముఁబొందెనేని పరికింపంగా! పంచముపాతకుఁడగు! పంచజనుండైనఁ బంచబాణారియగుక్॥ సీ॥ ష్మోధరంబులు పాఁటుగదలంగనేవేళనోలినసప్తవాయువులువిసరు! ద్వాదశరూపముల్దాల్చి యుగ్రమయూఖుఁడేవేళఁబచరించు నెండఁజెఱుము! పుష్కరంబులుగాఁగఁ



బుష్కలావర్తాభ్రజాలమేవేళవర్షములుగురియు! భువనంబులెల్లనంభోమయంబులుగాఁగ విషరాసులేవేళవెల్లివిరియు॥ తే॥ జంతునివహంబులేవేళసమసిపోవు! నట్టిదుర్దాంతభయదకల్పాంతవేళఁ! బారయదాపదనణుమాత్రము నుగురంగ! నేత్రయికాశికాపురక్షేత్రమరయ॥ మ॥ ప్రసవక్షోమలి యీపురబాహ్యసీమఁ! గోరివసియించుచండాలకులజు నైనఁ! బోలఁజాలఁడు నిర్జరపాలకుండు గలవుధర్మార్థకామమోక్షంబులిచట॥ తే॥ వనజలోచనయుత్తరంబునను దక్షిణమునఁగొని యాడఁదగువరణయు నసియు! గ్రతుభుగీశ్వరదిశమణికర్ణికయును! బశ్చిమంబునదుండితీర్థముఁగాంచె॥ క॥ వారాణసి వారాణసి! వారాణసియనుచు భక్తివశుఁడైనరుడం! భోరుహమిత్రోదయవేళారంభంబునఁదలంపనణఁగునఘంబుల్॥ తే॥ వనరుహాననవందారుజనమనోర! థార్థదములైన బహుపుణ్యతీర్థములకు! రాజుశ్రీకాశికానగరంబు సకల! వేదశాస్త్రపురాణార్థవిశ్రుతంబు॥ క॥ కమలాయతాక్షియున్నగ! రముపంచక్రోశములును రాజీవభవాద్యమరసదాసేవ్యంబులు! శమితాఖిలభయదకలుషసముదాయంబుల్॥ ఉ॥ పాత్రమహామతీ ప్రతిభవాయకమర్త్యుఁడు కాశికాపురీ! యాత్రకుఁబూనిభక్తి నయిదారడుగుల్ గమనించినక్ మృగీ! నేత్రయాతండు గాంచుఁ దగనిర్జరవల్లభతృప్తిహేతుయా! గత్రయపుణ్యపూర్వకముగాఁగ విశేషయశోవిలాసముల్॥ శా॥ తాత్పర్యంబున జాహ్నవీజలములం దానంబు గావించితా! హృత్పద్మంబున భక్తినివ్వటిల విశ్వేశున్మహాదేవునిం! సత్పుంకేజనతామరుల్ గిరిసుతాప్రాణేశు బూజించుసం! విత్పారీణునకబ్బునెల్లపుడు తన్వీ ముక్తిసామ్రాజ్యముల్॥ వ॥ అని కాశికామాహాత్మ్యంబు వ్వారారోహకుం జెప్పుచుం జనిచని॥ సీ॥ కుముదమిత్రోపలగోపురంబులచేత విద్రుమప్రాకారవితతిచేత! మరకతహరినీలమండపంబులచేత బహుశాతకుంభకుంభములచేతఁ! జాలదీపించుముత్యాలముగ్గులచేతఁ గనుపట్టుపట్టుమేల్కట్లచేతఁ! గమనీయపద్మరాగచ్ఛత్రములచేత వృషరాజకేతనశ్రేణిచేత॥ తే॥ మహితకర్పూరధూపధూమములచేత! నవ్యమాణిక్యనీరాజనములచేత! శంఖభేరీమృదంగఘోషములచేత! వెలయువిశ్వనాథుదేవళము గాంచె॥ వ॥ కాంచియాసార్వభౌముండద్దేవతాసార్వభౌమునిం బ్రవిమలభక్తిపూర్వకంబుగా దర్శించి సాష్టాంగదండప్రణామంబు లనేకంబులొనర్చి ఘేదోయుఘొగిడ్చి వేదోక్తప్రకారంబున నిట్లని వినుతింపందొడంగె॥ సీ॥ క్షీరాబ్ధిసంభవక్ష్వేళానలోగ్రకీలావళీనిలకంఠాంజిరాయ! పవనాశనాధీశపర్యంకకంకపత్రాస్త్రమితత్రిపురాసురాయ! మౌళింధుచంద్రికాజాలస్ఫురద్దేవనిమ్నగాకైరవేందీవరాయ! పావనాచారసద్భక్తలోకానీకమానసాంభోజాత మధుకరా

యా॥ తే॥ వసుమతీధరకన్యకావతంసలస్తనాగ్రకాశ్మీరసురభిదోరంతరాయ। మందిరాయితకైలాసకంధరాయ । హస్తిచర్మాంబరాయ తుభ్యం నమోస్తు॥ క॥ నా మనమో భ్రమరము నీ । పాదాబ్జమరందబిందుపానక్రియలన్ । మోదంబందఁగఁ జేయుము । కోదండీకృతసువర్ణకుధర సుహితా॥ చ॥ అనుచుఁ బ్రియంబు మీఱఁగొని యాడి ప్రదక్షిణమాచరించి మ । జ్జనమును ధన్యతం బొరసెఁ జంద్రకళాధరు విశ్వనాథుఁ బ్రా । వనమణికర్ణికాపురనివాసునిఁ జూడఁగఁ గంటి మంటిఁ జ్ఞా। న్యావఁ బెడఁబాపఁగల్గెను భయంకరకిల్బిషసంచయంబులన్॥ వ॥ అని పలుకుచు నచ్చోటు వాసి॥ సీ॥ నీలవర్ణాంగుఁ ద్రిశూలహస్తునిఁ గాలభైరవుఁ జాలసద్భక్తిఁ గొలిచి। యన్నపూర్ణకు విశాలాక్షికాశ్రితదేవతాధేనువులకు వందన మొనర్చి । సిరిబేరంబునఁ జెలువొందఁ జేర్చిన కేశవస్వామికిఁ గేలు మొగిచి । ప్రత్యూహవార్వాహపటలికాగంధవాహుని దుండివిఘ్నేశు వినుతి చేసి॥ తే॥ ప్రమథలీలలలోలార్కుఁ బ్రస్తుతించి । దండపాణికి సాష్టాంగదండ మొసఁగి । రూఢి నాసవభాండేశ్వరు భజించి। యపగతాఘుంబు ముక్తిమండపముఁ గాంచి॥ వ॥ వెండియుం గల్గు విశేషదేవతాస్థానంబులు దర్శించి కృతార్థుండ నైతినని యొక్క రమ్యప్రదేశంబు జేరియున్నా సమయంబున నపాంగంబున నంగారకణంబులు రాల నృపాలశిరోమణిం గనుంగొని కపటక్రియాదక్షుండగు నక్షత్రకుం డిట్లనియె॥ చ॥ ధరణిప నేఁడు నెల్లియును దక్కువగా నెలవాళ్ళు నయ్యెనే । నరసితి లెక్కఁ బెట్టితిమి యూయము లేదొక యేసమైన నే । తెరవున నింక మా ఋణము వేగమె తీర్చెదొ కారమిన్నకే। సురిఁగెవనో వివేకగుణశూన్యతఁ బొందితి సత్యవాదివై॥ క॥ భూదయితవినవె ఋణాలు। న్వాదమృతం విష మటంచు నార్యజనంబుల్। మేదినినెల్లెడఁ జెప్పఁ బ్రమాదము మిత్తి గడచెనేని వానిం దుద్రిచేన్॥ తే॥ మనుజనాథవృథాప్రయోజనమునందుఁ। దెలియనేరక యూరక దినదినంబుఁ। బొద్దుఁ బుచ్చుచు మాయుష్యవుద్ధి యెల్ల। మాఱిచియు వ్వాండ్ల విధిభాగ్యమూ తలంప॥ చ॥ ఇఁక మొకమోట మాత్మనొకయించుక నిల్పక కూరి రవృత్తిఁ గౌ । శికముని మీఁద నానయిడి చెచ్చెర నంగడి నడ్డపెట్టి పా। యక బహుబాధలం బొదలు పట్టుగఁ జేయక మాధనంబు రా । దకట నృపాల యిట్లు తగవా ననునిష్ఠురఁ జేసె నేటికిన్॥ ఉ॥ ఎంతయు దోషము న్మోమని యెప్పుడు వచ్చునొ వచ్చినప్పుడేఁ । కొంతయు స్వాపతేయమిచె కొమ్మని యియ్యక యున్న రోషితు। స్వాంతుఁడగున్ మునీశ్వరుఁడు సంశయమించుకలైనఁ గల్గదా । కంతువిరోధి కిం దరము గాదనఁ జంగదదీయకోపమున్॥ క॥ వితజపహోమనియమముఁ । నైతెరిగి తిన్నుఁగూడి యర కాసయితం। జేతికి వచ్చిన యది లే। దీతుదకుం గిమకవాడ మత్తెన్నుం దుమదిన్॥ క॥ ఇదె యిచ్చెద నదె యిచ్చెదఁ। బదపదఁడని యాసఁ జూపిష



లు దెఱుఁగులనా। హృదయమున్నొప్పించిలివిఁక । గుదిత్రోసెద నేఁడు నిన్నుఁ గొంకక యిటఁ బటక్॥ తే॥ అదను పదను సెకూర్చి మాయప్పుఁదీర్చి। పొమ్ము నీవన్నఁ బోమె యీపోరు మాని । బడలి జీతము వెట్టని బంటనగుచు । వెంబడి నా కేలనీ వెను వెంటఁ దిరుగ॥ చ॥ నిముఁగినియంగఁ జాలక వసీధవ గాధితనూజు మానసం । బునకెడర్తై లఘుత్వముఁ నఁ బొందఁగ నేటికి నాకు నీవనె । మ్మనమున బుద్ధియొండి యొక మాగణముఁ జేసెద వంచు నుంటిమ । న్ననఁ దొలఁగించి నీదొరతనంబుఁ దుపం దడవా తలంపఁగన్॥ వ॥ అనియిత్తెఱంగున నక్షత్రకుండు పలుకు నిష్ఠురాలాపంబులు బాణంబులం బోలె మనోఘాతంబు సేయుటయు నారాజన్యచూడారత్నంబు వ్రీడాదైన్యంబులు ముఖారవిందంబున సందడింప నమందవ్యాకులత్వంబునం బొంది పుత్రుండును గళత్రంబును దక్కఁ దక్కిన విత్తంబు మాత్రంబునుం గల్గమికిఁ జింతాఘనస్వాంతుండై చంద్రమతిం గనుంగొని యేమియుం బలుకనేరక యూరక బెట్టునిట్టూర్పులు నిగుడ్చుచు నానతశిరస్కుండై యుండుటయు నవ్విధంబు నిరీక్షించి యాపురంధ్రీశిరోమణియుం గతాకారభావజ్ఞత్రావిశేషగురుధుర్యాగుసవినయవివేకగాంభీర్యభాషాచాతుర్యయునై జీవితేశ్వరుం గనుంగొని॥ ఉ॥ నిండిన వేడ్కలోకములు నిత్యము సన్నుతి సేయ ధారుణీ । మండలమెల్ల నేలిన సమగ్రయశోవిభవుండవీవు మా । ర్తాండకులేశ మాధుని విధంబున భ్రాంతివహించి చింత యె । సుండుట పాటిగాదు ధృతియుల్లమునం వెలసిల్లఁ జేయుమీ॥ ఉ॥ మిక్కిలి దీనతం బొరయ మీకిది యేటికి నేఁడు నెల్లియుం । దక్కువ చూచినన్ మిత్తది నంటు మహీరమణాగ్రగణ్యయీ । యక్కట కేయపాయమున నైనను విత్తముఁ గూర్చి కీర్తిఁ సొం। పెక్కఁగ మౌనివర్యుఋణమిప్పుడ తీర్చుట మంచిదారయన్॥ తే॥ మోసమగునప్పుదీర్పక మున్న యొక్క । గడియ తెడవైన మిత్తి సరిగడచెనేని । క్షితితలేశ్వర నిన్నుఁ బొంకింపఁ బూని । కంకణము గట్టుకొన్నాఁడు గాధిపట్టి॥ చ॥ పలుమఱు మిమ్ము నిష్పాటు వుపాయకయుగ్రతఁ బలుకనిష్ఠురో । క్తులకు నొకింతయైన మదిదుఃఖముఁ బొందకుఁడీతఁ డెన్నిభం । గులఁ గొడుమానసీయుఁ డుతగున్మనకీర్తనియాజ్ఞ సేయనో। జలజసఖాన్వయాభరణ సత్యవచోవిభవప్రశస్తికై॥ ఆ॥ పార్థివేశ యడిచిలు పాలుద్రావించిన । చందమీ మునీంద్ర నందనుండు। కిసిసి ఋణముదీర్పుమని మిమ్ము మాటికిఁ । బరుషభాషణములు పలుకు నెల్ల॥ శా॥ రూపంబుల్ తగుతోఁటలుం జెఱువులుం గుళ్ళన్ ధరన్నిల్పఁగా । నేపుణ్యంబొనగూడు మర్త్యులకు ధాత్రీశాన్వయాగ్రామణీ । యాపుణ్యంబురయంబ బ్రాప్తమగు నిత్యస్ఫూర్తిమై సత్యభా। షాపారీణులకున్ వివేకము మదిన్ సంధిల్లనూహించినన్॥ ఉ॥ కావున సత్యవాక్యగుణగౌరవసంపదలేశమాత్రమున్ । బోవఁగనీక యెంతయుఁ బ్రభు

బుఁ। బ్రాభాతజలజాతపత్త్రనేత్రంబులుఁ జాలవెడల్పైనఫాలతలము। నాకాశ
మణిబింబనికాశతేజంబుఁ గంబుబిబ్బోకంబుగలగళంబుఁ। బద్మరేఖాస్ఫూర్తిఁ
భాసిల్లుపదములుసింహంబుఁ దలఁకింపఁజేయుగతియు॥ తే॥ గలిగియొప్పారి రెండ
వకైటభారి। మాడ్కి నున్నహరిశ్చంద్రమనుజవిభుని। ననిమిషేక్షణములవిలోక
నమొనర్చి। యుల్లమునసమ్మదంబులువెల్లివిరియ॥ ఆ॥ ఇమ్మహానుభావుఁ డెవ్వఁడో
యెఱుఁగఁగఁ। బోలఁడధికతుహినజాలపిహిత। కమలసఖుఁడుపోలెఁ గానంగన
య్యెడు। నెచటినుండియొక్కొయితనిరాక॥ చ॥ శిరమునఁ బూపచందురుఁడు చె
న్నువహించిన మేరుధన్వియో। యురమునఁ గౌస్తుభంబు చెలువొందినయిందిర
ప్రాణనాథుఁడో। కరమునశైలభేదియగుకైదువయున్నశచీకళత్త్రుఁడో। తిర
ముగనీతఁడంచు వినుతించిరి హంసకులావతంసముల్॥ వ॥ ఇట్లు వినుతించి యతని
పిఱుందం జనుదెంచు నాత్రైలోక్యసుందరియగు చంద్రమతిం గనుంగొని॥ సీ॥
అరుణాబ్జచరణకాహళజంఘ కదళికాస్తంభోరు వుపులినతలనితంబ। యావ
ర్తనాభి పంచాననమధ్య చక్రస్తని బిసహస్తకంబుకంఠి। బింబోష్ఠి దాడిమీబీజ
రదన చారుతిలప్రసూననాస యిందీవరాక్షి। కార్ముకభ్రూయుగకైరవాప్తశకల
ఫాలపురందరగానీలవేణి॥ తే॥ మత్తగజయానచంద్రికామందహాస। ప్రవిమలస్వ
ర్ణకేతకీప్రసవగర్భ। దళతనూవర్ణపరిపూర్ణధవళకిరణ। వదనయీయింతి చె
లువంబువశమె పొగడ॥ చ॥ అనికొనియాడుచుండ వినరయ్య కృపామతిఁబౌరు
లారస। జ్జనసుతకీర్తులార గుణసాగరులార మదీయమైనవ। ర్తనము సమస్త
ముం దెలియదాఁచకచెప్పెదనంచుఁ బల్కె ని। ట్లనిజననాయకాగ్రణి ముఖాంబురు
హంబున దైన్యము బ్బగన్॥ తే॥ జలజహితవంశజుఁడను ద్రిశంకుధరణి। జానిసుతు
డహరిశ్చంద్రజనవిభుఁడను। వృషభాంకనిభుఁడగు గాధిపుత్త్రునకు ధాత్రి। దానమిచ్చిన
వాఁడను దారమహిమ॥ చ॥ అనిమిషలోకవర్ణితమహామహిమాస్పదమూర్తినై
నయమ్మునిరులచక్రవర్తికటమున్నుమఖార్థము ప్రేమనిత్తునే। ననియొడఁబడ్డవి
త్తమునకర్థిసుపాయములేమి సేవధూ। జనమణినమ్మఁ బూనితినసత్యముఁ బొంద
మనంబు గొల్పమిన్॥ మ॥ అత్రిసమానులున్ వివిసుధాంశుకులీనులు మన్మథద్విష।
న్మిత్రసనిభార్థవంతులు నమేయబలాఢ్యులునైన బ్రాహ్మణ। క్షత్త్రియవైశ్యశూ
ద్రకులసంభవులార మదీయభార్యన। త్పుత్త్రవతిన్ ధనార్థినయి పోకడఁ బెట్టె
దరందు విల్వగున్॥ సీ॥ నిద్దంపునునుమించుటద్దంబుఁ బ్రహసించు ముఖమండలము
గలమోహనాంగి। వెలిదమ్మిఱేకులవిభ్రమంబుల గెల్చు కన్నులుగలకలకంఠకం
ఠిఁ। బూవుగుత్తులతోడఁ బోరాడనోపువక్షోజములుగలమృగరాజమధ్య। గొంద
మ్మతుమ్మెదఱెక్కుఁ గొందఘటింపఁగఁజాలుకుంతలంబులుగలగురునితంబ॥ తే॥ బ



చ్చిపగడంపుఁదీఁగకుహెచ్చుఁజూపు। కెంపువాతెఱఁగలరాజకీరవాణిఁ। బ్రణు
తిఁగాంచిన పాలిభాగ్యలక్ష్మి। విక్రయించెదఁ గొనరయ్య వేగవచ్చి॥ క॥ కులసతిన
మ్మెడు వేడుకఁ। గలఁడే యని పరిహసింపఁగా వలవదునా। పలుకులు విని నను గృ
పతో। వెలయఁగ రక్షింపరయ్య వేఁడెదమిమ్మున్॥ వ॥ అనియత్యంతదైన్యంబున నం
గులాంగనవిక్రయంబు గావించు నాచక్రవర్తిం గనుంగొని పౌరజనానీకంబు
లుశోకాతిరేకంబున॥ చ॥ అకటవెడంగు గాఁడె ధరనారయ నీనరనాయకుండు
కొ। శికుకపటంపువాగురలఁ జిక్కి యొకింతయెఱుంగలేకక। ల్పకనిభదానవిస్ఫు
రణఁ బాయకసర్వమహీతలంబునూ। రకయొసఁగంగ నేటికి విరక్తిజనింపఁగ వేగి
రించుచున్॥ క॥ అదియునుగాక కులాంగన। సుదతీరత్నంబు నమ్ముఁ జూపుచు నున్నా।
డిదె యాతనిబుణమునకై। వెదకిన ధరలోన నిట్టి వేఁదుఱుఁగలఁడే॥ తే॥ కొంత
పాత్రపుటీవిగాకింతలేసి। దలముతప్పిన యీవులు తగునెయియ్య। ఇచ్చిమఱికొ
లుకొనలేక యేపుదఱిఁగి। పోవఁదెగడరె జనులు దుర్బుద్ధియనుచు॥ క॥ దారసుత
యుక్తముగ సం। సారంబంతయును విడిచి చరియించు మహా। వైరాగ్యనిధియె
యీవసు। ధారమణుఁడు ధరణి యెల్లఁ దపసికి నొసఁగన్॥ ఉ॥ ఇంకొకనాఁటి మే
లునకు నిప్పటి సౌఖ్యముఁ బాసి యెంతయుం। బొంకముతాలియుండుటయుబు
ద్ధియొకో పరికించి చూచినన్। శంకయొకింత లేక యతిసాధ్వి సరోరుహపత్త్రనే
త్త్రనే। ణాంకముఖిన్ విలాసవతినమ్మఁగఁబూనె వివేకహీనతన్॥ క॥ నాలుకయె
ట్లాడెనొ యీ। నీలాలక విక్రయింప నృపతికి మోహం। బేలిలను డిగ్గి ధైర్యం। బే
లాగునఁ బాదుకొనెనొ హృదయములోనన్॥ ఉ॥ ఈయెలదీఁగఁ బోఁడిఁ గృపయుం
చుకకల్ల కవిక్రయించుట। న్యాయము మేదినీపతికి నారయ నక్కట యెంతకల్గి
నం। బాయక స్వాపతేయము కభంగి మహింబడయంగవచ్చు గా। కేయెడనైన
నిట్టి వరదిందుముఖిం బడయంగవచ్చునే॥ వ॥ అనిపలుకుచుండ వెండియుఁ గొంద
ఱులోకోభిన్నరుచి యనువాక్యంబు నిక్కంబుగా నిట్లనిరి॥ ఉ॥ ఈరవివంశదీపకు
నినేటికి నేరములెన్న భూపతుల్। ధారణి దొల్లి విప్రులకు దానములియ్యరొ విత్త
ముల్ మహా। దారతతో నొడంబడరొ దర్పమునం జలపట్టి యీగతిన్। ఘోర
విపత్పరంపరలఁ గుందఁగఁ జేయరుగాక క్రూరతన్॥ క॥ కడుభక్తిమ్రొక్కఁజను
చో। గుడిమీఁదం బడిన యట్లు కువలయపతికిన్। బడిబడి దానములియ్యఁ। దొడిబడఁ
గౌశికుని చేత దొసఁగులుదగిలెన్॥ సీ॥ కాపట్యమును దీర్ఘకోపంబు గర్వంబు యి
తులకేటికి మహీపతుల యెడల। నలఘువివేకశూన్యులు భూమిదివిజులు విపరీత
ములు వీరి వృత్తులెల్ల। విశ్వసింపఁగరాదు వీరి వెయ్యైన నత్యంతమాయావాదుల
రసి చూడ। సుపకారమొనరించిన పరమపుణ్యుల కపకారమొనరింతురదను వేచి॥

తే॥ బలిదనుజుఁ జేరి వామనబ్రహ్మచారి। మునుపదత్రయమాత్రంబు భూమి వేఁ
డి పిదప నాతని బంధించి పెంపుడించి। పూని త్రోయఁడె పాతాళభువనమునకు॥
చ॥ అరయఁగఁ గశ్యపాదివసుధామరవర్గము జామదగ్న్యుచే। ధరణితలంబు
సర్వమును దంచితలీలఁ బరిగ్రహించియు। నిరుపమదానకల్పకమునీరధికోణ
మునందు నైన నస్థిరముగ నుండనీక యతిశీఘ్రముగన్ వెడలంగఁ ద్రోయరే॥ ఉ॥
ఇన్నియు నేల కౌశికమునీంద్రుఁడు దొల్లి వసిష్ఠునింటను। ష్టాన్నములన్ భుజించి
తుది నాతని కెగ్గొనరించెఁ బూని నే। డిన్నరనాయకోత్తమున హీనక్షీణన్ నిధా
నునిత్యసత్యోన్నతుఁ జాలలాఘవము నొందఁగఁ జేయుచునున్నవాఁడొగిన్॥
తే॥ అనుచుఁ బలుకుచునుండఁగ నందులోన। నొక్కకొందఱు పాణిపయోరుహ
ములు కర్ణపుటములఁ జేర్చి దుఃఖము జనింప। విశ్వనాథుని కాశికావిభుని దలఁ
చి॥ క॥ విత్తము గలదని నరనా। థోత్తము కామినులఁ గొనఁగ నుచితంబగునే।
యొత్తిలి వారల నుడిగపుఁ। దొత్తులఁగా నేలఁ జాలుదురె మనబోఁటుల్॥ క॥ మ
నమెక్కడ నివ్వనజా। ననయెక్కడ గర్వమున ధనంబిడి తెగువం। గొను
టెక్కడ వరవుడుగాఁ। బనిఁ గొను టెక్కడఁ దలంప భావ్యంబగునే॥ ఉ॥
కోరి తలంప సింహమునకున్ మఱి సింహాతు కాకదండపెం। పారఁగ జం
బుకంబవునె యబ్ధిపరీతసమస్తధారణీ। భారము పూని కీర్తిరమఁ బాయ
ని యీతని కెందుఁ బ్రాపు కా। శీరమణుండు దేవగణసేవ్యుఁడు శంభుఁ
డు గాక మర్త్యుఁడే॥ వ॥ అనియుగ్గడించు మనకిచ్చెలువ విలువం గతకావ్యం
బు కాదని పురజనంబులు నిజమందిరంబులకుం జనిరంత॥ సీ॥ గాధినందనుని చే
బోధితుండై శనైశ్చరుఁడట మున్న యప్పురికి నరిగి। వికృతమహీసురవేషంబు గై
కొని కపటవృత్తిక్రియానిపుణుఁడగుచు। గణన సేయఁదరంబు గాని సమగ్రసంప
దగల్గి యనుభవింపంగ లేక। పచ్చపైకంబైన వెచ్చంబు సేయుట స్వప్నంబునను
గాని వావి గాఁగ॥ తే॥ షడ్డికడు వెక్కసంబుగా నొడ్డి పెక్కు। చోటుల బుణంబు
లిచ్చి నిష్ఠురతఁ బూని। కాలకౌశికుఁడను పేరఁ జాలదీన। భావమెల్ల నుదనయందు
చాదుకొనఁగ॥ ఉ॥ ఈఘనిఁ బాముకుఁ బలియుని గకు గాటును నీకయెంతయున్।
లోభపరాయణాత్మకులలోనఁ బ్రసిద్ధుఁడితండనంగని। ష్పాపభవవృత్తిఁ బూని
కలుషంబునఁ గోడక మానసంబునం। దాభయమేమి యుగ్రతరదానములో లిఁబ
రిగ్రహించుచున్॥ తే॥ మెలఁగువాఁడంగడికి వచ్చి మేదినీశు। మాటలాలించి మిగు
ల సమ్మదముఁ బొంది। దమ్ముఁడిక నేడు నా చేతఁ దగులువడియె। గౌశికుని బ్రీతి నొం
దింపఁగలిగె నాకు॥ సీ॥ ఎదురయ్యెనాడఁ బోయిన తీర్థమద్భుతమావహిల్లం
గనీయవసరమున। గపటకృత్యంబులు కల్పించి వెఱపించి బెదరపోవంగఁ జేయు



డున్నపాలు। గాదేని మదిలోనఁ గరుణారసము పుట్టు నుచితవాక్యంబులఁ నూఱ
డించి। వక్రించి కులకాంత విక్రయించు తలంపు సర్వంబును డుపుముఁ జతురలీల॥ తే॥
నంతలో నేఁడు నెల్లి యనరిగనేని। కడచు మితిబొంకు పౌరయుభూకాంతు నుడు
వు। నను మఁగృతనిశ్చయుండయి యాక్షణంబ। నృపశిఖామణి ముందఱ నిల్చుట
యును॥ సీ॥ దేవురింపుచు వాజెదేఱడు మొగమును బడఁబాఱుచుండెడి బడుగు
తొడలు। బొలుపేది మెదుకకంపును నీను సిగయును బల్లమీసములును బిల్లికన్నులు। జిం
బోతుగడ్డంబుఁ జెడ్డ చూపులుఁ జాలఁ జివికిన కోలయుఁ జింపిగొడుగుఁ। బాతదో
వతులును బంచాంగమును ఫాలతలమునఁ బట్టె వర్ధనముఁ గలిగి॥ తే॥ ముష్టి మెత్తి
నధాన్యముల్ముడిచి వట్టి। ముఱికిబట్టలు మూపుపై దఱచు వ్రేల। నేవ మొనరించుమా
యామహీసుపర్వుఁ। గాలకౌశికుఁ జూచె భూపాలకుండు॥ వ॥ చూచి యతని య
ఱుతం బెనంగొని యున్న యజ్ఞోపవీతంబుల కతంబున మహీదేవునింగా నెఱింగి
కరారవిందంబులు మొగిడ్చి వందనంబుఁ జేసిన మందహాసంబొసఁగి యా రాజనం
దారునకు నతం డిట్లనియె॥ తే॥ నీదు వంశంబు నడకయు నిశ్చయముగఁ। దెలియునం
దాఁక నాశీర్వదింపరాదు। మాకు నెఱుఁగంగఁ జెప్పుము నీకులంబు। వర్తనంబును
జంబుగ వలయుఁ దెలియ॥ క॥ ఎవ్వండవీవు నీవా। రెవ్వరు నీనామధేయ మెయ్యది
మిగులన్। నివ్వటిలు చులుకందనమున। నివ్వనితన్ విక్రయించె దేయక్కఱకున్॥
సీ॥ వివరింపఁ బందికాఁడవు వలెను న్నాఁడవవయవస్ఫురణ చేనదటు గల్గి। కూలిప
నుల్ సేయహాలికవృత్తికి నోపుదువీ కృత్యముచితమగునె। దూరదేశము పోయి
చోరమార్గంబున బలిమి మైఁ దెచ్చిన పరవధూటిఁ। గలుషంబునకుఁ దలంకక ధా
ర్యాయని బొంకి విక్రయించుట మాకు విశదమయ్యె॥ తే॥ ఆ రెకులుచూచి రేని మహా
ప్రమాద। మీవిలాసిని విడిచి నీ వెచటికయిన। వేగను ఱుకుముకాదేని విశ్వసించి।
పూని నా యుపదేశించు బుద్ధి వినుము॥ ఉ॥ చాని సెగాఁగనీ వికచపద్మదళేక్షణ దా
రవోసీస। మ్మానము మీఱ నాకొసఁగుమా భవదీయకృతాపరాధముల్। పూనిక
నేను గైకొని ప్రభుత్వముగానఁ బడంగ నిల్చియే। వానికిలోఁగ కెంతతొరవచ్చినఁ
గాచెదనిన్నుఁ గూరిమిన్॥ క॥ అని యూగతిఁ బల్లఱపులు। గొనకొని యఱవంగ విప్రి
కులజుని తోనమ్మను జేంద్రుఁడధిక ధైర్యంబున నిట్లని పలికె శంకఁ బొందక తెలివిన్॥
మ॥ అవివేకంబున విప్రలాపముల నేలా పల్కెదీలాగునన్। రవివంశుండ త్రిశంకు
నందనుడనే రాజ్యంబు పాలించుచో। భువిలో నెన్నఁడు ఘోరవాక్యము వినన్ భూ
దేవ యిన్నాళ్ళకున్। జెవిసోఁకెన్ మదిలోన సహ్యముగనీ చేతన్ మహాదోషము
ల్॥ చ॥ అతిశయరోషసంయుతమహాభయంకరమండలాగ్రఖం। డితరిపుదం
తికుంభతటనిర్మలమౌక్తికరాజిఁ బూనియా। యతజయలక్ష్మికిన్ బరిణయాంగ

ముగాదల బ్రాలుమాలియు పా। క్షత్రగల క్షత్రవంశజు కరంబులు హాలికవృత్తి కోర్చు
నే॥ వ॥ భయమునఁ బొంది దైన్యమునఁ బాఱుచు వచ్చి మఱుంగుఁ జొచ్చినం। దయ
దళుకొత్తఁగా నభయదానము నూనముగాఁ గ నిచ్చి నిశ్చయమతితోడఁ బ్రోచుటది
యత్క్షత్రియధర్మము గాక నాకు నిన్నియును బరిత్యజించి మహీనిర్జరు చాటునను
డఁ బాడిమే॥ క॥ ఆలాగున జరియించిన। నేలాధరియింపవిల్లు సిషువుల పెల్లున్। వా
లు కరవాలు నసువుల। కీలు ఘనశ్రీలు విమలకీర్తుల మేలున్॥ క॥ బిట్టు దను మోవవచ్చి
న నెట్టున దైన్యంబు వదలి పలుమఱు మిగులన్। రట్టు పడితమకి మదిలో। నట్టిట్టనె నే
నినవ్యగ్రాసనివారల్॥ సీ॥ సర్వసర్వంసహాచక్రంబు గాధినందనునకు నేర్పడ దార
బోసి। యా జటిలోకబిడౌజునకట మున్న యజ్ఞకారణమున నెయ్యమున నియ్య। కొ
నినవిత్తమునకు వనజాయతేక్షణ విక్రయింపంగ నుపక్రమించి। నాఁడ హరిశ్చంద్ర
నామధేయాంకుఁడనీలీల దుర్భాషలేల నీకు॥ తే॥ మిన్నకుండుము కాకున్న మేలెంత
గొనఁగఁ। జాలితివ యేని హేమనిష్కములు కోటి। జట్టిగా నిచ్చి మున్న నస్తాపమెల్ల।
బాపికొని పొమ్ము విప్ర యీ పద్మముఖిని॥ ఉ॥ నావుడు బ్రాహ్మణుండు నరనాథునకి
ట్లనుఁ గొంత సత్యవా। చావిభవంబు గానఁబడె జయ్యనని మ్యోడ మాకుఁ గర్ణసా।
ఖ్యావహమయ్యె నీ వచనమారయ నీకు నభీష్టసిద్ధి యూ। భూవర యింత దైన్యమున
బొందఁగ నేటికిఁ జక్రవర్తికిన్॥ చ॥ వినుమిక నొక్కబుద్ధి పృథివీతలనాయక నా
దు వాక్యముల్। మనమున వేఱె యొండు గఁ దలంపకు పౌరులు గేలిసేయనం। గనఁ
గొనరయ్యయుం జసధికంబగు దీనత వాడవాడలన్। గొనకొని పల్కుచుండుటిది
కష్టతనంబు తలంచి చూచినన్॥ క॥ రేయును బగలును నయమున। చాయక యడి
యాసఁ జూపి భ్రమయించుచుఁ దా। నే యెడల నప్పు దీర్పక। తోఁయుట యేజాణత
నము తుదిఁ బరికింపన్॥ క॥ గాసిలి యప్పులవారలు। తిసినకొఱ్ఱులును గల వెధృతిఁ బ
రికింపన్। వేసరి పలుమఱు నడిగి ప్ర। యాసమునకు నోడి తారె యరుగుదు రెందున్॥
క॥ నేప్పున నప్పులు గొని తుదిఁ। దీర్పక దక్కించుకొనెడి తెఱువులు నేని। కేర్పడఁ జె
ప్పెద విను మా। హృత్పతికులతిలక మిగుల ననువుపడంగన్॥ సీ॥ తనభూమి వదలక
ధనవంతులగువారి యిండ్లకు నెడ తాఁకు చెల్ల ప్రొద్దుఁ। జేరి మిథ్యానమస్కారము
ల్ సేయుచుఁ బ్రియములు నయములుఁ బెక్కు చూపి। విశ్వాసమొదవించి వృద్ధికి జ
డియక తలచుపూఁటలును బత్రములుఁ బెట్టి। యధికవిత్తముఁ గొని యరిగిన పిదప
గొన్నాళ్ళకుఁ దనవర్తనులు తెలిసి॥ తే॥ యంగడికిఁ దెచ్చి కోపించి యానవాడిచి।
యడ్డపెట్టినఁ దలఁకక యాసమీఁద। నిలిచి మానంబు సిగ్గును నెఱయ విడిచి। యుఱక
మిసిమింతుఁడు ననుగాక యుండవలయు॥ శా॥ ఈరీతిన్ దలతాయి చేసికొని వారే
మన్న మామాటకున్। నోరెక్కింతయు నెత్తకున్నఁ గని మందుండీతఁడీ కష్ట



నిన్। జేరెన్ విత్తము పోవఁగాక మఱలం జేకూఱునే యింకనే। లా నోఁ తెల్ వలదం
చు బోదురున్న పాలా తారె కొన్నాళ్ళకున్॥ క॥ ఇమ్మహిన సత్యవాక్యం। బమ్మహి
తాఁకెడి నెపలవ దణుమాత్రంబున్। నెమ్మనమునఁ శంకింపఁగఁ। బొమ్మీ సతి నమ్మ వ
లదు బొంకినఁ జాలున్॥ ఉ॥ ఎంత పెనంగినన్ గృహిణి యిప్పటి కమ్మఁ డువామ నా
కు పా। యాంతరమేమియుం బొడమ దర్థము కూడదు కల్లలాడితేన్। బంతము తూ
లెనంచు మఱి పల్కమి నన్నికయున్న నిన్న। భూకాంతవధింపఁగా జనునె కౌశిక
మానికి నింతయేటికిన్॥ వ॥ అనుటయు దరహసితవదనుండై హరిశ్చంద్రుఁడద్ధా
త్రీదేవు నింజూచి నీవంటి లోభగుణవర్తనులకు నేతత్ప్రకారంబు లుపన్యసింపంద
గుఁ గాక మాకుఁ బొందువడునే నీవింక నేమియుం బలుకక తలంగి చనుమనిన న
కాఁకల కౌశికుండమ్మహీపాలుని సూనృతాలాపప్రభావంబునకు మనంబున న
త్యాశ్చర్యంబునొంది యీసమీకన్న పాలానీకు నీయుపాయవిమోచనంబునకును
పాయంబు బుగ అపినంగోపించెద వనిమఱియును॥ శా॥ భార్యం బోకడఁ బెట్టి నీవు
మఱిఁ దాపం బేమియున్ లేక గాం। భీర్యంబొందఁగనున్నవాఁడవఁట యో పృథ్వీ
శమా కేటికిన్। ధైర్యంబెంతయు వీటఁ బుచ్చి వగవన్ దక్కించి సీమీఁది తా। త్పర్యా
స్ఫూర్తిని బుద్ధిఁ జెప్పిన విరుద్ధంబయ్యె నీకింతయున్॥ తే॥ అనుచు నడిగిన విత్తంబు నా
క్షణంబ। యిందమని మ్రొండిటంకంబు లెన్ని పంక। జాప్తవంశజునకు నిచ్చి యమ్మహీ
సు। రాధముఁడు మానసమ్మున గ్రోధమెసఁగ॥ క॥ ఆసనపంకజసౌరభ। మానాడి
యిబులనఁగఁ బొల్చు నాచంద్రమతీ। మానవతి కురులు వేగన। హీనమతిం బట్టి తిగి
చె నెంతయు బలిమిన్॥ తే॥ కొంత దవ్వట్లు తిగుచుక ఘోరభంగిఁ। బుండరీకంబు దే
నువుఁ బోలెఁ బోవ। చూడకై వడిఁ జని తల్లిఁ గూడ ముట్టి। యాఁగి వాపోవు సుతు లో
హితాస్యుఁ జూచి॥ మ॥ ధరణీనాథుఁడు దుఃఖితాత్ముఁడగుచుం దైన్యంబుతో గద్గ
ద। స్వరవాక్యంబులఁ గాలకౌశికుని దుష్టస్వాంతునిఁ బల్కె భూ। సురగోవుం గో
నిక్రేపు బాపుదురె నా సూనుం గొనుండచ్చెదన్। శరదిందుప్రతిమానసుందరత
నూ సౌభాగ్యసంపన్ను నిన్॥ తే॥ జట్టి వీనికి హేమనిష్కములు కోటి। తెచ్చి యిమ్మ
నుటయు ధరిత్రీసురుండు। భానుకులమణిఁ జూచి భూపాల నీదు। పల్కు నిక్కంబ
యింకొక్క పాటి వినుము॥ క॥ ధేనువుఁ గొను చో గ్రేపును। ధేనువుతో లువిలువ
లోనిదియ కాక మహిన్। ధేనువునకుఁ గ్రేపునకును। స్థానాయక వేఱు వేఱు జట్లుం
గలవే॥ వ॥ అనుటయుఁ గాలకౌశికునకు నమ్మహీపాలుం డిట్లనియె॥ తే॥ ఇంకనొవి
ప్రదురాప లెల్లనుడిగి। నాదు వేఁడిన విత్తమంతయును నిచ్చి। సుతసమేతంబుగా
నీప్రసూనగంధిఁ। దోడ్కొని పొమ్ము కాదేని దొలఁగుమీవు॥ వ॥ అని యివ్విధంబు
న నమ్మహీసురుండును నమ్మానవేశ్వరుండు నుఁగల హింపన క్షత్రకుండు సరేక్షించి

సోమాన్వయసుధారాశ్యక్షమీకిరువురకుఁబరస్పరాక్షేపంబులుఁగోపంబులేమిటికిమదీ
యవాక్యంబులుప్రియంబులగునేని మీకిరువురకుమనంబులైక్యంబుఁబొందునట్లు
గానేనుమధ్యస్థుండనైయథావిధిఁదగవుఁగావించెద వినుండనియమ్మహీపాల
కుంజరుఁజూచి॥ సీ॥ ఈచంద్రబింబాస్యనీభూసురేంద్రునకీవుమొదలవిక్రయించువేళ।
నీవిల్వలోనివాఁడీనందనుఁడుగాఁడువేఱెపుత్రునికినివిలువవలయునని తేటతెల్ల
గానప్పుడవివరించిపల్కకతొడఁబడఁబడఁతినతని। కమ్మితివటుగాననాత్మజస
హితంబుకాలకౌశికునకీకాంతదక్కె॥ తే॥ నింకనీవేమిపల్కినవ్యపవర్ణ్య।పనికిరా
నుగణోదకబంధనంబు।వలవదిఁకననియర్ధరావరునితోడ।వడుగుచెప్పినపాడికి
గడకబాదలి॥ వ॥ కాలకౌశికుండత్యంతకుతూహలావేశంబుననక్షత్రకునిగదియ
దిగిచియుసగూహనాదిసంభావనంబులనాదరించినంగనుంగొని యారాజపు
రందరుండుతనడెందంబున॥ తే॥ తగవుధర్మంబువిడిచిసత్యంబువదలి।యితఁడుపి
లువనిపేరంటమేగుదెంచి। పాడిజెప్పెదననుచుదబ్బరలుపలికెఁ।గాలకౌశికున
కుపిచ్ఛకంబుగాఁగ॥ తే॥ కరుణవర్ధించిమృగశాబకంబుఁగ్రోలు। పులికినిచ్చినయ
ట్లయీపువ్వుఁబోఁడి।విక్రయింపంగవలసెఁబృథ్వీసురునకుం।దరమెయేరికిఁగడ
వంగదైవఘటన॥ మ॥ అనిచింతించుచునున్నఘోరమణుదీనాకారమీక్షించియు।
వ్వనితారతన్నుధైర్యమెంతయునిజస్వాంతంబులోనిల్పినం।దనుడుందానునువ
చ్చిపాదములనీఁదఁబ్రావాలిశోకంబునె।కొల్కులనంబలెల్లన్ఘనబాష్పబిందువులు
దృక్కోణంబులంజాఱఁగన్॥ శా॥ ఓప్రాణేశ్వరయోగభీరజలధీయోధైర్యహే
మాచలా।యోప్రాలేయమరీచిరూపవిభవాయోరాజచూడామణీ।యోప్రత్య
ర్థిమదేభపాటనహరీయోనిత్యసత్యవ్రతా।యోప్రాభాతదినేశతేజనినునేయో
జంబెడంబాయుదున్॥ శా॥ దీపింపంగనొసర్తువెల్లపుడుసర్తిన్మన్మనోమోదము
ల్।కోపంబింతయుఁజూపనోపనోడుదువుపెక్కుల్నేరముల్గల్గినన్। నాపూ
ర్వంబగుకర్మమెట్టిదియొసంతాపంబుపాలంబడన్। బాపెందైవమునేటితోడన
నునిపాదాంబుజద్వంద్వమున్॥ క॥ కౌశికసంయమిమాయా।పాశంబులచేతఁగ
ట్టుపడితిమిమదిలో।లేశముధైర్యమువదలకు।మీశాశ్వతకీర్తిసత్యమీయొనఁగూ
ర్చున్॥ క॥ క్షితినాథయతోధర్మ।స్తతోజయయటన్నపలుకుసకలపురాణ। స్మృ
తులుదెలుపంగవిందుము। సతతముసుకృతంబునిలుపు సదమలబుద్ధిన్॥ మ॥
ఘనరగ్రస్తునిహస్తిరాజునను కంపాబ్ధిసంశుద్ధిఁబా। యకరక్షించినలీలనో
ధరణీపాలాగ్రేసరానిన్నుఁగా। శకమానీశ్వరపడితున్గుణనిధిన్ జేపట్టిరక్షిం
చుస। ధ్రికుమారీరమణుండుచక్రధరుఁడెంతేవత్సలత్వంబునన్॥ శా॥ శ్రీకం
ఠుండుపినాకపాణిగిరిపుత్రీవల్లభుండాత్మర। శ్రీకేళీనిపుణుండుబాలశశిరే



ఖామౌళివేదాద్రిసీ। మాకంఠీరవమూర్తిశంకరుఁడుసేమందారసంప్రీ
తితో। నీకాశీపురవిశ్వనాథుఁడునునీకిచ్చున్మనోభీష్టముల్॥ మ॥ వినునానో
ముఫలంబునన్మగుడ నీవిశ్వంభరామండలం। బనివార్యస్థిరకీర్తివైభవుఁడ
వైయాచంద్రతారార్కమిం। పునఁబాలించెదుమానినీసునుడిపుడీభూదేవు
పక్షంబులా। డెనటంచుంబరితాపమందకుమునీడెందంబునందేమియున్॥ క॥
నీరజబాంధవుబాదివిన। ధారాధరతతులయట్లధరణీధవనిం।హారంగనిన్నుబా
దివిన। భూరివిపత్సముదయములుపోరిబోరిబాయున్॥ తే॥ మమ్ముమఱవుముస
త్యంబుమఱవకెపుడు। నినుమృషావాదిజేయుదునని చలమున। గాధినందనుడా
నరించుకపటకృత్యములకుజలనంబునొందకనిలువుమధిప॥ వ॥ అనివెండియుఁ
బ్రాణేశ్వరుచరణారవిందంబులకువందనంబొనరింప నన్నీలవేణింగని కాలకౌ
శికుడత్యంతరోషావేశంబున॥ తే॥ కపటములువన్నియిపుడునన్గన్నుమొఱఁగి।
సురుఁగజూచెదవేమఱఁజుమ్మునిన్నుఁ। గనికరముమానసంబునఁగదియనీక। దా
సిఁగాజేసియేలుదువాసియుడుపి॥ వ॥ అనియకాకాలకౌశికుండు॥ తే॥ తిరిగియిం
టింటముష్టియెత్తినయనేక। ధాన్యములమూటలన్నియుఁదననుమూఁపు। మీఁద
నున్నవితొలఁగించిమిగులబరువు।గాఁగనాలేమతలమోపుగట్టిపెట్టి॥ తే॥ వేగ
మింటికిఁబదపదజాగుమాని। నీటుసేయకనడువుమునెలఁతయనుచుఁ। గుంభినీ
సురుఁడదలింపగొడుకుచెట్టఁ।బట్టుకొనిచాలదురవస్థతొట్టుకొనఁగ॥ చ॥ బడిబ
డిఁగన్నులదొరఁగుబాష్పజలంబులచేనురోజముల్। దడియఁగగండపాలికలద
ట్టపుఘర్మకణంబులుబ్బనె। న్నడుమసియాడఁగొంకుచు మనంబుననార్తజనై
కరక్షణున్।మృడునిదలంచుచుంజనెడిమీనవిలోచనజేరిచూచుచున్॥ వ॥ కాశి
కాపురవీధులందొలంగక సందడిగొనుపురంధ్రిజనంబులు డెందంబులవగలం
బొందితమలోనిట్లనిరి॥ చ॥ కలితశిరీషపుష్పమునకంటెమృదుత్వముగల్గియున్న
దీ।లలనశరీరమిట్టిశశలాంఛనబింబనిభాస్యనకటా। తలపయిమోపుమోవ
నిటుతామరచూలియొనర్చెనాత్మను। న్మలికములేకయీబరువుమానవతీమణి
యెట్లుపూనెడిన్॥ క॥ సంపూర్ణపూర్ణిమాశశి।సొంపుదలపింపఁజాలుసుకు
మారతనూ।సంపదగలయీబిడ్డను।కంపింపకయెట్లునేర్చుగమనింపంగన్॥ క॥
ఈవిప్రాధముఁడతికలు। షావహవర్తనుఁడుధూర్తుహరహరవీరిన్। దావిలి
చినిర్దయుండై।కావించుచునున్నవాఁడుఘనతరబాధల్॥ ఉ॥ ఈతనివిప్రుఁగాఁగ
విధియెట్లుసృజించెనొలేశమాత్రమున్। భూతదయాదివేషమునుభూసురతే
జముశాంతభావమున్। బూతచరిత్రమున్సుకృతబుద్ధియులేదుతలంచిచూచి
నన్।వీతవివేకులోభగుణువ్రతుచరూభకుఁడావునెంతయున్॥ వ॥ అనియీలా

గునఁ బౌరవిలాసవతీజనంబులు తన్నునుపలంభింప నక్కుంభినీసురుండు కోపించి
నిజకరావలంబితయష్టిదండంబునఁ బ్రచండంబుగా నప్పుండరీకలోచనలం గొ
దిసి వ్రేసినం గలకలంబెసంగఁ గలంగి చనుచుండిరి అప్పుడు ధూర్తవిప్రాంగనా
ప్రేరితులై బ్రహ్మచారిజనంబులు కాలకౌశికుం బొదివి॥ సీ॥ కరయష్టిదండమొ
కఁడు తీసిపోవైచె నంజ కొక్కఁడు సిగ గుంజియడిచె। నొడిసి గడ్డము పట్టియొ
కఁ డుయ్యాలలూఁగఁ జెదరక వోవ తిఁదించె నొకఁడు। తవిలి యొక్కఁడు జన్ని
దంబులన్నియుఁ ద్రెంచె వెసనాతపత్రంబు విఱిచె నొకఁడు। కినిసి యొక్కఁడు
పుచ్చుకొని యేఁబంచాంగంబు వెనికెలఁబడఁ ద్రోచె నలుక నొకఁడు॥ తే॥ ఓలిఁ గు
క్కలను సికొల్పె నొక్కరుండు। పెనఁగి యొక్కఁడు పశ్చైవర్ధనము నాఁకె। ను
మిసె దుప్పున మొగముపై నొక్కరుండు। బెట్టు నవ్వుచు దవుడలఁ గొట్టె నొకఁడు॥
వ॥ ఇట్లు బహువిధంబులం బిఱుపీఁకులు సేయు బ్రహ్మచారిజనంబులకుఁ బ్రియంబు
న వందనం బొనర్చి నాకుం బ్రియంబుగా నీ భూదేవునిం బోవందగునని పలుకు
చంద్రమతిం గనుంగొని తదీయగంభీరభాషణంబులకు నక్కుంభినీసురకుమారు
లనురాగసంభరితాంతరంగులై॥ ఉ॥ ఓ తరలాక్షి ధర్మగుణయుక్తచరిత్రవు
గాన నీ మనఃప్రీతిగ నీ దురాత్ముని నపేతవివేకుని గ్రూరభాషణున్। బాతకలోక
వర్తనుని బాధయొనర్పక సత్కృపారసా। న్వితులమై భయంబుడిపి నేటికిఁ గా
చితిమీవు వేడఁగన్॥ తే॥ అనుచు బ్రహ్మణబాలకు లరుగుటయును। గొంత భయమే
దివిప్రుఁ డత్యంతిఁ జూచి। వెట్టకేలకు నొయ్యన నీ తెలుఁగున। బలికె నవివేకపరు
షభాషలు చెలఁగ॥ ఉ॥ కొంచక నన్నుఁ బట్టుకొని క్రూరత నూరక యీసు రేఁగి బా।
ధించుచు నున్న యీ వటుగుఁ ద్రిమ్మరులం బురియారె కుల్ విమ। త్యించి మహాగ్ర
తం బొదివి శీఘ్రమ యందఱ నేపు దూలదం। డించక యుండ నీకుఁ దగునే యిటు
వాండ్రఁ బోలంగఁ బంపఁగన్॥ వ॥ అనికినిసి పలుకుచు మెల్ల మెల్లనఁ జని గృహప్ర
వేశంబు సేయు నెడఁ బురోభాగంబున॥ సీ॥ పల్లచింపి జితతలఫాలంబు సుడియును
ముడిబొమ్మలును జప్పిముక్కు దొప్ప। చెవులుఁ బిల్లికనులు జెక్కుటెపులిపిరిగొగ్గి
పండ్లును ముడికోతి ముఖము। కొంగమెడయు నిడుగూని వీఁపు నొఱగుపోయిన
రొండియు బొక్కి ఱొమ్ము। నింకుడుఁ జన్నులు వంకచేతులు గడువలమైన గానుగ
వంటి నడుము॥ తే॥ దొడ్డికాళ్ళును నల్లని చెడ్డయొడలుఁ। గలిగి యత్యంత నీరకసా
కారమైన। కలహకంటకి నవ్విప్రుకాంతఁ జూచి। భయము జనియింప ధారణీపా
లుదేవి॥ వ॥ బిడాలంబుం గనుంగొనిన కీరకిశోరంబునుం బోలెఁ దల్లడిల్లుచున్న య
ప్పల్లవాధరిం గనుంగొని యిది యెక్కడి మిటారిం గొని తెచ్చితివని తుటారంపు
మాటలాడుచు మగండును దానును గాక చింగడంగి॥ చ॥ పొరిఁ బొరి నిష్ఠురక్రి



యలఁ బూని పెనంగుచున్న ధారుణీ। సురమిథునంబుఁ జూచి ధృతి సొంపు దలి
ర్పఁ బతివ్రతాగుణ। స్ఫురణము గానిపింపఁగ వచోనిపుణత్వము మీఱఁ బల్కెనం।
బరమణివంశభూషణుని పట్టపుదేవి వివేక మేర్పడన్॥ చ॥ కలరె ధరిత్రి నాలు నుమ
గండును నీ క్రియ దారుణోద్ధతిన్। గలహ మొనర్చువార లిది కల్మషకృత్యము గా
దె చూచినన్। గలనికి మెచ్చుగాదు పరికింపఁగ సిగ్గొక లేశమాత్రముం। దలఁపరు
వాడలో పలిజనంబులు సారెకు నవ్వుచుండఁగన్॥ తే॥ మగఁడు దను మొత్త దాను
నుమాఱు మొత్త। రాజముఖి గ్రామసూకరమై జనించు। భర్త కోపించి మఱి మొ
త్తి పల్కనేని। వలదు ప్రతిభాషణంబులు వనజముఖికి॥ చ॥ కలశభవాత్రిగౌతము
లకాంతలు భర్తృపదాబ్జసేవని। మ్మఱుతరభక్తిఁ జేయుచు సమస్తజనంబులు
బ్రస్తుతింపఁగా। వెలసిరి గాన భామలకు వేడ్కఁ బతిప్రియహేతుకృత్యముల్। స
లుపుచు నుండఁగావలయు సంతతముం గడుఁ బ్రేమతోడుతన్॥ సీ॥ కుసుమకోమ
లులకు గుజ్జుమామిడిపండు ప్రాణనాయకుపాదపద్మసేవ। శాతోదరులకు మంచే
తిమాణిక్యంబు ప్రాణనాయకుపాదపద్మసేవ। కీరవాణులకు ముంగిటిపెన్ని
ధానంబు ప్రాణనాయకుపాదపద్మసేవ। కుటిలకుంతలులకుఁ గొంగుబంగార
ంబు ప్రాణనాయకుపాదపద్మసేవ॥ తే॥ వలవదే నోములును నోమ వనరుహాక్షు। ల
కు మనోహరు పదకమలంబు లెపుడు। ముదముతోడ భజించిన నదియె చాలుఁ। దల
చిచూచిన నభిమతార్థంబు లొసఁగ॥ తే॥ అనుచుఁ బెక్కువిధంబుల మనుజవిభుని। వ
నిత పల్కు సతీధర్మవాక్యములకుఁ। గనలి మోమున నరుణిమ గ్రమ్మ విప్రు। నెల
త భీషణగార్దభనిస్వనమున॥ ఉ॥ మించిన కాలకౌశికుని మీఁదిమహాగ్రహ మెల్ల
భూమిభృ। చ్చంచలనేత్రపై నిలిపి చాలఁగ నిష్ఠురభాషణంబులన్। గొంచక ప
ల్కఁగ న్గొనలు గోపహుతాశనకీలలుబ్బన। క్తంచరిపోలె జూపఱకు దారుణలీల
భయంబుఁ జూపుచున్॥ తే॥ తగవు జెప్పంగ నిన్ను బ్రార్థన యొనర్చి। యెవ్వరి
చటికిఁ దెచ్చిరో చివ్వలాడి। నీవు చెప్పఁగ యుండిన నే మెఱుఁగమె। పుడమి వర్తించు
మగనాలి నడత లెల్ల॥ చ॥ పతిహితచర్యలీకరణిఁ బాయక నీ వుపదేశమియ్యఁగా।
సతతము నింక నినొడుపు చందము నన్వహించుదాననే। యితరులయట్లు నే పు
ముక యిఁచక సేఁపు సమస్తకార్యసం। గతులును లెస్స చేసెదను గ్రక్కున నే
టికి వేగిరింపఁగన్॥ తే॥ నన్ను జెప్పంగ నెఱుఁగవు మున్ను నీవు। మృత్యువైనను వెఱ
చునా యెదుర నిల్వ। నిరుగుపొరుగులవారికి నెల్లి జుక్క। యెదురు నా యిల్లు వే
యును నేల యింక॥ చ॥ ననుఁ గనుఁగొన్న యప్పుడ ఘనంబగు భీతివడంపుచుండు
నా। పెనిమిటికిన్ భయంబుడిపి బీరము నేర్కొనమాఱు మొత్త నొ। య్యన సమక
ట్టి తెచ్చి కలహంబునకుం బురికొల్పితంచు భూ। జననుతపుణ్యశీల యగు చంద్రమ

తించలపట్టియీడ్చుచుఁ॥ క॥ వ్రేసిపదతాడనంబుల। వాసిందూలఁగించినొంచి
వదలకమఱియుఁ। గాసింబెట్టుచునుడిగవు। దాసింగానేలుచుండెదయలేక
నృపా॥ వ॥ అటహరిశ్చంద్రధనరేంద్రుండుపురంధ్రీరత్నంబువిక్రయంబుగావించి
నవిత్తంబుసమస్తంబునుసమర్పించుటయుగైకొని యమ్మునికుమారుండత్యంతస
మ్మదంబుననాసార్వభౌమునాశీర్వదించి॥ తే॥ కౌశికునియాజ్ఞనీవెంటగడుప్రబ
యాస। మునజరించినవాసరంబులకునెల్ల। బత్తెసెలవయ్యెధారుణీపాలయిపు
డు। నీవునాకిచ్చినధనంబునేటితుదకు॥ చ॥ ఇనకులవర్యకౌశికమునీంద్రుఋణంబు
నువేగదీర్చిమ। మ్మనిచిసమగ్రసూనృతమహత్త్వముజెందుమునీవునావుడుఁ। జ
నపతినవ్వియిట్లనియెజయ్యనయ్యనజూచిపల్కుఋం। దనతలయూచుచుంమిగు
లదైవముచేతఁకునాత్మదూఱుచుఁ॥ తే॥ నిన్నునామీఁదఁదరువుకానఁగనొనర్చి।
యనువుచోనీకుబత్తెమమ్మనుచుగాధి। తనయుఁడేమియునాతోడననఁగలేదు।
పాడియేనీకుననునేడుబత్తెమడుగ॥ క॥ సారంబైనవివేకవి। చారంబింతయునులే
కసారెకునాపై। నూరకమిథ్యావాదము। లీరీతింబలుకభావ్యమేమునితనయా॥ క॥
నావుమునత్కుత్రకుఁడో। భూవరనీవెంటనన్నుఁబత్తెంచుతఱిఁ। భావించిననన్నడ
గ్గఱ। రావించిరహస్యవాక్యరచనచెలంగఁ॥ క॥ దినమునునీచేబత్తెముఁ। గొనుమ
నికౌశికుఁడుచెప్పెఁగోపంబేలా। మనుజేశయేనుమిన్నక। పనివడనీవెంటఁదిరుగ
బంటనెచెపుమా॥ ఉ॥ ఆతపశీతవాతములకంజకనేనినుఁగూడిపర్వత। ప్రాతము
లెక్కి-వాహినులవారణదాఁటిమహాటవీస్థలుల్। భీతితొలంగిచొచ్చికడుబేలత
నంబునడస్సితిఁధరి। త్రీతలనాథనాకువలదేదినబత్తెముమాత్రమియ్యఁగఁ॥ ఉ॥
సంతతవేదపాఠమునుసంధ్యయుప్రేల్మియునుజ్జగించినే। నెంతయునుమాధవృ
త్తిధరణీశ్వరపాపముఁగట్టుకొంటినీ। చెంతవసించికౌశికునిశిష్యులలోపలనేటి
దాఁకని। శ్చింతమతిఁయథావిధిఁగఁజేయుదుఁదప్పకనిత్యకృత్యముల్॥ సీ॥ వినునృ
పాలకయూళ్ళవెంబడిదేవరగుళ్ళపంచలఁజేరికుతిలకుడిచి। యడిగితెచ్చిననీర
సాన్నముల్భుజియించిబడలితినెంతయుఁబదనుతివిసి। మెంచంగనేటికామంచి
తనంబివమెఱిఁగెదవనియుంటినిచ్చలోన। నేనొందినప్రయాసమెఱుఁగంగలే
వైతివించుకంతయునునింకేమియనఁగఁ। దాళ్మిదిగనాడియలుకమైతెరువుకాని।
చేఁతలన్నిటఁబలుమాఱుఁజేసినీదు। వాసియుడుపకమొగమోటవలనికూర్మి।
నూరకుండిననపరాధమొదవెనాకు॥ ఉ॥ నావుడుభూమిపాలుడుమనంబునఁగో
పముసంభవింపఁగా। నావటుధూర్తుఁజూచివసుధామరయాగతినిష్ఠరోక్తులే।
లావచియింపనీకుమొదలందినబత్తెమునేనొడంబడఁ। నీవుగురుప్రయోజనము
నెమ్మినొనర్పఁగవచ్చితిమ్మెయిఁ॥ క॥ ఎల్లెడబరదేసులకును। గుల్లింబంచబునురవ్చ



కొట్టంబులునం। గళ్ళనుగాకతలంపఁగఁ। జల్లనిసున్నంపుమల్లసాలలుగలవే॥ ఉ॥ నీ
కిటునన్నుమాఱుఁజనునేపలుచోటులనీరసాన్నముల్। గాకసుఖప్రకారమునగ
ల్గగనేర్చునెపాయసాన్నముల్। చేకొనియిండ్లవెంటనిరసింపఁగబిచ్చములెత్తు
వారిక। య్యోకరుణింపఁగావలదెయోపికగల్గిమనంబులోపలఁ॥ క॥ ఆమృతము
ద్రావిననోరనె। దమకంబునఁగినిసివిషముఁద్రావినరీతిఁ। మమతమునుమేలుగా
విం। చిమఱేమిటికిప్పుడెగ్గుచేసెదవనఘా॥ సీ॥ పరుషభాషణములుపలుమాఱుప
లుకకమెల్లియునేడుసహింపుమాత్మ। నరసినేనేయుపాయంబునైననుమితిలో
నఁజెల్లింతుమీధనంబు। నిప్పుడిచ్చినవిత్తమప్పులోపలిదియకాఁగఁగైకొనుముని
షు-పటుబుద్ధి। ననఘునీచిత్తంబుహర్షించునట్లుగాబత్తెంబునిత్తునేపాటియైన॥
తే॥ దొలుతఁగౌశికసంయమీంద్రునిఋణంబు। మొదలుముట్టంగఁదీర్చియేమని
కుమారకీర్తిఁబొందెదననుఁగటాక్షింపవయ్య। కరుణయుల్లంబులోపలనిరవు
కొనఁగ॥ వ॥ అనినమందహాసంబుచేసియమ్మునినందనుండునృపసంక్రందనుంజూ
చి॥ క॥ భూపాలయిపుడురోకడ-ము। చేపడినధనంబువిడిచినీమాంతరముల్। నీ
షజ్జఁదిరుగుచుండఁగ। నాపాపమెయింతయేలసలిపెట్టంగఁ॥ తే॥ క్షితితలేశ్వర
నన్నునీచేతిహేతిఁ। బూనివధియించిమఱికొనిపొమ్ముధనము। బచ్చపైకంబునిం
దులోవెచ్చపఱప। నెన్నిచెప్పినమాటలింకేటికనిన॥ ఉ॥ ఓపరమేశ్వరాయనిప
యోరుహబాంధవవంశవర్ధనుం। డాపరుషోక్తికింగమరయంబునవీనులుమూసి
యాత్మసం। తాపమునొందియివ్వడుగుదానతిపాతకుఁడిట్టికట్టిఁడిం। జేషడెము
న్నుగాధనముచేరునెక్రమ్మఱనాకునేమియుఁ॥ క॥ ఏపగిదిఁదీర్తునికనేఁ। దాపస
వరుఋణమునిజముతప్పకయుండఁ। నాపలికినమితిదినములు। లోపలనెసమస్త
జనములుంగొనియాడఁ॥ వ॥ అనిచింతాక్రాంతుఁడైయున్నయమ్మహీకాంతు
నింగనుంగొనికపటక్రియానిపుణుండగునక్షత్రకుండిట్లనియె॥ క॥ ఊరకచింతించు
చునీ। వీరీతింగదలకున్ననృపమావిత్తం। బేరీతివచ్చువేగమ। రారమ్మువనమ్ముదె
మ్మురసికతవెలయఁ॥ సీ॥ అనినసనిట్లనిపల్కెనవనీకళత్రుండునక్షత్రకునియానసనం
బుజూచి। మునిపుత్రమేనొనర్చినయపరాధముల్పెక్కులుగలవేలపేర్కొనంగ।
నరవిందలోచననమ్మినవిత్తంబుతోడఁబడసర్వంబుదొరకెనీకు। మునిఋణంబెఁకొ
దీర్చుకొనదగుస్వాపతేయంబునకొండుపాయంబులేదు॥ తే॥ కావవేగంబననున్న
గింకరునిఁగాఁగ। వీటిలోనెవ్వరికైనవిక్రయించి। నిరవశేషంబుగానప్పునేటితో
డ। నంతయునుదీఱునంతద్రవ్యంబుఁగొనుము॥ వ॥ అనుటయునట్లకాకయనిసమ్మ
తించినక్షత్రకుండవ్వసుంధరాధ్యక్షునిదక్షిణహస్తంబునిజపుస్తకసూత్రంబున
బంధించి॥ తే॥ రమ్మునీవనికొంపోయినెమ్మనమున। శంకయేమియులేకయాసార్వ

భౌముఁ। బట్టణములోన విక్రయింపంగఁ దొడఁగె। బౌరజనహారవంబు ప్రబలు
చుండ॥ సీ॥ తన్మచక్ర మెల్ల విశ్వామిత్ర మునిశిఖామణికి సమర్పించిన మంచిదాత। యేడు
దీవులను విజృంభించి బహుజయస్తంభముల్ నిల్పిన శౌర్యశాలి। బేతాళుఁ డనుపే
రిభూతంబుఁ దెగటార్చి మునులభయంబు మాన్పినమహాత్ముఁ। నిత్యసత్యవ్రతస్తు
త్యాఢ్యైకకీర్తి విస్ఫూర్తిచే వెలసినపుణ్యమూర్తి॥ తే॥ నర్కకులవార్ధిపూర్ణేందుఁ డగు
త్రిశంకుకూర్మిపట్టి హరిశ్చంద్రకువలయేశు। విక్రయించెద నడిగినవిత్త మొసఁగి।
గరిమఁ గొనరండు పౌరలోకంబులార॥ వ॥ అని యిప్పగిదిన ప్పట్టణవిపణిమార్గం
బుల నమ్ము సమయంబున నసటమున్న జతపస్సామర్థ్యంబున విశ్వామిత్రుండు మణిక
ర్ణికానికటంబునం దొక్కపితృవనంబు నిర్మించి సమవర్తిం దలంచిన॥ ఉ॥ దం
డము కేలఁ బూని జలదప్రతిమానతనుప్రభావళుల్। మెండుకొనంగఁ గింకరులు మి
క్కిలిభక్తి భజింపఁగాఁ గృతాంతుం డరుదెంచి తత్పరత ధూర్జటిసన్నిభుఁడైన
మౌనిమా।ర్తాండున కెంతయున్ దృఢతరంబగుభక్తి నమస్కరించినన్॥ క॥ కౌ
శికముని వైవస్వతు। నాశీర్వాదం బొనర్చి యాదర మొప్పఁ జా।వేశం బొదవఁగ నిట్ల
ను। వైశారద్యానవద్యవాచాగరిమన్॥ సీ॥ మార్తాండనందన మన్మనఃప్రీతిగా నీవు
మహాద్భుతం బావహిల్ల। మాయాశ్వపచవేషివై యతివేగ నీపురిఁ బరేతనికేతము
నకు నాథివి। సత్యంబు గైకొని నిత్యసత్యమునకై నాకొడంబడినధనంబు లేమి। నమ్మ
డు వోయెడు నాదిత్యకులవార్ధిచంద్రు హరిశ్చంద్రసార్వభౌము। విలిచి హుంకార
మెల్లను బిటఁగలిపి। కింకరుని గాఁగ నేలి నిశ్శంకలీల। ననుదినంబును హేయంబులైన
పనులు। సేయ నియమింపు ధైర్యంబుఁ జెదరనందు॥ అనిన నట్ల కాక యని యాతఁడుం
బ॥ సీ॥ నడునెత్తిఁ గొప్పఁగర్ణములఁ గీలించిన తెల్లని ముడుసు జెందిరపుబొట్టు। మొ
లగాసెఁ బోసిన మురికిపాఁతయు నందు నమము బిగించిన వరపవాఱుఁ। దలనట్టు
నట్టుగా వలసెయొల్లమి గాఁగఁ బెనఁచి చుట్టిన కావిఱేపెలికయును। బైఁద్రిప్పికప్పిన
ప్రాఁదోలుపాయయుఁ జేనున్న నీలయష్టియును గలిగి। కోరి పసరపుసంజుట్టి గుది
యుఁ గల్లు। బుంగయును బూని తనమేని పొలుసుకంపు। లలముకొన విరచాహాను
నాహ్వాయమునఁ। గపటచండాలవేషసంకలితుఁ డగుచు॥ మ॥ మదిరాపానవికా
రచేష్టలఁ గడున్ మిత్తిల్లి రక్తాక్షుఁడై। యెదురుం దన్ను నెఱుంగలేక మిగులన్ హే
యంబు వాటిల్లఁగాఁ। బదముల్ తొట్రుపడంగ జొక్కుచు మతిభ్రాంతిన్ బడం
బాఱుచున్। గుదిగొంచున్ వెడపాటఁ బాడుచు మదురుక్తుల్ ప్రేలుచున్ సోలుచున్॥
తే॥ మొగము మైఁ జిమ్మచీఁకటి ముడివడఁగ। మాటిమాటికి మీసాలు దీటికొనుచుఁ।
జనియె సంబళి సంబళి యనుచుఁ బంక। జాప్తకులపుంగవుఁడు వచ్చు నంగడికిని॥ వ॥ ఇ
ట్లు చని యయ్యంత్యజుం డత్యంతహేయంబుగా మొగంబునఁ గల్లుకంపు వెల్లుబ్బ



తబ్బిబ్బులగుపల్కుల నిట్లనియె॥ తే॥ ఓరి మోరంతప్రొద్దు నాయొద్దఁ గదఁల।
కుండి యుడిగంపుఁబనులు సేయుచుఁ బ్రియంబు। చెలఁగ మెలఁగెద వేని
యా చిలుతబాఁపఁ। డడిగినంతధనంబు నేఁ దడయ కిత్తు॥ వ॥ అనుటయుఁ
గోపారుణితలోచనుండయి భూపాలుం డా చండాలుం జూచి॥ శా॥ ఓరిమా
లదురాత్మ నీమనములో నొక్కింతయున్ శంకలే। కీరీతిన్ మదహంకృతిన్ బలు
కనోరెట్లాడెదా నీకు నా। హా రాజీవసఖాన్వయున్ విలువ నీవహ్నాండ వేపా
మ్మునన్। జేరన్ రాకుము మద్యపానకృతదుశ్చేష్టావికారంబునన్॥ క॥ ఏనె
క్కడ నీ వెక్కడ। మానికి మారునకు నిష్టమతి కడుఁ బొదలం। గా నొప్పఁ గదు ధ
నమెక్కడ। హీనకులుఁడ తొలఁగుమనిన నిట్లనునాఁడున్॥ సీ॥ దండహస్తుండనై త
ప్పులారసి మనుష్యులనెల్ల శిక్షింతు వలసినట్ల। యనిమిషులకునైనఁ గినియంగ రా
దు నాయెడ నీకు నిట్లేల హేయపడఁగ। జండాలుఁ డని సారెసారెకు నన్ను నీవి
సడించుట పాటియే తలంప। ధర నుతిఁగన్న మీతండ్రివంశమునకు నాదువంశమున
కు భేద మెద్ది॥ తే॥ మునిశిఖామణి బుణమెల్ల మొదలు ముట్ట। నేనతిచ్చెద నెవ్వఁడనైన
నేమి। దురభిమానంబు మాని యీదాసుఁగు వెడలఁ। గోరి నాచేత విత్తంబు గొ
నుము వేగ॥ క॥ ఇంతదొరవరుసవాఁడవు। పంతంబుననుండ కేల ప్రాభవ మెడ
లన్। వంతం బొందుచు నో భూ। కాంతా యివ్వడువు చేతఁ గాసిఁబడఁగన్॥ క॥
పలుమఱు నీతో నాకున్। గలపింపఁగ నేల ధనముగలవారికిఁ జా। పులు లేరె యర
సి విలిచిన। దొలఁగుము చెప్పకుము నీదు దొడ్డతనంబుల్॥ వ॥ అని హరిశ్చంద్రనృపుం
డును నా చండాలుండును బట్టియాడ నట్టియెడం గదిసి నక్షత్రకుండు॥ మ॥ ము
ను నాతోడుత నీవు పలికిన క్రమంబు గాదె భూపాలకా। వ్యసనికైనన్ ననువి
క్రయింపు మని గర్వస్ఫూర్తి వర్జించితే। వనవే యాగతి నేటికిన్ దిరుగ సత్యప్రౌ
ఢిఁ బోనాడియు। తని హీనుండని మాటిమాటికిని నిందల్పల్క నీ కేటికిన్॥ క॥ ఇతఁ
డెవ్వఁడైన నేమగు। క్షితినాయక ధనము మాకుఁ జెల్లించినవా। డతగిన మాన్యుఁ
డు తలపఁగ। నతివేగమ విత్తమునకు హరువికఁ జెపుమా॥ శా॥ ఈచండాలుని చేత
మా ధనము నేఁ డిప్పించె దో కాక నీ। వాచాడంబర మెల్ల మాని యనృతవ్యాపార
శీలుండవై। యాచంద్రార్కము ధాత్రిపై నిలుచు సత్యస్ఫూర్తి వర్జించెదో। ధీ
చాతుర్యము మీఱ నిందొకటి నిర్థింబూనుమా చెచ్చెరన్॥ మ॥ వినుమీ నా ప్రతి
జ్ఞ యింకొకటి యీవిత్తంబుకున్ రెట్టియి। చ్చిన నొండొక్కనికమ్మ నీతనికి సన్
శీఘ్రంబ నేనమ్ముదున్। జెనఁ గొన్నట్టి చలంబుతోడ ననుచున్ బృథ్వీశ్వరుం బల్క
గా। వినిచండాలుఁడు సంతసిల్లి పలికెన్ విప్రోత్తముం జూచుచున్॥ తే॥ అవుర
మెచ్చితినో బాఁపనయ్య నిన్ను। దిరుగ కీమాట నీమదిఁ దిరము సేయు। హీనకులుఁ

డనియెఱిఁగుమనస్సేవగించి। పలికెనాయాత్మకదియంపములికియయ్యె॥ ఉ॥ నీ
ఋణమెల్లఁ దీర్చియవనీపతిఁ గింకరుఁగాఁగ నేలుదున్। గోరుమునీదుచిత్తమున
కుర్మిఁ దిరమ్మెయ్యదియన్నసమ్మదం। బారఁగఁ బల్కె మౌనిసుతుఁ డంత్యజుఁగ
గ్గోనియింతవట్టునీ। పేరుగఁ జేసినామదికిఁ బ్రీతియొనర్పుమునీవుదాతవై॥ తే॥
జముఁడుదంతావళముసెక్కి చాలనిక్కి। గగనతలమునకైరత్నమెరిగిపోవ। వై
చినంతయుఁ బోఁడవుద్రవ్యంబుఁ దెచ్చి। రాసిగాఁబోరిమాకిమ్మురాజుఁగొనుము॥
క॥ వావుడునంత్యజుఁడిట్లను। నీవడిగినవిత్తమెల్ల నేనీకిత్తున్। వేవేగయడుగుతిరుగ
క। యోవడుగజనించెశంకయొకఁటి నాకున్॥ క॥ తనదేశంబెడఁబాయక। జను
లెఱుఁగఁగ నాలుబిడ్డసంసారముఁగల్గి నవానిఁగాకయొంటిరి। ననుమానములే
కనమ్మనగునేనాకున్॥ చ॥ వగలును రేయుఁదత్పరతఁ బాయక నాకుడిగంబుసే
యుచున్। దగవరివైమదాజ్ఞ గుఱిదాఁటకయుండఁగఁ బూఁటయెద్దినే। వ్వఁగ
బోరలంగనోపనోకవంక కితండుతొలంగిపోయినన్। మిగులఁబ్రమాదమౌఁ
బిదపమిన్నకయేగతివిశ్వసింపుదున్॥ వ॥ అనినఁదాపసకుమారుండమ్మహీపా
లుం గనుంగొని సీవింమాతంగునకు సమ్మతంబగునట్లుగా నమ్మబలికి మాధనం
బుసమస్తంబునుద్వరితంబ తెప్పించి యిప్పింపవలయునని బహువిధంబులమనం
బునొవ్వం బలికి సేవ్వగం బెట్టునవ్వాడుగునిష్ఠురకృత్యంబులకుం గలంగి హరిశ్చం
ద్రుఁడెవ్విధంబుననైన నబూని యీతనివిత్తంబొకకొంచిన్నంబునుం కడమకాక
యుండసమర్పించి నేటితోడన కౌశికునిమాయాపయోరాశియుత్తరింతునని ని
శ్చయించి వీరబాహుఁ జూచి యిట్లనియె॥ క॥ నామీఁదనవిశ్వాసం। బేమిటికి ననుమా
నముడుగుమేసూనృతవా। చామహినిల్వఁగోరిథ। రామరునకుదక్కి నాఁడన
మ్ముఁడుపోవన్॥ క॥ జననీజనకులుసత్యం। బును సుజ్ఞానంబు వినయమును ధైర్యం
బున్। దసయుఁడుమిత్రుండును నా। కను జెదు సుకృతంబు శాంతియాలుదలంపన్॥
ఉ॥ వాసరవల్లభాన్వయుఁడ వర్జితదోషుఁడ సార్వభౌముఁడన్। భాసురసూ
నృతప్రతిభఁ బాయఁగఁ జాలక చేరినీకు నే। దాసుడనయ్యెదన్ వినుముతప్పనిమా
టయ నాకుఁ బూఁటయీ। భాసురబాలకాగ్రణికిఁ బొందుగ నిమ్ముఘనమ్ముస
ర్వముల్॥ చ॥ హృదయములోపలన్ గపటమించుకయేనియునిల్ప కెంతయున్।
సదమలభక్తియుక్తి నిశంబును బాయక నీదుసేవ సే। యుదుమఱిసేయకుండిన
మసెబాగ్రతనాదుశిరంబు ద్రుంచినీ। పదములమీఁదనిల్పెదను బాలసుధాకరమౌ
ళిసాక్షిగన్॥ వ॥ అనియమ్మహీపతియతుల ప్రతిజ్ఞావచనంబులు పలుకుటయు
విశ్వసించి వీరబాహుండు నిజానుచరవ్యూహంబుచేత నగణితంబు ధనంబు దె
ప్పించియమ్మునికుమారుసమ్ముఖంబున॥ ఆ॥ కొండపొడవుగాఁగఁ గొనకొని। పో



గుపో। యించిప్రియమెలర్పనిచ్చి వినతుఁ డగుచు నరుగుఁడనిన నగుఁగాకయను
చు నై। కొని మునీంద్రసుతుఁడు కుతుకమొదవ॥ వ॥ సంకల్పసిద్ధియగుంగాకయని ప్రి
యపూర్వకంబుగా నాశీర్వదించి చనియె అనిన గౌంతేయాగ్రజుం డటమీఁది వృ
త్తాంతంబ ఱింగింపుమనుటయు॥ శా॥ సాధుస్తుత్యచరిత్ర బంధుజనతాస్వర్యాభ్ర
జగాంభీర్యవాః శ్లాఘుర్యాధరితామృతాంబునిధి నైర్మల్యోర్మి సంఘాతది- క్సౌధ
వ్రాతసుధాయితోజ్జ్వలయశస్సౌభాగ్యయోగ్యక్రియా। బోధానందమయాం
తరంగపురజిత్పూజాకళాకుంభజా॥ క॥ వ్రతియతిజనసంరక్షా। చతురమనీషా
విశేషసాగరతనయా- సతతావాసీకృతదృ। క్కృతపత్త్రయమిత్రజైత్రశౌర్యాటో
పా॥ వనమయూరవృత్తము॥ ఉల్లసితకీర్తిమహిమోన్నతదివాక। స్తల్లజమహావి
భవధర్మగుణభాషా- వల్లభసుధామధురవాక్చతురయూథా। కెల్లనృపాల
సచివేంద్రరుచిచంద్రా॥ ... ... ... ... ✻

గద్య. ఇది శ్రీమదాపస్తంబసూత్ర పవిత్ర కౌండిన్యముని చక్రవర్తి గోత్ర సకలసుకవిజనానీకమిత్ర దేచనామాత్యకుమార వినయవివేకవిద్యాలంకార శంకరకవినామధేయప్రణీతంబైన హరిశ్చంద్రోపాఖ్యానంబను మహాప్రబంధంబునందు చతుర్థాశ్వాసము. ... ... ✻

శ్రీరస్తు.

హరిశ్చంద్రోపాఖ్యానము - పంచమాశ్వాసము.

శ్రీరూపధృతివితీర్ణ। స్మారితవారిరుహనాభశంబరవిద్మ- ణ్మేరునిశా
వల్లభయూ। ధూ కెల్లామాత్యబుధపయోజాదిత్యా॥ వ॥ ఆకర్ణింపుమప్పాండవా
గ్రజునకుమార్కండేయుండిట్లనియెనట్లాశీర్వదించినతపుత్రకుండమ్మహీకళత్రుని
నిం జూచి॥ తే॥ ఇనకులాధీశనీవుమాకియ్యకొనిన। విత్తమంతయు నేఁడుప్రవేశమ
య్యె- శంకరుఁడువిశ్వనాథుండుసాక్షిగాఁగ। నిలుపుకొంటివిసత్యంబునిత్యముగ
ను॥ క॥ అనిహస్తాహస్తంబొ। ప్పనచేసెమహీశువీరబాహునకుఁదనూ। జనితా
తిహేయకారణ। ఘనదుర్గంధాత్తమక్షికావ్యూహునకున్॥ సీ॥ ఆసమయంబున
నాకాశపథమునవసియించి సర్వగీర్వాణవరులు। కరుణాకటాక్షవీక్షణముల
జూచుచునత్యంతవాత్సల్యమంకురింపఁ- జండాలగృహమునసుండునన్నాళ్ళకు
నాకలిదప్పులులేకయుండ। శీఘ్రంబచండాలసేవానివృత్తిగావరములిచ్చిరిమ
హీవల్లభునకు॥ తే॥ నంతనిజమందిరమ్మునకరుగఁదలఁచి। వీరబాహుండుకడున్న

హంకారలీల- మదముకన్నులనిండారఁబొదివికొనఁగ। క్షత్త్రకులపుంగవునియెడ
శంకలేక ॥క॥ తనచేతిమాంసభారం। బునుమదిపూర్ణకలశమునుజతనమునం-గొ
నిరమ్మనియెదలించుచుఁ। గనుఁగొనిధరణికళత్రుకరమునకిచ్చెన్॥ వ॥ ఇచ్చినంబు
చ్చుకొనిపారపొచ్చెంబులేనిమచ్చికందరణికులపుంగవుండంతరంగంబుననొక్కిం
తహేయతంబొందకలజ్జింపక వానిపజ్జనతదీయపూర్వకింకరులంగూడిచనిచని
ముందట॥ సీ॥ బహువిధపశుకళేబరసమాకీర్ణంబుదుర్గంధలహరికాసర్గళంబు। ప
లలభక్షణకుతూహలసారమేయంబు కాకగృధ్రానీకకలకలంబు- మక్షికాచ్ఛా
దితమాంసతోరణరాజివత్సరాస్తరణార్ద్రచర్మపటలి । ప్రబలవిట్చరఘుర్ఘు
రధ్వానపూర్ణాంబుసవిధక్షమాభాగసంభృతాస్థి॥ తే॥ వారుణీపానకృత్యదు
ర్వారజనిత। మదభరాలసచండాలమండలేత- రేతరానర్థకలహసంజాతరవ
ము। గనియెమాతంగవాటముమనుజవిభుఁడు॥ చ॥ కనుఁగొనిచొచ్చిధైర్యగుణగౌ
రవముత్ప్రెదరంగనీకనె। మ్మనముననేవగింపకక్రమంబుననంత్యజునింటికేగివాఁ-
డనుదినమున్నదోద్ధతినహంకృతిఁజెప్పెడినట్టికష్టపుం। బనులొడఁగూడఁజేయు
చునుబాధవసత్తముఁడుండెభృత్యుఁడై॥ వ॥ వీరబాహుండునుప్రతిదినంబును
గృతాపరాధంబులెన్నుచునొకయుపాయంబుంగాంచి సూనృతజ్ఞానంబువద
లవీనిప్రతిజ్ఞాభంగంబుగావించి గాధినందనునకుమనస్సంతోషంబొనర్తుననినిశ్చ
యించియొక్క-నాఁటినిశాసమయంబునసద్వారుణీపతియూరుపీఠంబునఁజరణం
బులుచేర్చిననతండంతఃకరణంబునభక్తినివ్వటిల్లఁబదంబులొత్తుచున్నముదంబు
నంగనుంగొని॥ తే॥ ఓరినీమీఁదవిశ్వాసమొదవెనాకు। నేనొనర్చుప్రయోజనంబీ
వుసేయు- నేఁడుమొదలుగనాయాజ్ఞవాఁడవగుచు। వినుడుచెప్పెదనీకుఁదద్విధ
ముదెలియ॥ క॥ ఈపేటిపరేతక్షితి। నావశమైయుండుఁగొన్నినాళ్లుగఁబ్రీతి-నీవ
చటియాధిపత్యము। లేవంగైకొనుముసంఘటితకార్యుఁడవై॥ గీ॥ వినుముసీనామ
ధేయంబువీరదాసు। వదలకేఁదాల్చునీముద్రగుదియఁబూను-మనుచుఁదనచేతి
కిచ్చిననాదరమునఁ। బుచ్చుకొనివేడ్క-రంజిల్లవచ్చియెదుర॥ వ॥ అత్యంతభయం
కరంబగుపరేతనికేతనంబువిలోకించి కించిన్మాత్రంబునుజిత్తంబునభీతిల్లకప్రవే
శించియమ్మహావల్లభుండహీనధైర్యంబుననిజకృపాణపరిభావిభాసమానుండై
నానాభూతవ్రాతంబులంగూఁతలిడంబట్టికొట్టియిట్లనియె॥ సీ॥ అనుదినంబును
మీరలత్యంతసంభ్రమంబుననేగివీరబాహునిగృహమునఁ। బగలెల్లనుడిగపుఁబ
నులుసేయుచురాత్రిఁగడఁకనీభవభూమిఁగాచికొనుచు- నస్మదీయంబైనయా
జ్ఞనుల్లంఘించినఁడచిక్కరేనిదండనమొనర్తు। నిన్నాళ్లవలెనుగాదింతటనుండియు
మీకువిచ్చలవిడిమెలఁగరాదు॥ తే॥ హీనకులుఁడనియనకమదీశ్వరునకు। నాయు



రారోగ్యపుత్రపౌత్త్రాభివృద్ధి-మించునట్లుగనాశీర్వదించిరండు। మోదమునబ్రి
హ్మరాక్షసముఖ్యులార॥ వ॥ అనియిత్తెఱంగునభూతసంచయంబులనియమించిన
మీఁదవర్తియుసమున్నతమూర్తియునగునొక్క-భేతాళునింబిలిచినీవింకమదీయ
కింకరుండవై యుచ్చాటనొక్క-మంచెపెట్టించుమనుటయునట్లకాకయనికృతన
మస్కారుండై యతండరిగి యతిత్వరితంబున సముత్తుంగమ్మృణ్మయవేదికాబంధు
రంబునుఘనశిలాస్తంభసంభృతంబునుంగామంచెగల్పించివిచ్చేయుండనివిన్న
వింపనప్పంచజనాగ్రగణ్యుఁడిష్టంబుచెప్పైనిలిచివిపక్షహరణదక్షంబగునిజభుజా
కౌక్షేయకంబుసహాయంబుగామహాశౌర్యంబునఁగావలియుండెనంతనక్కడ॥
సీ॥ అతిధైర్యమతియగునాచంద్రమతియును సర్వంసహాసుధాశేసునియింట।
హంసనారియనెడునభిధానమువహించిదాసియై తొంటివిలాసమెడలి- చెంది
నవగనుదాసీనకృత్యంబులనత్యంతదీనతయావహిల్లి। తనలోనఁబలుమాఱుదై
వంబుదూఱుచుఁగొడుకునుదానునునిదుమబడలి॥ తే॥ పొడమునాఁకలిడప్పలక
డచిపడక। కలహకంటకిమనసురామెలఁగుచుండ-నరిగద్వాదశమాసంబులంత
నొక్క। నాడువిప్రుండురాజనందనునిఁజూచి॥ సీ॥ ఓరోరిలోహితయీరీతిరేయు
నుబగలునుబానిసఁబాసిరాక। యేపనిచేయకయిట్టుండెదవునిన్నుఁగనుఁగొన్నఁ
గోపంబుగదురకున్నె-యనిచిన్నకూఁకటిఁబెనఁచినజడపట్టిగుంజియీడిచిచెం
పఁగొట్టితిట్టి। నేఁడుమొదలుగాఁగనీవింకనిత్యంబునీయీడువడుగులనెమ్మిఁగూ
డి॥ తే॥ యర్కుఁడుదయించుతఱినరణ్యమునకరిగి। కుశసమిత్పర్ణఫలములుగొంచు
రమ్ము-కడుప్రయత్నముతోననినుడువుటయును। దైన్యమునఁబొందియేడ్చుచుఁద
ల్లిఁగదిసి॥ చ॥ కనుఁగవబాష్పబిందువులుగ్రమ్మఁబదంబులమీఁదవ్రాలుచుం। దనుఁగి
నుకన్మహీసురుఁడదల్చినినిష్ఠురభాషలెల్లఁజె - ప్పినవినియాత్మలోనఁగడుభీతివ
హించుచునార్తనాదయై। తనయునిజంకఁబెట్టుకొనితామరసాననచింతనొం
దుచున్॥ చ॥ అకటకటావిహీనదయనర్భకునిన్నునుజూచికాలకౌ। శికునకురో
షభంగిబనిచెప్పఁగనేగతిజిహ్వయాడెఁగా- వకునిపుడీవుపోయినమనంబునధై
ర్యమునిల్పనేర్తునే। వికచపయోజతుల్యముఖవిభ్రమభానుసమప్రభానిధీ॥ క॥ జన
పాలతనయులెంతయు। వినయంబునజేరికొల్వవిహరించెడునీ-కనయమునొక
విప్రాధముకినుకకులోపడఁగవలసెఁగింకరవృత్తిన్॥ సీ॥ అనపాయభాగ్యరే
ఖాన్వితస్మైనట్టిరాజముఖీశిరోరత్నమునకుఁ। బుట్టకప్రాతరంభోజబాంధవ
తేజపట్టినాకేటికిఁబుట్టితయ్యా- నిమిషార్ధమైననునినుఁబాసిమదిలోనఁదాలిమిని
లుపంగఁజాలనేను। వనమునకేగతిఁబనుపుదుఁగౌశికుమాయనింకేమియుఁజే
యఁగలదొ॥ తే॥ యరయనిదియెంతపనియైననయ్యెఁగాని। యోసరిలవచ్చునేమన

కొడయఁడైన - బ్రాహ్మణుఁడు కోరి చెప్పిన పనులకెల్లఁ బూని వేగంబ యరుగక
మానరాదు॥ వ॥ అనియత్యంతచింతాభరంబునం జెందియప్పురంధ్రీరత్నంబతి
ప్రయత్నంబున సకలదేవతాప్రార్థనంబునం జేసి వియచ్చరనిశాటపన్నగభూత
దుష్టమృగపక్షివ్రాతంబులవలనం గుమారునకుఁ బ్రాణభయంబొదవకుండున
ట్లుగా నాశీర్వదించి యభిమంత్రించి దక్షిణకరంబున నొక్క రక్షాబంధనంబొన
ర్చియనుపుటయుఁ గాననంబునకు నమ్మానవతీసూనుండరుగ నుద్యోగించుసమ
యంబున॥ సీ॥ చలముకోపము మానసంబులో దళముగా గాధినందనుఁ డహంకా
రలీలఁ దనమంత్రసామర్థ్యమునఁ దక్షకాఖ్యపన్నగరాజు నాకర్షణంబు చేసి - ద
క్షణమె నీవు తక్షక మాకొక్క హితకార్య మొనరింపు మతిశయముగ । సార్వభౌ
ముఁడు హరిశ్చంద్రుఁడరుంధతీపతిపూనిక - యీడేర్ప మతిఁ దలంచి॥ తే॥ విదితస
త్యంబు నిర్వహించెదనటంచుఁ బ్రతినపట్టుకయున్నాఁడు ధృతిదలిర్ప । నతని ననృ
తంబులాడింప ననువుపడక । వెరపు వెదకుచున్నాఁడ వినుము నేను॥ చ॥ బహువి
ధమాయలెన్నెడలఁ బన్నియసూనవిపత్పరంపరా । సహితునిఁ జేసి ధైర్యగుణసా
హసముల్ తూలఁగఁ జేసియా - మిహిరకులేంద్రు వాక్యములు మిథ్యలు సేయఁగఁ
బూనినాఁడనో । యహివర నాకు నిప్పుడు సహాయముగా వలయుఁ బ్రియంబు
నన్॥ క॥ భవదీయవిషాగ్నులచే । నవనీధ్రములైనఁ బగులు నారసిచూడన్ - భువి
లోపలఁ దక్షక నరా । నవులకు నిలువంగవశమె నాగకులేంద్రా॥ ఉ॥ కావున నామనః
ప్రియముగా నతివేగమ నీవు పోయిత । ద్మావరపుత్రునిన్విపినభూమికిఁ బోయిన
లోహితాస్యునిన్ । జీవముపోవునట్లుగన శేషవిషానలభూత్కృతిస్ఫుటా - రావ
మహోగ్రతం గఱచి రమ్మని పంచినఁ దక్షకాహియున్॥ సీ॥ పనిఁ బూని యప్పుడచ
నియల్ల పితృవనసీమాసమీపంబు చెఱువుపొంత । వటమహీరుహమున వల్మీకరం
ధ్రంబు శీఘ్రంబ తాఁ బ్రవేశించియుండఁ । దదనుకూలముగాఁగఁ దనశిష్యవితతుల
బోధించి పలికెన గ్గాధిసుతుఁడు । వటుశిఖామణులార వారక మీరేగి నృపకుమా
రునిఁ గూడి విపినభూమిఁ॥ తే॥ గలయఁ జరియించి వానినేకరణినైన । బూని ప్రేరేఁ
చి తోడ్కొనిపోయి తక్షు । కాహివల్లభుక్రూరవిషాగ్నిశిఖల । పాలుగాఁ ద్రోచి రఁ
డని పనుచుటయును॥ వ॥ అత్యంతరయంబునం జని లోహితాస్యునిం గనుంగొని॥
ఉ॥ ఓ నృపపుత్ర మద్గురుని యోగమునం జని మేము నిత్యముం । గాననభూములన్వల
యు కాయలు పండ్లు నుదర్భలిధ్మములన్ । మానుగఁ గోసి తెత్తుము క్రమంబున నీవును
మమ్ముఁ గూడి రమ్మా నిఖిలంబు చూపెదము మక్కువతోడుత వానియిక్కువల్॥ వ॥ అని
యొడంబఱచి యమ్మహీవరకుమారునిం దోడ్కొని చని కాననమార్గంబుల దఱిసి
తత్ప్రదేశంబులఁ గొంతసేపు మనోహరవిహారంబులు సలిపి వివిధమధురఫలంబు



లుదర్భలు నిధ్మంబులు తృణంబులునుం గోసి మోపుకట్టి శిరంబునం బెట్టి చనుమనుట
యు॥ చ॥ పొడవగు డప్పి చే మిగులఁ బొల్పఱి కుత్తుక యెండుచుండఁ బెల్లిదుగ కఘ
ర్మబిందుతతులొక్కట మోమున నంకురింపఁగా - వడఁకుచుఁ జిన్ని చూఁచుఁ జెలువం
జెడలంగఁ బదాంబుజాతము । లొడఁబడ దేహమంతయుఁ గళంకమునొందుచు
ఘూర్ణిల్లుచుంగఁగన్॥ సీ॥ నడచి బిట్టలసున్నఁగమున్న యావట్టి మొదలనాయ్యనతల
మోపుఁ జేర్చి । డప్పికిఁ జటితతటాకతోయంబులు గ్రోలి రాకొమరుండు కొంతపడ
వు తద్వటచ్ఛాయ నిద్రాముద్రితాత్ముఁడై పవళించి సహచరబ్రహ్మచారు । లెఱిఁ
గింప మేల్కని యుండఁ గమఱచితిననుచు నాకులు గోయు ననువు వెదకి॥ తే॥ యొ
క్క పాదంబు పుట్టపై నునిచి యొండు । పాదమవనీరుహంబుపై నూఁది త్రొక్కి
క్రిందికొమ్మకు మెల్లన కేలు చాఁచి । యందికొని కోయఁ బూనున య్యవసరమున॥
మ॥ ప్రళయారంభకృతాంతభీకరకరగాఢస్థూలపాశంబుతో । దుఱమాఁగఁగ
లయాకృతిం బొదివి వాతూలాశనస్వామి నా - ల్కలు వెల్లార్చుచుఁ బుట్టలో వెడలి
యుగ్రస్ఫూర్తిమైఁ గోపమ । గ్గలమై పర్వఁగ రాసుతుం గఱిచె భూతాకారంబు
ఘోరంబుగన్॥ ఉ॥ భూతలనాథనందనుఁడు భూరివిషానలకీలలుబ్బ సం । జాత
శరీరవేదనకుఁ జాలక ధారుణిమీఁద వ్రాలి లా - లాతతి నోరఁ గ్రమ్మ మిగులన్ స్మర
ణాతతమూర్ఛనొందెహా । మాతయటంచుఁ దత్క్షణమ మఱ్ఱియురూపజినైనని
యంబునన్॥ చ॥ నిజవిషవహ్నిచేత నవనీధ్రములైన ననునీఱు సేయు నా । భుజగవి
భుండు ఘోరమణుపుత్రు నిజంపఁగ నోపఁడయ్యెం బకజనయనాశిరోమణియు
గల్మషదూరయు నైధరిత్రిపై - సుజనతఁ గన్న కజ్జన నిశుద్ధపవిత్రచరిత్రమెట్టి
దో॥ వ॥ ఇవ్విధంబున మూర్ఛిల్లిన మహీవల్లభతనయునిం గనుంగొని యక్కుమా
మారులు మహాద్భుతంబునం బొంది॥ ఉ॥ ఈ వసుధేశనందనుఁ డహీంద్రమహావి
షవహ్నికీలలన్ । జీవములందొఱంగక విచిత్రగతి స్థలంబు మ్రింగి మూ । ర్ఛావ
శుఁడైన హేమగిరిచావునిమోపుననున్నవాఁడు మై । చేవయు మోము కాంతియుఁ
నుఁ జెన్నుఱియుండదొకించుకేనియున్॥ తే॥ రాజువాఱడు చరణపంకజయుగం
బు హస్తతలముల కెంజాయలడఁగిపోవు । కాదు వేఱొక్క రూపంబు కన్నుదో
యి । యొడలిలోఁ బ్రాణము బుదాఁగియుండబోలు॥ తే॥ కొడుకువలకేలనెంత
యుఁ గుశలనియతి । యమరనీరక్షగ జైడు సమయమునను - దెలివినేమని యాశీ
ర్వదించినదియో । తల్లిలోకైకవినుత కాంతామతల్లి॥ వ॥ అనియతిత్వరితంబునం
బురంబునకుం జని మిథ్యాతర్కరవంబున నవ్వాతర్కమార్తాండకుల చక్రవర్తిదే
వికిం దెలియ నెఱింగించుటయు నమ్మొత్తుంగుఁ బోఁడి కాదంబినీగర్జానినాదంబు
విన్నమరాళియు నిషాదకోదండమౌర్వీనాదంబు వినిన సారంగియు దాశరథి

శాపాత్కురరవంబువినిన పికాంగనయు బిడాలరవంబువినిన బాలశుకియుఁగం
రీరవంబుకంఠశబ్దంబువినిన కరిణియునుంబోలె నుల్లంబునఁదల్లడిల్లి హాకుమా
రయనిఖండిత కదళీతరుకాండంబుచందంబున మహీతలంబునకువ్రాలిమూర్ఛి
ల్లికొండొకసేపు చేష్టావిహీనయై యుండి యెట్టకేలకుం దెలిసి బెట్టువగంబొం
దిబాష్పజలధారాపూరంబులఁ బాలిండ్లుతొప్పఁదోఁగ నేడ్చుచుఁదనలోనిట్లని
యె॥ తే॥ అకటకటాలోహితాస్యబాలార్కతేజ। ఘోరశోకంబుచేనన్నుఁగుం
దఁజేసి - తేమిసేయుదునాకుదిక్కెవ్వరింక। నెట్లునినుఁబాపెవిధికృపయింతలే
క॥ క॥ పతిఁబాసియునీకతమున। మతిలోదుఃఖంబులెల్లమానిచరింతున్ - ధృతి
యాత్మనిలిపియిఁకనే। గతిఁగడతున్ శోకవార్ధిఁకడముట్టంగన్॥ క॥ భీకరపూ
త్కారంబున। నాకాకోదరముఁగఱియునప్పుడుమదిలో - నేకరణిఁదల్లడించితొ।
శాకానీహారకిరణరమ్యశరీరా॥ వ॥ అనిశోకించునమ్మహీకాంతుకాంతపయిం
గినిసివిప్రవనితయిట్లనియె॥ తే॥ తొలుతఁబుత్రునినెచటికోతొలఁగఁబెట్టి। యడ
విలోఁబాము మూర్ఖొన్నదంచుమొఱఁగి - కల్లయేడుపులేడ్చుచుఁగపటవృ
త్తి। వెదకిసందునసురుగఁజూచెదవునీవు॥ క॥ నాముందఱనెటకరిగెద। వీమాయ
లుమాకుఁదెలియునిన్నియునినునే - నేమఱుదునెనీకంటెను। నేమించినజాణసు
మ్మునెలఁతలలోనన్॥ తే॥ కొడుకుఁబలుమాఱుఁదలచుచునుడుగకిట్లు। మిగుల
శోకంబుఁబొందుచుమిన్నకున్న - నీవుగావించుపనులెల్లనెవ్వరింక। జేయువార
లురారమ్మశీఘ్రముగను॥ వ॥ అనియిత్తెఱంగునంబరుషంబులగు దురాలాపం
బులుపలుకు నక్కాలకౌశికునియాలింగనుంగొనియాలీలావతియాఱనిదుఃఖం
బులోలోనడంచుచు॥ సీ॥ అమ్మయీవేళనన్నుకంపఁబూడంగఁదగుజిత్తమున
నొందుతలఁపుమాని। నాకుమారుఁడుకాననంబులోవిషమెక్కి - యేరీతినున్నాఁ
డోయెఱుఁగరాదు - తెప్పించియౌషధంబిప్పించిపుత్రదానము సేయవలయు
బుణ్యంబుమీకు। నని వేఁడికొనుచుదైన్యంబుననడుగులపైఁవ్రాలిలేవకపలువరిం
పఁ॥ తే॥ గొంతకనికరమాత్మనంకురమునొందఁ। గలహకంటకియిల్లాసికలు
వకంటి - తలపదంబుననొక్కింతతొలఁగఁద్రోచి। పలికెఁగడుఁకఠోరసంభా
షణముల॥ ఉ॥ బాలురయేడ్పుమాన్పుటకుఁ బండులుదమ్మనిపంచినమ్మహా।
భీలభుజంగసంఘములువెల్లిగనుండెడుపుట్టలెక్కఁగా - నేలభవత్తనూజునకు
నేమొనరించినయట్టిదేమియా। పాళిముదప్పఁగ్రొవ్వినయభాగ్యులకూరకయే
డ్వవచ్చునే॥ తే॥ ఒడలెఱుంగకతినిమసరుతిర్కివాఁడు। కాపరముపట్టియున్నాఁడు
గాకపుట్ట - లెక్కఁబోవంగనేటికినింతలోన। నట్లుకాఁదగువానికినడలనేల॥ తే॥
కాననంబులఁబుట్టలలోనఁదిరుగు। పన్నగంబులకెలవాగ్బంధనమ్ము - సేయఁద



గుమాకునిదిమేముచేసినట్టి। తప్పులోగొమ్మమాయమ్మదయదలిర్ప॥ చ॥ పలుమ
ఱునేమిపల్కిలిఁకఁబల్కకమిన్నకయేగుదెంచినీ। యలఁపడఁజేయునట్టిపను
లన్నియునుంగొఱగాకయుండని - శ్చలమతితోడఁజేసి మఱిసత్తుగనీసుతువా
ర్తన్ యంతయుం। దెలియుముపోయిననావుడుసతీతిలకంబతిశోకచిత్తయై॥ సీ॥
మఱియేమియునుమాఱుమాటలుపల్కంగలేకధీరతనట్లకాకయనుచు। బాము
లబడిసందెజాముపోయినదాకవరవృదుపనులుసర్వంబుఁదీర్చి। యలసియువి
సువకయరుదెంచిభక్తిమైనొఝ్యనచరణంబులొత్తుచుండ - బెట్టుగఁబలుమా
రునిట్టూర్పులిచ్చుచుభీకరంబుగగుఱుపెట్టుకొనుచు॥ తే॥ జెమటచేనవయవము
లుచెమ్మగిలఁగ। దఱుచుదుస్స్వప్నములమతితడబడంగ - గలవరించుచునొడలె
ఱుంగకసొలవుల। జొల్లుకాఱంగబ్రాహ్మణిసుప్తిఁబొందె॥ వ॥ అప్పుడప్పల్లనా
థచరణంబులు చప్పుడుగాకయుండఁగదలి సదనంబువెలువడినిజహృదయా
భ్యంతరంబునంబొదలుశోకధ్వాంతంబునకుఁ దోడుబాహ్యతిమిరంబసహ్యాం
బైపొదివికొనబ్రహ్మచారులుచెప్పినచొప్పునఁ బతిభక్తిమేతనకుసహాయంబు
గామహాధైర్యంబునంజని వటభస్మపుంజంబునకైచరణంబులువల్మీకంబునకైశి
రంబునుంగావసుంధరంబడికించిమూర్ఛిలితనయునుండై విచారదూరమానసుం
డైయూరకమున్నునిద్రించువిధంబుననున్నగారాబుకుమారుఁలోహితాస్యుంగ
నుంగొని॥ తే॥ తరుణియోర్వంగఁజాలకతత్క్షణంబ। ధరణిపైఁబడిమూర్ఛిల్లి దేర్చ
మూఁడి - కొంతవడికింతఁదెలిసినిజాంతరంగ। భరితశోకాగ్నికీలలుప్రజ్వరిల్ల॥
ఉ॥ హాసుకుమారహావరగుణాకరహాచిరపుణ్యశీలహా। వాసరవల్లభప్రకటవం
శమనోహరశుక్తిమౌక్తికా - హాసరసీరుహారిసదృశాంగవిభాసితలోహితా
స్యనిన్। బాసిచరింపనోపననుబాయఁగఁబాడియెనీకునక్కటా॥ సీ॥ మొలకనవ్వ
లనునుముద్దులనీమోముగూమిఁగొట్టింపఁగన్గొనకయున్న। నమృతంబుచిల్కునీ
విమలవాక్యంబులువీనులుచల్లగావినకయున్న - సంపూర్ణపూర్ణిమాశశిఁబోలు
నీమేనుచెలువారగౌఁగిటఁజేర్పకున్న। నిరుపమానమునైననీచిన్నిచెక్కిలుప్రేమ
తోఁగదిసిచుంబింపకున్న॥ తే॥ నిమిషమాత్రంబుప్రాణముల్నిలుపఁజాల। నేనుజ
నుఁదెంతునేటబోయితేతనూజ - చేరినాతోడనొకమాటచెప్పవయ్య। పలుమఱు
నునిన్నుఁబిలువంగఁబలుకవేల॥ క॥ రాహుగ్రహముఖకబళిత। నీహారమరీచికరణి
నీవదనముక్రూరాహీంద్రవిషానలకీలాహతిచేఁజెలుపుదఱిగెననుఁగుగుమా
రా॥ ఉ॥ బాలికలూఁచుచుంగదిసిపాడఁగమేడలలోనరత్నశో। భాలలితంపుఁటు
య్యాలలపైసుఖముండెడునీవునేడుహా - నేలనరణ్యమధ్యముననిశ్చలలీలలనిద్రఁ
బోయెదా। భీలసృగాలరావములుపెల్లుగనెల్లెడనుప్పతిల్లఁగన్॥ వ॥ అనితనూభ

ఘనింబాయెఁ జాలక మోహపరవశత్వంబున నకుంఠనం జేర్చి పేర్చు శోకోద్రేకంబు
నం గటిచిన కాకోదరంబుం దలంచి॥ ఆ॥ వక్రగతిని యెప్పుడు వర్తించు రంధ్రము
ల్। వెదకుచుండు మిగుల విషము గురియు - నోరపడగఁ బెట్టు నోయన్న యేమందుఁ-
జిట్టు బుస్సుమనెడి చెడుగుఁ బురుగు॥ క॥ ఏమందు నిన్ను లోహిత। యేమందుల మా
నునందు నిఁక నెవ్వరితో - నేసుందు నిన్నుఁ గటిచిన। పాపం జేకూడియుండె బాప
పువిధియుక్॥ వ॥ అనియక్షుంభీనసంబును పలంభించి యారంభోరు వుహృదయాం
భోరుహంబుం దనకుం దాన యూరడించుకొని ధైర్యవివేకంబుల నలవరించి యిం
కపీనికిం బుణ్యలోకప్రాప్తి యగునట్లుగా నుచితసంస్కారంబు లొనర్చి కలహ
కంఠికి మేలొక్కనకమున్న రయంబున నంజని సముచితకృత్యంబు లొనర్పం దగు ని
చ్చోట నాలస్యంబు గర్తవ్యంబు గాదని పట్టిం దనమూఁపునం బొట్టుకొని కొంత
దవ్వు చని పరేతనికేతనంబుం బ్రవేశించి యందు భూతప్రేతపిశాచశాకినీఢాకినీ
బేతాళకలకలస్వరంబుల నతిభయంకరంబౌ దవ నా రుద్రభూమిం దన పాతివ్రత్య
ధైర్యంబులు సహాయంబులుగాఁ బుత్రుని డించి దందహ్యమానంబులైన శుష్కకా
ష్ఠంబులు కొన్ని గూర్చి పుత్రునందు నిడియింగలంబు తగుల్పం బూని పూనలేక శో
కావేశంబున నిట్లనియె॥ సీ॥ హా తామహాలంపను మాతామహీయుఁ జేయు గా
రాముగైకొనఁగాన వైతి। వానందమున నెత్తియమిలి ముద్దాడు మేనమామల
మేలుగాన వైతి - గరిమన కుర్కనఁ జేర్చి శిరము మూర్కొను తండ్రి కౌఁగిట మెలఁగం
గఁగాన వైతి। వుత్సంగమున నమించి వాత్సల్యమున దాది సైసేయు మోహంబుగా
న వైతి॥ తే॥ పరిజనంబులు సఖులును బ్రమద మెసఁగఁ। బూని యొనరించు ప్రియము
లుగాన వైతి - చుట్టముల కెల్ల వెలివడినట్టు పడిన। నాకు జనియించి యిట్లయితి వేసు
మార॥ తే॥ ఇవ్వసుంధర లోపల నెన్నఁదగిన। భాగ్యసౌభాగ్యవతులైన పడఁతు
లుండ - సకలదుర్లక్షణములకు సదనమైన। నాకు నేటికిఁ బుట్టితె యో కుమార॥ వ॥ అ
నియు త్తైలంగున॥ ఉ॥ పంచమనాదయుక్తింబిక భామిని గూయు తెఱంగు దోపనా।
చంచలనేత్ర హస్తజలజంబులు మోమునఁ జేర్చి యేడ్చె నేత్రాంచల బాష్పబిందు
నివహంబుల దోఁగు నురోజకుంభము। ల్మంచున దోఁగు పద్మముకుళంబులతో డుత
జెన్నుసేయఁగన్॥ వ॥ అయ్యార్తరవంబు విని హరిశ్చంద్రుండు మహాశ్చర్యంబునం
బొంది యీయర్ధరాత్రం బిచ్చట నేకతంబ శోకించు వనితా నిస్స్వనంబు వినంబడియె
నిస్సందేహంబుగాఁ గనుంగొనవలయునని ముద్రగుదియ భుజంబునం బూని కర
ఖడ్గంబు కటిబద్ధాంబరంబునఁ గీలించి కులకుధరశిఖరంబుననుండి మహీమండలం
బులకు లంఘించు పంచాననంబునుం బోలె నా రాజపంచాననంబు మంచెపైనుండి
వసుంధర కవతరించి మెల్లన చనుదెంచి॥ సీ॥ నిబిడశోకారుణనేత్రకోణంబుల బలు



మాఱు దొరఁగెడు బాష్పములను। జక్కుపైఁ జేర్చిన చిగురుకెంగేలును వట్టిపోయి
నయట్టి వాతెఱయును। వేఁడిమైఁ బలుమాఱు వెడలు నిట్టూర్పులు గొదకొని వ్రేళ్ళ
డుకుత్తుకయును। గఱఁ జెక్కు చీఱుగా విడిన క్రొమ్ముడియును నవనిరజోలిప్తమైన
మేనుం॥ తే॥ దొలఁగిపోయిన చనుకప్పు మలినపటము। మిగుల వాడిన మోముఁ దమ్మి
యును గలిగి। దీనదశనున్న చంద్రమతీపురంధ్రి। కట్టెదుర నిల్చె నత్యంతకరుణవొద
ల॥ చ॥ నిలిచిన భీతియున్న వడఁకుని వ్వెఱపాటును భూరిలజ్జయుం। గళవళమున్న జింప
నధికంబగు శోకముఁ బొంది కుందుచుం। దొలఁగిన పయ్యెద న్వలుదతోరపుఁ జన్ను
లు కప్పుచున్న యా। నలినదళాక్షిఁ జూచి నరనాయకవంశలలాముఁ డిట్లనున్॥ సీ॥
ఈసట్టనడురేయి యీరుద్రభూమిలోని పెనుచీఁకటి నేవిధమున। నొక్కరుండంతశం
కింపకున్న సాహసురాల వేటికి వెఱపు నీకెత్తెఱంగున। నేకారణమున నీకిట్టి దుర్దశ
వచ్చె నెఱిఁగింపవలయు మాకిప్విధంబు। నీభర్త యెవ్వఁడు నీనామ మెయ్యది యె
చ్చోట వసియింతు వెప్పుడు నీవు॥ తే॥ బాలుఁ డేటికి మృతిఁ బొందె వాలుగంటి। యని
నవదనాంబుజము వంచి యశ్రుధార। లొలుక గద్గదకంఠియై పలికె ధరణి। కాం
తుమానసమున కనుకంపవొడమ॥ ఉ॥ ఓ నరలోకవంద్య వినుమజ్జ్వలభూరికృ
పావిధేయ నే। నీ నగరంబులో నొకమహీసురపుంగవు మందిరంబునన్। దాసినై
వసింతు ననుభర్తఋణంబునకై ధనార్థినై। మానితసత్యవాజ్నియతి మానక
పోకడవెట్టెఁ దాలిమిన్॥ తే॥ నాదునామంబు వినుమంసనారిమత్తు। మారుఁ డీ
తండు భూమిబృందారకుండు। కోరి పుత్రేరఁగా సమిత్కుశఫలార్థ। మడవికేఁ
తెంచి ఫణిదష్టుఁడగుచు సిగ్గె॥ క॥ మీ రెవ్వర నఘ సత్కృప। నారని నాదుఃఖమెల్ల నడ
పఁగ మదిలోఁ। గోరి ప్రియంబు జనింపఁగఁ। జేరం జనుదెంచినట్టి సిద్ధాగ్రణివో॥
తే॥ కాకబహుభూతనివహముల్ గదిసి కొలువ। భీతిఁ బుట్టించు నేతత్పరేతభూ
మిఁ బ్రీతి విహరించుచుండెడి భూతపతివొ। యానతియ్యంగవలయు దయానిధా
న॥ చ॥ త్వరితము మత్కుమారునకు వార్యకృపన్ విషవైద్యమిచ్చి యో। చిరతరపుణ్య
క్రమ్ము జనజీవునిఁ జేసి మదీయమానసాం। బురుహము సన్మదస్ఫురణఁ బొందఁగఁ జే
యుము మహానుభావ త। త్పరమతి బుత్రదానసుకృతంబు సమస్తము నీకు గల్గెడిన్॥ వ॥
అనుటయు నమ్మందగమన ప్రియవచోవిశేషంబుల వలనం దనకులాంగన యగుట
నిక్కంబుగా మనంబునం దెలియక సందేహంబున నా రాజపురందరుండు వెండి
యుం జంద్రమతిం జూచి॥ తే॥ పంకజానన నే భూతపతియుఁ గాను। దురితహారుఁ
డైనయట్టి సిద్ధుండఁ గాను। దగిన విషవైద్యమంత్రతంత్రముల నెఱుఁగ। బాలుప్రా
ణంబు మగిడింపఁ జాల నేను॥ సీ॥ వనజాక్షి యిప్పరేతనికేతనక్షోణి తనగుత్తగాఁ జే
సికొని వసించు। చండాలకులపాలకుండు నా యేలిక వీరబాహుండను పేరివాఁడు।

సదయుఁడై యీముద్రగుదియ నాచేతికి నిచ్చి యాతఁడు నన్ను నిచటనుండఁ బని
చిన నుండుదు భక్తియుక్తిం గదదాజ్ఞాయత్తచిత్తుండ నగుచు నెపుడు॥ తే॥ వినుము నా
నామధేయంబు వీరదాసు, నేనెఱుంగక యుండంగ నీకు నీవ, సట్టినడురేయి వచ్చి
యీపట్టిఁ దెచ్చి, యిచటను నుపంగఁ బాడియే యిగురుబోఁడి॥ సీ॥ ఆఁడుదానవు
గాననను కంపజనియింపఁ బరుషోక్తులను నేమి పలుకనోడి, యూరక యుంటిఁ ద
క్కొక్కరుని నెవ్వనినైన శిరము ఖండింతుఁ గా క్షేయకమున, సొద పేర్పఁ దగునంత
చోటికి నొకమాడ తెచ్చినా కిత్తురు మచ్చకంటి, యీచొప్పదప్పక యియ్యంగవ
లయును దొరకక యుండెనే వోలఁగి పొమ్ము॥ తే॥ మాటలింకేల యిచ్చోట మసలి
తేని, యంత్యజాగ్రణిమత్స్వామియైన వీర, బాహుపదములయాన యోభామ
యనిన, మిగుల శోకంబుని గుడ నమ్మగువ పలికె॥ చ॥ పరహితమార్గవర్తన శుభం
కరన న్నొకకొంత నీదయా, సరణిఁ గనుంగొనన్వలయు సంపదగల్గిన దానివోలె
నిష్ఠురగతి మాడ వేఁడెదవు చూడఁగ నేనిరుపేదరాలనె, వ్వరు మతిదిక్కు లేరు తగి
వానను శోకపయోధి ముంపఁగన్॥ క॥ శ్రీలుగ్ దైవాఱ జలధి, వేలావలయితధరిత్రి
విమలయశుండై, యేలు నృపసూతి యడుగడు, నేలకుఁ బాత్రుండు గాఁడె నీకిటు
తగునే॥ వ॥ అనిమఱియును॥ మ॥ అకటా చేరెడు నేలకుం దగఁడె సప్తాంభోధివేష్టి
భవ, త్సకలద్వీపకలాపధూపమకుటాంచత్పద్మరాగోజ్జ్వల, ప్రకటానర్గళని
గళత్కిరణశుంభత్పాదుఁడై సట్టి రా, జకుమారుండని యేడ్చెఁ గన్నుఁగవన
శ్రులు కాల్వలై పాఱఁగన్॥ చ॥ కుదురు మెఱుంగు నిబ్బరపు గుబ్బలపైన యనాంబు
పూరముల్, చెదరఁగ నేల యేడ్చెదవు చెల్వ దురంతవిషాదవేదనా, విదళితమాన
సంబునను వేమఱు నాయువు శాశ్వతంబె సం, పదలు స్థిరంబులే విధివిపాకము వాఁ
టందరం బెయేరికిన్॥ వ॥ అనినఁ జంద్రమతి యిట్లనియె॥ ఆ॥ సుజనవినుత గోరుచుట్టు
పై రోఁకటి, పోటు దాఁకినట్లపోతలంప, మొదల శోకజలధి మునుఁగంగ నందుపై
నీవు పల్కినట్టి నిష్ఠురోక్తి॥ మత్తకోకిల॥ ఓమహాత్మక మిమ్ము చూఱఁగ యుక్తమే వివ
రింపవే, యేమి సేయుదు రయ్య మాటికి హెచ్చి కౌశికమౌనిమా, యామయంబయి
వెంట వెంటన హర్నిశంబులు బాయకు, ద్దామశక్తిని నాదు కర్మము దాయకై వ
డి నుండఁగాన్॥ వ॥ అనుటయు నవ్వాక్యంబు లాకర్ణించి హరిశ్చంద్రనృపపుంగ
వుండంతరంగంబున నంగలంగి యిక్కురంగనయన మదీయభార్య యగునని యంత
లో నందనమనంబు మగుడం దిగిచికొని నిశ్చయంబుగా నెఱుంగక తైఱంగు నందలం
పేల పుట్టె నొకో యని పశ్చాత్తాపంబునం బొంది యమ్ముదగమనం గనుంగొని మ
ఱియును॥ వ॥ హరపదపూజకుం దొలఁగి యంత్యజుఁ గొల్చి కులాభిమానముల్,
సరగున వెచ్చ పెట్టి హరిచందనకీర్తిబు వీటఁ బుచ్చితి, ష్టరమునుగువల్ల కాటికధికా



రము వచ్చిన దుష్టబుద్ధికిం, గరుణదలంప నెక్కడిది గంధగజేంద్రసమానగామినీ॥
ఉ॥ అలికులవేణి వీఁడు చతురబ్ధిపరీతమహీతలేశుఁడై, యెలరు నృపాలశేఖరుని
యాత్మజుఁడంటివి మున్ను నీవుత, జ్జ్ఞులసతి వింత దైన్యమున కుంబని లేదొకమాడ
మాత్రముం, గలుగదె నీకు నిట్లు పలుకం దగునే విపరీతవాక్యముల్॥ క॥ మాడకు మి
క్కిలి యడుగము, చేడియ మత్స్వామి మున్ను చేసిన మేరల్, జాడగ నడపం దగు
మొగ, మోడంగా రాదు మాకు మొగి నెవ్వరికిన్॥ తే॥ నీకు మతి యొండుపాయంబు
లేక యున్న, నెలఁత మాకిచ్చుమాడకు సెలవుగాఁగ, నెమ్మిఁ గైకొని మెడ నిమ్ము నీదు
కంఠసూత్రము నను నమ్మి నను కైనశోకముడిగి॥ చ॥ సరసిజనేత్ర జీవితము సత్యము
గాదు శరీరధారికిన్, మరణము నిశ్చయంబు పలువాఱు కుమారునిఁ జూచి యేడ్చి
నన్ స్మరలు నే వీని ప్రాణములు మంగళసూత్రసువర్ణ మిచ్చినీ, వరసుతు నిందహించు
మగువా యని మూర్ఛిలి శోకమగ్నుఁడై॥ వ॥ తెప్పిరిలి యప్పలుకులకు లికిపడి యమ్మ
త్తకాశిని చిత్తంబున మత్పాతివ్రత్యవిశేషంబునం జేసి మదీయగళంబున నున్న మం
గళసూత్రంబు మినుక్కపరపురుషుల కెన్నండును లోచనగోచరంబు గాదు గావు
న నిమ్మహానుభావుండు హంసకులావతంసంబగు హరిశ్చంద్రనరేంద్రుండు సం
దేహంబునం బొందవలదని యారాజపురందరుం డున్న దురవస్థకుం దన యంత
రంగంబునం గలంగి యక్కురంగనయన తన్నుఁ దానెఱుంగక మహీతలంబునకు
వ్రాలి యొక్కించుక ధైర్యంబున నెట్టకేలకుం దెలివినొంది॥ తే॥ ఓ హరిశ్చంద్ర నీపు
త్రు లోహితాస్యుఁ, జేరి చూడుము మునునీయూరుపీఠి, నిద్ర సెందిన కైవడి నేఁ
డు దీర్ఘ, నిద్ర [illegible]ఁ బొందుచున్న నిర్నిద్రతేజ॥ వ॥ అని పలికి ప్రాణేశ్వరుచరణకమ
లంబులకు నమస్కరించి కరంబు శోకంబున నిట్లనియె॥ సీ॥ పృథుశిలాస్తంభసంభృ
తమైన యీమంచె నవరత్నసింహాసనంబు నీకు, నరశిరఃకల్పితబంధురకపాలంబు
లు మంగళాచారకుంభములె నీకు, శూలాగ్రమానవస్రస్తాలకేశంబు లురమణీయ
మగు చామరములె నీకు, భూతబేతాళజంబుకనినాదంబులు కవిగాయకప్రసంగ
ములె నీకు॥ తే॥ నురుచరిత్ర మహాశ్మశానోపకంఠ, శాకినీలోకభయదశ్మశానభూ
మి, సకలరాజ్యాగ్రమానివాసంబె నీకు, సత్యగుణసంపదభిరామ సార్వభౌమ॥ సీ॥
గుమిగూడియున్న యీకొఱవిదయ్యంబులు పంజులవారలె పార్థివేంద్ర, దారు
ణఘోరవధ్వనికంచుకవ్రాతసాంద్రహుంకారమే సార్వభౌమ, ప్రీతిఁ జేరి భజించు
బేతాళనివహంబు మంత్రిసందోహమే మనుజనాథ, సందడి సేయు పిశాచులును
డిగంపు టతివలె భానుకులావతంస॥ తే॥ రుద్రభూమి యయోధ్య యేభద్రమూ
ర్తి, మంచె సింహాసనమె జగన్మాన్య, వీర్యతో డవి దైవంబు నేమని మాఱు దానఁ, గట
కటా యోహరిశ్చంద్ర కాంతిచంద్ర॥ శా॥ ఆభాగ్యోన్నతి యాసమగ్రవిభవం బా

రాజసంభాతనూ । శోభాడంబరమాభుజాబలకళాస్తోమంబులాప్రాభవం।
బోభూమీశ్వరయెందుఁబోయెనిదిధానోహోమహైశ్వర్యమిం । కేభంగిందరి
యింతువెళ్లిగొనిపెళ్లేతెంచుశోకాంబుధిన్॥క॥వైణికకరనఖముఖరితవీణానా
దములువేడ్క-వినియెడునీవో। ప్రాణేశయెట్లువినెద। క్షీణశివారవముచెవులు
చిందఱవోవన్॥ వ॥అనిబహుప్రకారంబులుశోకించునాతలిరాకుబోఁడింగనుం
గొనియమ్మహీకాంతుండుమూర్ఛాగతుండైకొండొకసేపునకుందెలిసిధైర్యాం
బుతూలబుత్రశోకంబునంగుంది కుమారునియశేషవయోరూపగుణవిశేషంబు
లంకించుచున్నజీవితేశ్వరునింజూచివివేకంబుమీఱనూరడించి చంద్రమతియిట్లని
యె॥చ॥ఇనకులసార్వభౌమమనమిద్ధఅమున్ధృతిదూలియీగతిన్।ఘనతరశోక
వహ్నిఁబడిక్రాఁగుచునుండుటబుద్ధిగాదునే।మ్మనమునఁదాల్మినిల్పుఁడీకమాను
డుదుఃఖమువేకువయ్యెఁబ్రొద్దునుబసలేదుకష్టటతతుల్వెసగూయఁగఁజొచ్చె
నెల్లెడన్॥ తే॥ఇచటదడయంగరాదునాకినుఁడుపూర్వగిరికినేతేకమున్నసత్వ
రమయరిగి।సమయసముచితకృత్యముల్సలుపకున్న।నలుగునామీఁదమిగులబ్రా
హ్మణునిగృహిణి॥ తే॥తనయుపైఁబర్వుమోహలతావితాన।మాత్మసుజ్ఞానమ
యసిశితాసిఁగోసి।యానతిండింకనేమిసేయంగనుచిత।మనిననూహించితగవ
రియగుచున్నపుడు॥ సీ॥ ఆకాంతతోడనిట్లనియెనోరాకేందుముఖిస్వామికా
ర్యంబుముఖ్యమరియ। సేలికమనమునకెడసిసత్యముదప్పియిప్పనికొడబడనెట్లు
వచ్చు। నీకనొండుమానినిన్నేలినయట్టిధాత్రీదేవునడిగియేరీతినైన।మాడయొ
కఁ-టిడమ్మమసలకవేగంబతగవునౌచిత్యంబుదలఁపుమనిన॥ తే॥బ్రాణవల్లభు
సత్యప్రభావమునకు।మిగులనచ్చెరువందియామ్మినసయన।యాత్మజునిభర్తకడని
డియప్పగించి।యధికభక్తిప్రణామంబులాచరించి॥ తే॥మఱలిపురవీధినేగమాత
జినేజింగి।కపటకృత్యధురీణుండుగాధిసుతుఁడు।నృపవధూటినివధియింపను
పమయొకటి।యాత్మలోపలయోచించెనద్భుతముగ॥ఆ॥తత్క్షణంబయొక్క-తస్క
రుఁగల్పించి। యార్యవినుతశీలస్మైనయట్టి। జనవరేణ్యుదేవిసమయింపఁదగును
పా।యంబుగఅపియరుగుమనినవాఁడు॥క॥మొలనీలికాసెయునుబద।ములనోర
చ్చులుధరించిముదముదలిర్పన్। సెలగోలయుములుబంతియు। బలపముఁగత్తి
యునుబూనిపటుసాహసియై॥ సీ॥ఆవారణాసిపురాధీశునగరిలోభీకరంబుగఁ
గన్నపెట్టిచొచ్చి। భర్మహర్మ్యాంతరనిర్మితమణిమయడోలాగ్రమునసుఖలీ
లదాచి। ప్రకటనిద్రితుఁడైనరాకొమరునిఁజేరబిగియారఁగత్తుకపిసికికెడపి।త
త్కర్ణకంఠహస్తన్యస్తమణిమయాభరణముల్గయికొనిభయములేక॥ తే॥ వెడ
లిచనిచంద్రమతికడఁవేగవచ్చి। పదమునకునడ్డమెనిల్చిప్రాభవంబు।గర్వమును



మీరఁబల్క-దస్కరుఁడుకపట।మృదులగంభీరవాచాసమేతుఁడగుచు॥ క॥ఎటకే
గెదవీపెనుచీఁ । కటినొంటిమెయున్నతాగికలతెఱఁగెల్లం। దటుకునఁజెప్పుము
నావుడు।కుటిలాలకవానిఁజూచిగురుతరభీతిన్॥ తే॥వంతఁబొందుచుఁదనదుప్ర
త్తాంతమెల్ల।నెఱుఁగఁజెప్పుటయునుమృషాకృపదలిర్ప।నాసహోదరివీవుకాం
తాలలామ।యేడ్వఁగానేమిటికినీకునివ్విధమున॥ సీ॥ అనిపల్క-తనచేతిమనుజేం
ద్రసుతుసొమ్ములన్నియుముడిగట్టియందియిచ్చె। నాసమయమునభయంకరా
కారులుయమకింకరులమించునట్టివార । లవ్వీటితలవరులత్యుగ్రకరవాలహస్తు
లైపదపదండనుచునిగిడి। చేదివియలుపూనిచెచ్చెరనేతేరవారికంటెనుమున్న
చోరకుండు॥ తే॥దొంగఁబట్టితిరండనిసంగతిగను।దలవరులలోనఁగలసియత్తలి
రుఁబోఁడిఁ।బట్టికొనిఘోరతరముష్టిఘట్టనముల। పాలవఱచుచునత్యంతభయ
దభంగి॥క॥కొనిచనివేగమభీషణుఁ।డనుతలవరిముందఱఁబెట్టయద్భుతమడరం।గ
నుఁగొనుఁడనితొలువులుద।ర్కనముగనిడిదొంగచనియెసాహసలీలన్॥ ఉ॥అంత
టభీషణుండుహృదయంబునరోషకృశానలీలల। త్యంతసమగ్రమైపెరుగునత్తఱి
ఁగెంపుజనింపమేదినీ। కాంతునిరాణివాసమునకల్మషపావనశీలఁజూచియో।
యింతినృపాత్మజున్నిశవునెట్లువధించితిసాహసంబునన్॥ తే॥కాంతయిటువం
టిబిడ్డలఁగన్నకడుపు।గాదునీకునొకింతయుఁగరుణలేక। యిట్టిపాతకమునకొ
డిగట్టితేల।చిత్రమయ్యెనుమాకునీచేఁతదలఁప॥ వ॥అనిపలుకుచునమ్మహాకాం
తునిసమ్ముఖంబునంబెట్టిననతండు॥చ॥కలుషవిహీనఁజంద్రమతిఁగన్గొనిపల్కెన
కటా।నెలఁతమహాదురాత్మకుఁడునిర్దయుఁడెవ్వఁడునిన్నుఁబంపెనిట్లులుక
నుబాలుఁజంపుమనియాభరణంబులవాంఛనీమదిం । గలిగిననిత్తునిందుకయిగా
దిలిపుత్రువధింపనేటికిన్॥ ఉ॥పున్నమచంద్రమామసరిపోలెడుచక్కనిపట్టిఁబట్టి
సం।పన్నమహోగ్రసాహసముపర్వఁగఁజంపఁగఁజేతులాడెనే। యెన్నఁడుని
ట్టిపాతకములెచ్చటనేముధరిత్రిమున్నుగ।న్గొన్నదిలేమునీకతనఁగ్రొత్తలుపుట్టె
మహోగ్రకర్మముల్॥క॥పురులకంటెనుసాహస। మిరుమూఁడుగుణంబులగ
యనెక్కుడుబింబాధరలకునని।యెడువాక్యము। తరుణీవివరింపనేఁడుతథ్యంబ
య్యెన్॥చ॥అనిధరణీశ్వరుండుహృదయంబునశోకముఘోంగభీషణుం।గనుఁగొ
నిదీనిఁజూచిననఘంబొదవుంగడువేగబాలఘా।తినిదలఁద్రెవ్వనేయుమనితెంపు
నఁజెప్పుమువీరబాహుతోఁ।గనికరమింతయున్నిటుపఁగావలదివ్యేడవేయునే
టికిన్॥ తే॥ఇంకఁబ్రత్యుత్తరంబునీవెర్రిమైనఁ।బూనిచెప్పితివేనినాయానసీకు।నిది
యముమ్మాటికినిసెలవేగుమనిన।నట్లకాకనిభీషణుడనుమతించె॥ తే॥అప్పుడుచం
ద్రమతీదేవియాత్మలోన। లేశమాత్రంబుచలనంబులేకచైవ। మెల్లవగవులుపా

ఱాంగనిచ్చెవర్ణము। తగదుచింతింపనింక డెందముననుచు॥ చ॥ తెలివిఘటిల్ల నెం
తయునుధీరతతోఁ దలవంచియేమియుం। బలుకక మైవడంకఁగను బల్మఱుమిన్నత
నేలఁ ద్రాయుచున్। నిలిచికృతాపరాధకరణిన్ధరణీపతిమ్రోలనుండె హృ। జ్జలజ
మునంద్రిలోకనుతుసత్యధనుం బ్రియునిందలంచుచున్॥ వ॥ అంతటఁ బ్రభాతసమ
యంబగుటయు॥ శా॥ సత్యశ్రీనిధి నేఁడుక్రమ్మఱ హరిశ్చంద్రక్షమానాయకుండ
త్యంతస్థిరరాజ్యపీఠముముదంబందంగనీరీతినా। చిత్యంబొప్పఁగ నెక్కెనన్నఁగ
తినక్షీణప్రభాస్ఫూర్తినా। దిత్యుండయ్యుదయాద్రినెక్కెఁ ధరణీదేవోత్తము
ల్మ్రొక్కఁగన్॥ వ॥ అంతటనాభీషణుండత్యంతరోషంబునఁ గాంతాశిరోమణి
యగుచంద్రమతిందోడ్కొనిపోవంగడిసి రాజవీథింబౌరకాంతాజనంబులు గ
నుంగొని॥ తే॥ కటకటాచిన్ని నెత్తురుగందురాజ। పట్టిచక్కనిపాపనిబట్టిచంప।
నేచిమృత్యుస్వరూపమైయెచటనుండి। వచ్చెనీపడుచులతిండియిచ్చటికెని॥ క॥ పొ
దిగిళ్ళలోనబిడ్డల। ముదమున నిడియాదమఱచిముందటిరీతిం। గొదక్కొనినిద్రింపఁగ
రో। దిదిమిగులఁ బ్రమాదమయ్యెనికనివ్వేటన్॥ క॥ ధరమీఁద నాఁడువాంగలు। ప
రికింపఁగ లేరుతొల్లిపన్నిదమునకుం। గరమాశ్చర్యముగాని। పురిలోనంగలిగిరిట్టి
బూమెలుగల వే॥ చ॥ కలుషముబాలఘాతకముగాదనియాత్మనొకించుకేనియుం।
దలఁకకయిట్టిసాహసముదారుణలీలనొనర్చెనింకనీ। యిలనిటువంటివారలకు
నెల్లభయంబుగదీనినిర్దయన్। వలయువధింపదోషములవంబును జెందదుభూ।
మిభర్తకున్॥ వ॥ అనిపలికినవెండియుఁగొందఱుదమలోనిట్లనిరి॥ క॥ ఎంతయప
రాధమొదవిన। నింతింజంపంగఁబాడియేపరికింపం। గొంతదయసేయఁదగుభూ
కాంతునకువివేకబుద్ధికలిమిదలిర్పన్॥ క॥ సొమ్మొకచోనుండఁగనప। నమ్మికయొక
చోటనుండునరులకునెపుడు। న్నెమ్మదిఁబరికించివివే। కమ్మునఁదెలియంగవలయు
గల్లయునిజమున్॥ మ॥ జలజాతాక్షీకిశక్యమేమనమునంజర్చింపనిర్భీతిఁగో। టలు
లంఘించికవాటముల్దెఱచిచండస్ఫూర్తిమైనుండుకు। కలవాకట్టినృపావరో
ధగృహాభాగంబుల్ప్రవేశించిని। శ్చలతన్సాహసలీలరాకొమరునాశ్చర్యంబుగా
జంపఁగన్॥ సీ॥ కపటమార్గమునఁదనర్చుఁ డెవ్వఁడోదోషకారియొకఁడు
తెంపుగానుపింప। శిశువుఁజంపితదీయచిత్రభూషణరాజిఁ గొనిపోవఁదలఁవరు
ల్గూడఁదలఁనుచుఁ। బోడివినభయమునముదితస్పైమచ్చంబు గాఁగనాతోడఁపులు
కట్టివైచి। చొప్పుదప్పకవాఁడుసురిఁగిననపరాధమెల్లనుదానవహించియాత్మ।
తే॥ సిగ్గుపడిరాజసభలభాషింపనోడి। లేనిదొంగతనంబుదాఁబూనియాత్మ।
లోననొకింతయును శంకనూననీక। పోవుచున్నదికాఁబోలు బువ్వఁబోఁడి॥
వ॥ అనియనేకులనేకప్రకారంబులంబలుకనకకరవాణివీరబాహుపాలికింగొ



నిపోయి మహీనాయకుండానతిచ్చినవిధంబు తెలియంజెప్పి యప్పుడంతినొప్ప
నంబుచేసిభీషణుండు తలవరులుందానునునిజగృహంబునకరిగెనిట వీరబాహుం
డును నిజాధీశ్వరునాజ్ఞోల్లంఘనంబుచేయందలంకి రయంబున నత్యంతక్రూర
వృత్తులును భయంకరకరవాలహస్తులునగు నిజకింకరులం గనుంగొని మీరలిందఱు
లుంగూడి మందగమననమ్మందగమనంబునం బరేతనికేతనంబునకుంగొని చని
యచ్చటంగదలకున్నవీరదాసునిచేతికిమ్మచ్చకంటినిచ్చి చంపింపుండనుటయు
వారునుంబనిపూని చంద్రమతిందోడ్కొనిపోయి వీరదాసునిముందఱం బెట్టి॥ క॥
క్షితివరునానతియునుదమ। పతియగునవ్వీరబాహుపంపునుగడునన। ద్భుతము
గఁజెప్పిననదివిని। ధృతిదూలికలంగియులికెదీనాననయై॥ క॥ మిగులవెఱఁగందిహా
హా। జగముననెవ్వారలింకశక్తులువిధిచే। తగడపధైర్యమునిలుపఁగ। దగునుల్లము
లోనవగవఁదగడించుకయున్॥ చ॥ అరసిరణాంగణంబునఁదృణాంకురసంగత
వక్త్రులన్భయా। కరమతులన్నిరాయుధులగర్వముసర్వమునుజ్జగించుచున్।
శరణమువేఁడువైరులనుసారకృపామతిఁ బ్రోచునేనుని। ష్కరుణఁగృపాణధా
రఁగులకాంతవధింపఁగనెట్లుపూనుదున్॥ క॥ ఈహరిణనయనఁగడపిన। స్త్రీ
హత్యయుఁగడపకున్నఁజెచ్చెరస్వామి। ద్రోహంబునుబాటిల్లెడు। నూహించిన
నాకునెద్దియుచితముచేయన్॥ వ॥ అనిబాష్పపూరితనేత్రుండై మొగంబువంచి
యున్నయన్నరేంద్రునకుంజంద్రమతియిట్లనియె॥ క॥ ఓవసుధాధిపశేఖర। యీ
వెఱఁగనిధర్మమార్గమెందునుగలదే। భావింపధైర్యమెడలక। కావింపఁగ
వలయుస్వామికార్యంబెపుడున్॥ క॥ ఊహించిచూడస్వామి। ద్రోహమమితభా
రమనుచుఁదొల్లిగరుత్మ। ద్వాహనునితోడనిస్సం। దేహంబునఁబలికెధరణిదేవి
ప్రియేశా॥ చ॥ అదియునుంగాకరాకొమరునర్భకుజంపెమహాదురాత్మురా। లి
దియనునిందఁబొందితినరేశ్వరకావుననింకనన్వధిం। పఁదగుఁదలంచిచూడననఘ
మాత్రమునొందుతలంపుమానుడీ। హృదయములోపలంగరుణనేటికినిల్పద
రిట్టినట్టునన్॥ తే॥ మానవులుదేవతలునువిస్మయములొదవ। నిచటనచటనుబా
గడమహీతలేశ। శంకఁబొందకమిగులనిశ్చలతనిలిచి। తెంపుమీఱఁగఁదెంపుమ
దీయశిరము॥ వ॥ అనియమందధైర్యంబునఁజంద్రమతిప్రాణేశ్వరుపదంబులకె
ఱఁగిముదంబునఁ గృతప్రదక్షిణయై కరకమలంబులుమొగిడ్చిదరహాసవికాసం
బులువదనంబునంబ్రకాశింప నిరంతరరక్తపంకసంసిక్తంబైచూపట్టువధ్యశిలో
పరిభాగంబునం బద్మాసనంబునంగూర్చుండిమార్తాండమండలంబుపైఁ జూ
డ్కినిలిపి॥ తే॥ నిఖిలలోకైకవంద్యయోనీరజాప్త। నాకుఁగృపతోడజన్మజన్మము
లయందు। సత్యసంశీలుఁడగుహరిశ్చంద్రనృపతిఁ। బ్రాణనాయకుఁగానొసర్పం

గవలయు॥ వ॥ అనియత్యంత తాత్పర్యంబున నాదిత్యుఁ బ్రార్థించి ప్రాణవల్ల
భు నుల్లంబునం జేర్చియుండుటయు నవ్వాలు గంటింగనుంగొని మహీపాలుం
డు తదీయ ధైర్య వివేకంబులకు మనంబున విస్మయంబునం బొంది సకలజగదా
శ్చర్యంబుగా నిశ్చలత్వంబునం గదిసి సింధువేలావలయిత వసుంధరాభారభర
ణసామర్థ్యంబున నొప్పు వామేతర భుజాదండంబునఁ బ్రచండ రిపుశిరఃఖండ
నోగ్రంబగు మండలాగ్రంబు మర్చి చంద్రమతి కంఠభాగంబునం గదియించి యు
న్న సమయంబున॥ తే॥ భానుబింబ సముజ్జ్వల ప్రభలు పర్వఁ। గదిసి గ్రక్కున నె
డఁ జొచ్చి గాధిపట్టి। చేతి ఖడ్గంబు పట్టి ధాత్రీతలేశుఁ। బలికె రోషాతిరేక సంభా
షణముల॥ ఉ॥ చాలుఁ బురేననరేశ్వర ప్రచండతరంబగు నిట్టి సాహసం। బేల యొన
ర్చెదీవు నిను నీక్షణ సేయఁగఁ బాతకంబు చం। డాలునకైనఁ గొంతకరుణారస
మబ్బు మనంబులోన నీ। బాలికఁ జూచి నంగి నిసిపాయక చంపుతలంపు పుట్టునే॥ క॥
దానవుఁడవు గాకరయఁగ। మానవుఁడవె నీవు నిన్ను మగువల జంపం। గానియ
మించె నెమ్మగుదు। వైన వసిష్ఠుండు గడుదురాత్ముఁడఁ వెందుర్॥ క॥ బలవద్గర్విత
వైరుల। గళములు దునుమంగ శక్తిగల నీ ఖడ్గం। బెలతీఁగఁ బోడుల నుబి। ట్టలుక
వధింపంగఁ దొడఁగె హాయి టుతగునే॥ తే॥ సరవిధర్మార్థ కామ మోక్షములు
నాల్గు। నీకు నొసగంగఁ జాలు వర్ణిత చరిత్ర। నీ పురంధ్రీ శిరోమణి నెట్లు చంపఁ।
బూనినాఁడవు నీ బుద్ధి పోఁడిమి దివె॥ ఉ॥ పావనమైనుతింపఁదగు భానుకులంబు
ననుద్భవించి ధా। త్రీవర వర్తనంబుడిగి దీనగతిన్ వెడలింపవానికిన్। సేవయొ
నర్చి ప్రేతవనసీమ వసించుట నీకు ధర్మమే। భావములోఁ దలంచిన నపాత్రము
నీదు చరిత్రమెంతయున్॥ చ॥ కులసతిఁ గ్రూరఖడ్గహతిఁ గూలిచి పొందెదు సౌ
ఖ్యమెల్లనిష్ఫలము దలంచి చూడ నరపాలక భార్యకునైమహాగ్రతం। దొలఁగ
కదత్తునింగి నుకతో వధియించిన శూలపాణికిన్। వెలయగ నీకుఁ గల్గిన వివేకము
బుద్ధియు లేకయుండెనే॥ ఉ॥ కావున నట్టియుగ్రతర కర్మము సాహసవృత్తిఁ జే
యుధా। త్రీవర నీతి గాదు భవదీయ వివేక విశేషమిట్టిదే। భూవలయంబులోన ని
నుఁ బుణ్యచరిత్రుఁడవంచుఁ బూనినా। నావనినాథ పుంగవ సభాంతర సూరిజను
ల్నుతింపఁగన్॥ మత్తకోకిల॥ నాకుమారికలం ద్రిలోక జనస్తుతోజ్జ్వల రూపరే।
ఖాకళానిధులైన యంత్యజ కన్యలన్వరియించినన్। నీకు మారుని ప్రాణముల్మ
ఱినీ సముజ్జ్వల రాజ్యమున్। నీకులాంగనతోడిపొందును నీకు నిప్పుడకల్గెడిన్॥ వ॥
అని బహువిధంబులం బోధించు నగ్గాధినందనుం గనుంగొని యమ్మానవాధీశ్వరుం
డు దరహసితాననుండై॥ క॥ ఓ ఋషినాయక యీసం। సార పయోరాశి తీరసం
ప్రాప్తునిగాఁ। జేరిచి యీ కాశీపురి। గౌరీపతి నన్నుఁ బ్రోవఁగరుణఁ దలంచెన్॥



చ॥ ఇతరుని బోలెఁ బల్కుము మునీశ్వర నన్ భ్రమియింపనేల యీ। గతి బహుభంగు
లంగమలగర్భునకైననుఁ బూని నిల్పిన। సత్యభయమేదిమీకెదిరి మాఱ్వలుకంగఁ ద
రంబుగాదుదు। ష్కృత నిబిడాంధకార సరసీరుహబాంధవ నాకు శక్యమే॥ క॥ అన
ఘాత్మ మీరు మును నుడి। విన బుద్ధులెకాక నేఁడు వింతలు వివరిం- చిననిందులోన నే
విఁక। జనుఁ డేమియుఁ బలుకవలదు సారెకు నన్నున్॥ తే॥ పలుమఱును మీకు నిన్ని చె
ప్పంగనేల। చేతి ఖడ్గంబు విడువు కౌశిక మునీంద్ర। యిట్టితఱి నుండఁ జనదు మీకిచ్చట
నిట్లు। వేగ విచ్చేయుఁడిది నాదు విన్నపంబు॥ వ॥ అనుటయు నా హరిశ్చంద్రన రేం
ద్రుని నిత్యసత్యప్రభావంబునకు నత్యాశ్చర్యంబునం బొంది మృషావాదిం జేయు
దునను తలంపు ముద్రించి విశ్వామిత్రుండు తపోవనంబునకుం జనియె నప్పుడంబ
రంబునం బ్రమోదంబునం జెలంగి నిజాంగనాసమేత ఖేచర వ్రాతంబుల సమానం
బులగు విమానంబు లెక్కి క్రిక్కిఱిసి విస్మయంబు పొదువం గనుంగొనుచుండ నఖం
డ సాహసంబున నమ్మహీమండలేశ్వరుం డాఖండలకరవజ్రప్రచండంబగు కరవా
లంబున నారోలంబవేణి కంఠనాళంబు వ్రేయుటయు నవ్వేటు ప్రసూనదామకం
బుగతినభిరామంబగుచుఁ బురంధ్రీ శిరోమణిగళంబునం గీలుకొనిన శిరఃకంపంబు
చేసి మహీవల్లభుండు॥ క॥ కలహంసగమన ద్రెవ్వని। గళమునిరీక్షించి వివిధ గర్విత
రిపుభూ-తలపతుల మెడలు దునుమం। గలకరఖడ్గంబు చూచి కడు విస్మితుఁడై॥ తే॥
దారితప్పెనో గంటి యీతన్మికంటి। శీలమెట్టిదో కాక కౌశిక మునీంద్రు- జాల
మోమద్భుజాశక్తి దూలిచనెనో। పొంగియుం కొంకక-మాటు వ్రేయంగవలయు॥
క॥ అసి పోవఁగ వచ్చునె నా। యసి పోవక యంచు మిగుల నాగ్రహలీలం- గొసరక
మతి యుసు హుస్నుని। యసమగతిం బూని వేయు నా సమయమునన్॥ శా॥ పక్షీం
ద్రధ్వజ పద్మజ ప్రముఖులా బర్హిర్ముఖుల్గాల్వఁగా। నక్షాధీశ్వరు నెక్కి- శైల
తనయాయుక్తంబు గా భక్తసం- రక్షాదక్షుఁడు విశ్వనాథుఁడు సువర్ణ గ్రావకో
దండి దా। సాక్షాత్కారముఁ బొందె సత్యపహరిశ్చంద్రక్షమాభర్తకున్॥ సీ॥
ఆకాశగంగతో నమృతాంశు రేఖతోఁ బల్లవారుణ జటాభరముతోడ। ఫాలలో
చనముతో ఫణికుండలములతోఁ గాలకూట వినీల గళముతోడ-। హరిణడింభంబు
తోనజగవధనువుతో డమరుశాత త్రిశూలములతోడ। నజశిరోమాలికా గజచర్మ
ములతోడ భసితాంగరాగ విభ్రమముతోడ॥ తే॥ సౌరభోజ్జ్వల పుష్పవర్షంబు
తోడ। దివిజసందోహ రణిత వాదిత్రశబ్ద- సహిత నారద వల్లకీ స్వనముతోడ। శి
వుఁడు గిరిరాజకన్యకాధవుఁడు పొలిచె॥ వ॥ ఇవ్విధంబునఁ జంద్రశేఖరుండు ప్రత్య
క్షుం బగుటయు నవ్వసుంధరాధ్యక్షుం డత్యంతభక్తితాత్పర్యంబును సంభ్రమం
బును బ్రియంబును భయంబును వినయంబును విస్మయంబును నయంబును నుల్లంబున

న్నొక్కమొగిం బొక్కటిల్ల దేహంబునం బులకాంకురసమూహంబు లసమానంబులై జనియింప నానందబాష్పబిందుబృందంబులు నయనారవిందంబులం దొరుఁగ సాష్టాంగదండప్రణామం బాచరించి లేచి నిలిచి ముకుళితకరకమలుండై॥ సీ॥ జయ పార్వతీమనోజలజాతమార్తాండ జయరసాతలవిభూషణకరండ। జయగజాసురగర్వజలదజగత్ప్రాణ జయభక్తలోకరక్షాధురీణ- జయఫాలలోచనజ్వలనజితానంగ జయపాణిసంభృతోజ్జ్వలకురంగ। జయవియద్వాహినీశశికళాకోటీర జయకుందచందనసమశరీర॥ తే॥ జయరమాధీశ భారతీప్రియపురంద। రాదిగీర్వాణమకుటవిన్యస్తరత్న- పటలశోభావిభాసితపాదపద్మ। జయమనోహరకలధౌతశైలసదన॥ క॥ అని బహువిధముల భక్తిని। వినుతించుచునున్న భూమివిభుఁ జూచి కృపా-వనరాశి భక్తజనశో। భనదాయి మహానురాగభరితాత్ముండై॥ ఉ॥ భూపకులాగ్రగణ్య నినుఁ బోలు నృపాలురు లేరు చూడఁగా। నీపదునాల్గులోకముల నెంతయు మేలు నితాంతసూనృతా। లాపవిశేషధైర్యగుణలక్షణసాహసవైభవక్రియా। దీపితమయ్యె నీనడత దివ్యమునీశ్వరవర్ణనీయమై॥ క॥ అచ్చముగ మూఁడు మెచ్చులు। మెచ్చితిఁ జిత్తమున గరుణ మిక్కుటమయ్యెన్-నిచ్చలముగ నడుగు మునీ। కిచ్చెద వలసినవరంబు లెయ్యవి యైనన్॥ తే॥ అనుచు డాయంగ రమ్మని యాదరించి। మృదులకరపంకజంబున మేను నిమిరి- గౌరవం బొప్ప దాపలికంటి చూపు। పరఁగ నిగిడించుటయు మహీపాలవరుఁడు॥ వ॥ లజ్జావనతవదనుండై యేమియుం బలుకనేరక యూరకున్నం దదీయమనోభావం బెఱింగి యబ్జభవజారాతి సెలవిఁ బాఱఁగ నవ్వి యిట్లనియె॥ చ॥ దలముగ మేన నెల్ల భసితం బెసలార నలంది చర్మమి। మ్ములమొల గట్టి భూతగణముల్ భజియింపఁగ నిప్పరేతభూ - ములవసియించినట్టి ననుబోలినవాఁడవు నీవు నీకు నో। నలినహితాన్వయాభరణ నానవహింపఁగ నేటికి స్మయున్॥ మ॥ ఇది గాధేయుమహేంద్రజాలము ధరిత్రీశా సమస్తంబు స। మ్మద మొప్పన్ వినిపించెద న్వినుము యుష్మత్సూనృతాలాపసం-పద మెల్లం దెలియంగఁ గోరి చలముం బంతంబు రెట్టింపయి। ట్టిదశం గుందఁగఁ జేసె మౌని తన కౌటిల్యంబు పాటిల్లఁగన్॥ సీ॥ ఇది ప్రేతభూమి గాదిన కులేశ్వర పావనం బగు యజ్ఞవాటంబు గాని। యస్థిప్రోవులు నను గావ మిత సూనృతవచస్సౌభాగ్యబహుసమిత్సమితి గాని- ఘనకపాలములు గావనవద్యసాహసవిమలోపకరణపాత్రములు గాని। రక్తపూరము గాదు రాజన్యలోకైకనాథ హయ్యంగవీనంబు గాని॥ తే॥ కడిఁది కొఱ్ఱులు గావు సంగరజయాంక। పాదుకొల్పిన భూరియూపములు గాని- చికురజాలంబు గాదు శిక్షితసమస్త। విమతనరపాలనవకుశవితతి గాని॥ క॥ ఓరి నినుభృత్యునిం గా। నేలిన యవ్వీరబాహుఁ డిలలో పలఁ జం-డాలుఁడు గాఁడు కృతాంతుఁడు। నా



ళీకహితాన్వయాబ్ధినక్షత్రేశా॥ క॥ నీసతిఁ బిలిచి తలంకక। దాసిం గా నేలు నతఁడు తర్కింపంగా- భూసురుఁడు గాఁడు మాయా। వేసపుఁ గలిరాజు గాని విమలచరిత్రా॥ తే॥ నీకు డెందంబులోన సందేహ మేల। చేరి విశ్వాస మొదవ వీక్షింపు మనుచు- శుద్ధమతి దివ్యదృష్టి యిచ్చుటయు సర్వ। మును గనుంగొని వెఱఁగందె మనుజవిభుఁడు॥ వ॥ ఆనందకందళితహృదయారవిందుండై చంద్రమతియుం దానును న్మందాకినీమౌళికిం బునఃప్రణామం బాచరించి వినయవినమితోత్తమాంగుండై॥ ఉ॥ శ్రీనగజేశ మీకరుణఁ జేసి మదీయములైన యట్టియ। జ్ఞానమహాంధకారములు సర్వము నాకుఁ దొలంగిపోయె సుజ్ఞానదివాకరోదయము చాలఁగ సొంపు వహించె నీభవాం। భోనిధి నేఁటితో డనను బూని తరింపఁగఁ జేయుఁడీ దయన్॥ క॥ మీపదపంకజసేవా। నైపుణమానసునిఁ జేసి నను సత్కరుణం- జేపట్టి ప్రోవు భూధర। చాపజగద్భరితరూపచంద్రకలాపా॥ తే॥ నిన్ను హృదయాంబుజంబున నిండువేడ్క। గొలసద్భక్తి నిల్పఁగల్గుటయుఁ దక్క - వరము లొండెవ్వియును నొల్ల వరమునీంద్ర। సముదయార్చిత నీదు పాదములయాన॥ వ॥ అని పలికినప్పు డమ్మహాదేవు వామాంగంబున నున్న సర్వమంగళ చంద్రమతిం గనుంగొని॥ ఉ॥ ఓపికవాణి నీకుఁ గల యోపిక వాణికి లేదు వార్ధివే। లాపరివేష్టితక్షితితలంబున నీ సరి లేరు భామినుల్-నీపతిభక్తియు క్తియును నీమతిశుద్ధియు నీవివేకవా। నైపుణమున్ భుజంగకులనాథునకైన నుతింపశక్యమే॥ క॥ గళమున నొప్పెడు నీమం। గళసూత్రము పెంపు గాదె గణుతింపఁగఁ బె-క్కులు భయదోపద్రవములు। దొలఁగించె భవత్ప్రియునకుఁ దోయజగంధీ॥ మ॥ చిరకాలంబు సమగ్రరాజ్యవిభవశ్రీఁ జెందివర్ధిల్లియీ। ధరణీమండల మేలు నీధవు ప్రియభర్తం గూడి యేతెంచి సుం। దరి మాయొద్ద నెయుండు మంతయుఁ గృతార్థత్వంబు మైనిప్పుడే। వరమైనం దగ వేడు మిచ్చెద గడు న్వాత్సల్య ముప్పొంగఁగన్॥ వ॥ అనుటయుం జంద్రమతి యగ్గిరీంద్రనందనచరణారవిందంబులకుం బ్రణమిల్లి యోతల్లీ యిప్పటభేదనం బేలు మహావల్లభునకు మాపుని సజీవునిం జేసినాకుం బ్రాపించిన నిందతొలంగం జేయు మనిన నమందసంతోషితస్వాంతయై యమ్మహీపాలబాలకుం డింతకు మున్న బ్రిదుకు భవత్తనూజు ప్రాణంబు లిచ్చితిఁ బరమహర్షంబునం బొందు మను సమయంబున॥ చ॥ పొలుపుగ నిద్రమేల్కని నపోలిక నల్లన లేచి వచ్చెఁ గో। మలపదపద్మసంఘటితమంజులనూపురకింకిణీరవం। బులుగచుఁ బర్వ లేనగవు ముద్దుల చెక్కులఁ బొంగలింపను। జ్జ్వలమతి లోహితాస్యుఁడు నిశాకరతుల్యుఁడు సంభ్రమంబునన్॥ తే॥ ఇట్లు వచ్చిన నందను నెలమిఁ దొలఁకఁ। జంద్రమతి చూచి యానందజనితబాష్ప। కణము లుప్పొంగ నక్కున గదియఁ నొత్తి- యమరఁ గౌఁగిటఁ జేర్చి ముద్దాడుచుండె॥ క॥ ఆవేళఁ గౌశికుఁడు మల। జ్జావనతశిరస్కుఁడై

గుచు నాగ్రహమెల్లం । బోవంగ విడిచి యతిరౌ - ద్రావహముగఁ జింతనొంది యద్భుతమడరన్॥ క॥ చిరకాలార్జితమగు మ। త్పరమతపోధనము గంటివడి కఱదఱిఁగెన్- దురహంకృతి నేఁ బలికిన। నిరుపమఘోరప్రతిజ్ఞ నెపమున నకటా॥ ఉ॥ పాకవిరోధి యేమిటికిఁ బ్రశ్న మొనర్చె సమస్తతాపసా। నీకము నూరకుండ నతినిర్భరగర్వము పూని బేలనై। తోకొని యవ్వసిష్ఠమునితోడుత నేటికి నాగ్రహించితిన్ - నాకు వివేకహీనత మనంబున నేటికిఁ బుట్టెనయ్యెడన్॥ ఆ॥ కమలభవునితోడఁ గర్వించి ప్రతిసృష్టిఁ। జేయఁ జాలినట్టి నాయశేష-మతివిశేషమెల్ల మందీభవింపంగ। పట్టి జగడమేల పెట్టుకొంటి॥ వ॥ అని పశ్చాత్తాపంబునం బొందుచు నమ్మహారమణుం గనుంగొని రారమ్మని యాలింగనాదిసంభావనంబుల మనంబలరించి యిట్లనియె॥ క॥ మిగులఁ బ్రయాసమునొందితి। వగణితసూనృతవచస్సముంచితనిర్వై- ర్యగుణప్రాగల్భ్యంబులు। జగదాశ్చర్యంబులార్యసంస్తుత్యంబుల్॥ తే॥ నిత్యమై యొప్పు భవదీయసత్యమహిమఁ। దెలియఁ గోరి మనంబునఁ దలఁకకేను- వితతకపటక్రియావృత్తి సతిని నిన్ను। బాధనొందించి కడు నపరాధినైతి॥ క॥ క్షమియింపుము నా యపరా। ధములన్నియు దయదలిర్పఁ దావకసామ్రాజ్యము గైకొని యేలుము పూ। జ్యము గానిఁకఁ బ్రోవు భూప్రజల సిరిఁ దొలఁకన్॥ చ॥ అనవిని నవ్విభాకరణి నానతి యియ్యఁగ నీకుఁ బాడియే। మునికులచంద్ర మీరు జగముల్గానియాడగ నుండువారు మీ। కుసునపరాధముల్ గలవె కోరికలేరి కతెత్త మీకతం-బునఁ గడుమించె నా యశము పొందుగ నెల్లెడ నేఁటితోడుతన్॥ క॥ నా మనవి యొకటి వినుమిఁక। నో మునికులతిలక మఱచియును రాజ్యమున- న్నేమతి మగుడఁగఁ గొనుమని। యేమియుఁ బలుకకుఁడు నాకు నింతియ చాలున్॥ ఆ॥ హీనమతి స్వదత్తమైనను బరదత్త। మైన ముల్లు మోపునంత మేర- భూమి యపహరించి పోవంగఁ ద్రోచిన। యతఁడు నరకగామి యండ్రు బుధులు॥ శా॥ నీకిష్టుండగు పార్థివేశ్వరుని చే నిత్యప్రసన్నుండవై। యేకచ్ఛత్రముగాఁగ నీక్షితితలం బేలించి పాలింపుము- స్తోకప్రాభవలీల నేలుము జయశ్రోణీతలేశుండరి। క్ష్మాకాంతధ్వజినీవనీచయమహాదావానలస్ఫూర్తివై॥ ఉ॥ నావుడు లెస్సయయ్యె నరనాథశిరోమణి యిట్లు చేయుదున్ -। నీవు మదిష్టభూపతివి నిన్నుఁ బ్రియంబున నిల్పెద న్ధరి- త్రీవలయంబు సర్వమును దేజము పర్వఁగ నేలుచుండు మీ। నావచనంబమోఘము మనంబున సంశయమింక నేటికిన్॥ తే॥ ఇందు కొడఁబడకుంటి వేనృపవరేణ్య। పూని బొంకితినని పొమ్ము పోవకున్న। నరసి నే నెట్లు చెప్పితి నట్లు చేసి। కీర్తిఁ బొందుము సత్యవిస్ఫూర్తి మెఱయ॥ క॥ మును దేవసభామధ్యం। బున నా చేసిన ప్రతిజ్ఞ భూవర తప్పఁడ। జను నే ప్రతిజ్ఞాభంగం। బునకం బెను దురితమెట్టి బుద్ధిఁ దలంపన్॥



ఉ॥ నలినసుహృత్కులీనపదునాల్గు మహాయుగముల్ వసుంధరా। స్థలికి నధీశుఁగా నిను ముదంబున నిల్పెద నంచుఁ బూని నేఁ। బలికిన వాఁడ నా ప్రతిన ప్రౌఢి వహింపఁగ నంతకాలమున్। జలధిపరీతభూతలము సర్వము నేలు ప్రజానురాగివై॥ క॥ మఱి మీఁద నాకశాసను। సరిగద్దియ నొగిఁ జతుర్దశమహామన్వం। తరములు నిలిపెదనని నేఁ। దిరముగఁ బల్కి-నాఁడ ద్రిదశులు వినఁగన్॥ క॥ అందాఁక నుండుమధికా। నందంబునఁ బొంది నీవు నాకంబున సం। క్రందను మాటగద్దియ। నిండుక శాధరుని యానయిఁక నేమనినన్॥ ఆ॥ అనిన నొండు పలుక నాత్మలో శంకించి। యినకులాధినాథుఁ డేమియనఁగ। నేమియగునొ యనుచు నెంతయుఁ జింతించు। చున్నయంత శిష్యులోలిఁ గొలువ॥ ఉ॥ తోయజగర్భసన్నిభుఁడు దుష్కృతపర్వతవజ్రపాణి యా। మ్నాయరహస్యవేది యసమానతపోవిభవప్రభావధా। రేయుఁడు శైవమార్గసుచరిత్రుఁడు పాత్రుఁ డరుంధతీసతీ। నాయకుఁడవ్వసిష్ఠమునినాథుఁడు వేడుక వచ్చెఁ జెచ్చెరన్॥ గీ॥ వచ్చి రాజీవబాంధవవంశతిలకు। నెదుర నిలుచుటయును బూచి హృదయమలర। ముక్కిరి యిట్లని పలికె నో మునివరేణ్య! మిగులఁ బుణ్యుఁడవైతి నేమీకతమున॥ చ॥ పరసముతోడ మోపి సులభంబుగ లోహముఁ గాంచనంబుగాఁ। బరువడిఁ జేసినట్లు నిరపాయతపోమహామానుభావ బం। ధురుఁడవు గాధినందనుని తోడుత నన్నొనయించి సత్యసు। స్థిరతరకీర్తిమంతునిగఁ జేసితి రెంతయు సత్కృపారతిన్॥ క॥ భూతలనాథుల లోపల। నాతతమగు కీర్తి నేఁ గృతార్థుఁడనైతిన్। మీతలఁపాన తియిండికఁ। నే తెలుఁగున నడతు నుచితమెయ్యది యనినన్॥ ఉ॥ శ్రీకరసత్యవైభవవశీకృతచంద్రకళావతంస యి। క్ష్వాకుకులకీర్తి నీకతన నవ్విమయించె ధరిత్రిమీఁదఁ సు। శ్లోకుఁడవీవు నీకుఁ గల సూనృతధైర్యవివేకదానరే। ఖాతలితప్రతాపములు గన్గొనమెవ్వరియందు నెచ్చటన్॥ క॥ అనఘాత్మ నా పురోహితుఁ। డని యెంతయు నాదరించి యరుదుగ నాచే। సిన ప్రతిన దప్పకుండఁగ। నను గెలిపించితివి త్రిభువనంబు లెఱుఁగన్॥ క॥ ఈ కౌశికమునిపుంగవుఁ। డే కరణి న్మెలఁగుమని యెనే పారంగా। నా కరణిన మెలఁగందగు। నాకాధిపసదృశ యిది యనాదు తలంపున్॥ క॥ నావుడు గురువాక్యంబులు ద్రోవక గాధేయు నాజ్ఞతో రఘుభర్తన్। గావింపననుమతించె మహీవల్లభుఁ డంత నిజరేంద్రుఁడు కడఁకన్॥ సీ॥ మదనారి పనుపున మణికుంభములవియన్నది వారి దెప్పించి నరవరేణ్యు। జానొందమంగళస్నానంబు చేయించి వరవస్త్రబహువిధాభరణగంధ। మాల్యాదివస్తుసామగ్రి చే నెంతయు శ్రీలు మీఱఁగ నలంకృతులొనర్చి। చంద్రకాంతశిలావిశాలవితర్దికోపరిభాగమునఁ జాలఁ బ్రభుత మీఱ॥ తే॥ మేరుశిఖరంబుతోడుత మేలమాడు। భద్ర

సింహాసనంబునఁ బరఁగ నునిచి - యగ్రజన్ములనుచితదానాదివిధులఁ । బ్రీతచి
త్తులఁ గావించి ప్రియము వెలయ॥ వ॥ ఇందుశేఖరుకృపావిశేషంబున నవ్విశ్వం
భరామండలంబు సమస్తంబును మోదంబున నేలుమని సమగ్రవైభవంబునఁ బ
ట్టంబు గట్టె నాసమయంబునం గమలాసనాదిగీర్వాణులు వసిష్ఠవిశ్వామిత్రాది
సంయమిజనంబులు ననేకప్రకారంబుల నాశీర్వదించి మంత్రాక్షతంబు లిడి రప్పు
డు॥ సీ॥ దివి నాదిత్రేయవాదిత్రము ల్ఘోషించెఁ గురిసెను గుప్పగా విరులవాన। గం
ధర్వకామినీగానము ల్విలసిల్లె నప్సరస్త్రీల నాట్యములు చెలఁగె। నత్యంతసౌరభ
శైత్యమాంద్యంబుల మలయానిలము వీచెఁ గలయ దిశల। దహనుఁ డొప్పారెఁ బ్ర
దక్షిణార్చుల చేత నినచంద్రదీధితు లేపు చూపె॥ తే॥ భుజగవంశాధినాథదిగ్గజవ
రాహ। కూర్మ[illegible]ల పర్వతంబులు కుతలభార। మెడల విశ్రాంతి వహియించె నె
లమి దోఁక। సకలజీవులు పొదలిరి సమ్మదముల॥ వ॥ తదనంతరంబ॥ తే॥ చంద్రశే
ఖరుఁ డా హరిశ్చంద్రుఁ జూచి। యీవు సాకేతపురమున కేగుమనుచు। హరివి
రించిపురందరాద్యమరవరులు। గొలువ వెంచేసె గైలాసకుధరమునకు॥ క॥
అంతటఁ దద్వృత్తాంతం। బంతయు నారదునివలన నమరఁగ వినియు। త్యంతప్ర
మోదభరితస్వాంతుం డై సత్యకీర్తి సంభ్రమ మొప్పన్॥ క॥ తన్మకాంత మౌళిర
త్నము। రాకపురిం జాటఁ బంచె రయమున నా ద్వా। ర్తాకర్ణనసంజనితమ। హా
కౌతుకములఁ జెలంగి రా పౌరసతుల్॥ వ॥ బహుప్రకారంబుల నత్యంతరమ్యం
బుగాఁ బురంబలంకరించి రా సమయంబున నపరిమితకరిహయరథపదాతిస
మేతుండై మంగళతూర్యరవంబులు చెలంగ నుప్పొంగి సమగ్రవైభవంబున॥ ఉ॥
పున్నమనాటి రేయి పరిపూర్ణసుధాకరు రాకఁ గాంచి సం। పన్నకుతూహలస్ఫు
రణ పర్వఁగ నంబుధిరాజు దా నెదు। రేఁగిన విధంబున న్నృపశిరోమణి రాకకు
సత్యకీర్తియు। త్యున్నతభక్తియుక్తి చెలువొంద నెదుర్కొని యెంబ్రియంబునన్॥
తే॥ ఎదురుకొని సంభ్రమంబున నినకులేశు। నంఘ్రిపంకజములకు సాష్టాంగ మెఱ
గి। కేలుదమ్ములు శిరసుపైఁ గీలుకొలిపి। పలికె నిట్లని వినయసంభాషణముల॥ ఉ॥
సాంద్రయశోవిమావిభవ సత్యవచోమణిహారి యో హరి। శ్చంద్ర నరేంద్రవంశవ
నచైత్ర యమిత్రజయిప్రతాపని। స్తంద్ర పురందరాదివిభుదవ్రజరంజితపట్టభద్ర
భో। గీంద్రున కైన శక్యము గునే నుతియింప భవత్ప్రభావముల్॥ మ॥ అనఘుండైన
వసిష్ఠుతో నొఱసి లోకాశ్చర్యధుర్యంబుగాఁ। దన యక్షీణతపోవిశేషగరిమన్ దర్పిం
చి బ్రహ్మర్షి నై। వినుతిం బొందిన వేదమూర్తి త్రిజగద్విఖ్యాతుఁ డగ్గాధినం। ద
నుఁ డెంతే వెఱఁగంద నిల్పితివి నిత్యంబైన సత్యంబిలన్॥ తే॥ మహిమతో నింక బూ
జ్యసామ్రాజ్యలక్ష్మి। వెలయ నైకొని భూప్రజావితతిఁ బ్రోవ। వేగ విచ్చేయుఁడ



యన్న వించుటయును హర్షమొదవంగ దరహసితాస్యుఁ డగుచు॥ చ॥ సముచిత
వాగ్విశేషముల సంతస మొందఁగ సత్యకీర్తిను। త్తమసచివాగ్రణిన్ నిజహితస్థి
రకార్యరహస్యవేది దు। ర్వ్రమతసమూహసంహరణవిక్రము నిందగ నాదరించి వీ
ర। త్నమయ వినూత్నకాంచనరథంబు ముదంబున నెక్కె నున్నతిన్॥ సీ॥ అమలఁ బు
లగు చతురంగబలంబులు గరిమ దీపించి నల్గడలఁ గొలువ। హృద్యంబులై బహువా
ద్యరవంబులు మ్రోయ మాగధగానములు చెలంగ - వందిబృందములు కైవారము
ల్గావింపఁ జేరి పుణ్యస్త్రీలు సేసలిడఁగ। గంకణఝుణఝుణత్కారముల్ చెలరేఁగ
రమణులు వింజామరములు వీవఁ॥ తే॥ గలికికన్నులవారకాంతలు పసిండి। పళ్లెరం
బుల రత్నదీపములు నించి - యిందు వేడ్క నివాళింప నిజపురంబు। మంచిశుభలగ్నము
నఁ బ్రవేశించె నృపతి॥ వ॥ ఇవ్విధంబున నంబురంబుఁ బ్రవేశించి రాజమార్గంబున నం
జను దెంచునప్పుడు॥ సీ॥ అరవిందనాథుఁ డీ యవనీతలేశ్వరుఁ డిందిర యీ శరదిం
దువదన। పాకశాసనుఁ డీ దివాకరాన్వయభర్త పౌలోమి యీ పురంధ్రీలలామ।
నీహారకిరణుఁ డీ నిత్యసత్యధనుండు రోహిణి యీ పంకరుహదళాక్షి - ప్రసవకో
దండుఁ డీ రాజదేవేంద్రుండు రతిదేవి యీ లోకనుతచరిత్ర॥ తే॥ యని హరిశ్చంద్ర
సార్వభౌమాగ్రగణ్యుఁ। జంద్రమతిఁ జూచి యానందజలధిఁ దేలి - పౌరజనబృంద
ములు సుధాసారమధుర। చిత్రవాగ్వైఖరులఁ బ్రశంసించి రెలమి॥ వ॥ ఇవ్విధంబు
నం బౌరజననికాయసంస్తూయమానుండై హరిశ్చంద్రుండు మహానందంబునం
బొంది నిజమందిరంబుం దఱిసి సముచితవర్తనంబులం బ్రవర్తించుచు నయమా
ర్గంబునం బ్రజాపరిపాలనశీలుండై పూజ్యంబగు రాజ్యంబు సేయుచుండె నని॥ క॥
మునిపతి మార్కండేయుం। డనఘుండు యుధిష్ఠిరునకు ననురాగమునన్ - వినిపిం
చె హరిశ్చంద్రావనినాథుకథాక్రమం బవార్యప్రౌఢిన్॥ ❋

శా॥ వాగ్భోగీంద్రసుపర్వసింధురశరద్వార్వాహతారాసుధారు
గ్భ్రమార్ణచలచాపగోపగరుడక్రోటిచ్ఛటామల్లికా। స్రగ్భ
విభ్రమశుభ్రకీర్తిరుచిహారశ్రేణికావిస్ఫుర। ద్దిగ్భామాకుచ
మండలాగ్రవివిధార్థివ్రాతచింతామణీ॥ ❋

క॥ అలఘుప్రతాపకుతుబన। మలకేంద్రకృపాసమగ్ర[illegible]మహి
మాన్వితకో। రాలనిగ్రామనికేతన। జలసీమారక్షణైకచా
తుర్యనిధీ॥ ... ... ... ... ... ❋

ఉత్సాహ॥ రాట్సభాంతరాళధీధురంధరప్రశస్తప్రా।
వృట్సమాగమాంబుభృన్నవీనదానగర్వితా।
ద్వీట్సమాజదంతిసింహధీరతామరాచలా।
షట్సహస్రవంశదుగ్ధసాగరక్షపాధిపా॥

గద్య - ఇది శ్రీమదాపస్తంబసూత్రపవిత్ర కౌండిన్యమునిచక్రవర్తిగో
త్రసకలసుకవిజనానీకమిత్ర జేచనామాత్యకుమార వినయవి
వేకవిద్యాలంకారశంకరనామధేయప్రణీతంబైన
హరిశ్చంద్రోపాఖ్యానంబనుమహాప్రబంధంబు
నందుసర్వంబునుబంచమాశ్వాసము
సంపూర్ణము.

హరిశ్చంద్రోపాఖ్యానము - ముగిసెను.





S, R, V. PRESS MADRAS.

